# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 6 సంచిక : 7 హైదరాబాద్ 84 జూలై 2008 పేజీలు : 52 రు. 10

- ఫోకస్ : ప్రత్యేక ఆర్థిక మండలాలు
- కర్ణాటకలో కమలహాసం
- ఆంధ్రజ్యోతి - ఎమ్మార్పీఎస్ వివాదంపై రెండు వ్యాసాలు
- ఇంగ్లీషు మాధ్యమం పై రెండు వ్యాసాలు
- ప్రజలపై పెట్రో ధరల పెనుభారం

## వీక్షణానికి మీ చేయూతనందించండి !

ఆరు సంవత్సరాలుగా ప్రతినెలా మీతో సంభాషిస్తూ, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపై కొత్త ఆలోచనలను, వైవిధ్యపూరితమైన చర్చను ప్రోత్సహిస్తూ, మీ ఆదరణ చూరగొంటూ వస్తున్న వీక్షణం తన ఆర్థికస్థితిని కూడ మీతో పంచుకోదలచుకుంటున్నది.

వీక్షణం ఇప్పుడు నడుస్తున్న పద్ధతిలో, పెరుగుతున్న న్యూస్ ప్రింట్ ధరలు, ప్రింటింగ్ ఖర్చులు, కార్యాలయ నిర్వహణ, పోస్టింగ్ వంటి ఖర్చులన్నీ కలుపుకుంటే ఒక్కొక్క ప్రతికి ఉత్పత్తివ్యయం రు. 14 గా ఉంటున్నది. కాగా ప్రతి సంచికకూ చందాదారులు చెల్లించేది రు. 10. అందులో పోస్టేజి ఖర్చులు మినహాయిస్తే వాస్తవంగా చెల్లిస్తున్నది రు. 9 కన్న తక్కువ. పత్రిక విడిప్రతిని దుకాణాలలో కొనుక్కునేవారు రు. 10 చెల్లించి కొనుక్కున్నపటికీ, ఏజెంట్ కమిషన్ పోగా వారి నుంచి పత్రికకు అందేది ఒక్కొక్క ప్రతికి రు. 6 మాత్రమే. అంటే పత్రిక ఒక్కొక్క ప్రతి చందాదారుల విషయంలో రు. 5 లోటుతో, విడిప్రతి కొనుగోలుదారుల విషయంలో రు. 8 లోటుతో నడుస్తున్నదన్నమాట. పత్రిక ఎన్ని ప్రతులు ఎక్కువ అమ్ముకమైతే అంత ఎక్కువగా లోటు పెరుగుతుందన్నమాట. ప్రస్తుతానికి ప్రతినెలా రు. 25,000 లోటుతో పత్రిక నడుస్తున్నది. ఏ పత్రిక అయినా తన ఉత్పత్తి వ్యయాన్నంతా పాఠకులనుంచే రాబట్టడం జరగదు. ఉత్పత్తివ్యయంలో కొంతభాగాన్ని ధరగా నిర్ణయించి మిగిలిన భాగాన్ని వ్యాపార ప్రకటనల రూపంలో సేకరించడం ఆనవాయితీ. ఎన్ని ఖర్చులు పెరిగినా గత నాలుగు సంవత్సరాలుగా ధరనుగాని, వార్షిక చందాను గాని పెంచలేదని, వీక్షణంకు ఇప్పటివరకూ ప్రభుత్వ ప్రకటన తప్ప ఇతర ప్రకటనలు కూడా ఎక్కువగా రావడం లేదని మీకు తెలుసు. వీక్షణం ను నిర్వహిస్తున్న సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ సంస్థ సర్వేలు చేయడం ద్వారా సంపాదించిన నిధులను వీక్షణం కొరకు ఖర్చుపెడుతున్నది. ఆ పరిస్థితి ఇంకా ఎక్కువ కాలం కొనసాగే అవకాశం లేదు.

ఈ పరిస్థితిలో వీక్షణంను ఆదుకొని, ఆర్థికవనరులను కల్పించి, మనుగడను సుస్థిరం చేయవలసింది మీరే. ఇది మీ పత్రిక, దీన్ని కాపాడుకోవడం, పది కాలాలపాటు నిలిచేలా చూడడం మీ బాధ్యత.

అందుకోసం

- పాఠకులందరూ చందాలు కట్టవచ్చు.
- ప్రతి చందాదారూ మరొకరిని చందాదారుగా చేర్పించవచ్చు, లేదా మిత్రులొకరికి వీక్షణం సంవత్సర చందా కానుకగా ఇవ్వవచ్చు.
- మీ గ్రామంలో, పట్టణంలో మీకు తెలిసిన దుకాణదారు వీక్షణం తెప్పించేలా, సక్రమంగా బకాయిలు చెల్లించేలా చూడవచ్చు.
- మీకు తెలిసిన వారెవరయినా వ్యాపార ప్రకటనలు ఇవ్వగలిగిన స్తోమత, అధికారం కలిగి ఉంటే వారిద్వారా వీక్షణంకు ప్రకటనలు ఇప్పించవచ్చు.

**వీక్షణంను ఆదుకొండి**

**తెలుగునాట ఇటువంటి పత్రిక ఇది ఒక్కటే, దీని మనుగడకు, విస్తరణకు మీ చేయూతనందించండి**

**చందా వివరాలు**

| | | | |
|---|---|---|---|
| సంవత్సర చందా | రు. 120 | మూడు సంవత్సరాల చందా | రు. 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. 550 | పది సంవత్సరాల చందా | రు. 1000 |


**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : reachcdrc@yahoo.com, సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

వీక్షణం 84
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జూలై 2008
సంపుటి : 6
సంచిక : 7



**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

### సంపాదకీయం

## భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడి

తెలుగునాట సామాజిక ఉద్యమాలలో, పత్రికలలో గత నెల రోజులుగా జరుగుతున్న సంఘటనల వరుస తెలుగు సామాజిక చరిత్రలో ఒక విషాదకర పరిణామానికి అద్దం పడుతున్నది. ఆంధ్రజ్యోతి పత్రికలో బలహీనవర్గాల నేతల సరళిపై ఒక వార్తాకథనం అచ్చు కావడం, అది తమ మనోభావాలను గాయపరిచేదిగా ఉందని కొందరు సామాజిక ఉద్యమాల నాయకులు భావించడం, వారి ప్రోద్బలంతో గాని, లేకుండా గాని కొందరు ఉద్రిక్త యువకులు ఆంధ్రజ్యోతి పత్రిక కార్యాలయంపై దాడిచేసి సిబ్బందిపై రాళ్లు రువ్వడం, పెట్రోలు పోసి తగులబెట్టడానికి ప్రయత్నించడం, తమ కార్యాలయంపై జరిగిన దాడికి ప్రతిస్పందనగా పాత్రికేయుల నిరసన, ఆ ప్రదర్శనలో దిష్టిబొమ్మను చెప్పులతో కొట్టి, తగులబెట్టడం, ఆ దిష్టిబొమ్మ తనదేనని, అందువల్ల ఆ ప్రదర్శన షెడ్యూల్డ్ కులాల, తెగల (అత్యాచారాల నిరోధ) చట్టం పరిధిలోకి వస్తుందని మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి నాయకుడు మందకృష్ణ మాదిగ నేరారోపణ చేయడం, దాన్ని సాకుగా వాడుకుని రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రజ్యోతి మీద కక్ష తీర్చుకోవడానికి, పాత్రికేయులందరికీ ఒక హెచ్చరిక చేయడానికి ప్రయత్నించడం, ఆంధ్రజ్యోతి సంపాదకుడిని, ఇద్దరు విలేఖరులను నిర్బంధించడం – ఇదంతా విచారకరమైన సంఘటనల వరుస. సామాజిక న్యాయ భావన, దళిత వర్గాల ఆత్మగౌరవం, దళితవర్గాలపై తరతరాలుగా సాగుతున్న అవమానాలను నిరోధించే చట్టబద్ధ ప్రయత్నం ఒక పక్కన, భావప్రకటనా స్వాతంత్ర్యం, పత్రికాస్వేచ్ఛ, సక్రమమైన అకాంక్షలతో రూపొందిన చట్టాలను దుర్వినియోగం చేయగూడదనే ఆలోచన ఒకపక్కన ఎదురెదురుగా నిలబడిన దురదృష్టకర సన్నివేశం. ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆ సన్నివేశానికి సృష్టికర్తలయిన పాలకవర్గాలు, అగ్రవర్ణాలు ఆ సన్నివేశాన్ని సంపూర్ణంగా తమ అవసరాల కోసం వాడుకుని అటు సామాజిక న్యాయ భావననూ నీరుకార్చారు, ఇటు భావప్రకటనా స్వాతంత్ర్యాన్నీ కాలరాచారు. కలిసి నడవవలసిన, మిత్రులు కావలసిన, ఉమ్మడి శత్రువుపై పోరాడవలసిన రెండు సామాజిక బృందాలు ఒకరి మీద ఒకరు శత్రువైఖరి ప్రదర్శించడం, దాడులకు – ప్రతిదాడులకు దిగడం, తెలిసిగాని తెలియకగాని పాలకవర్గాల కుతంత్రాలలో భాగం కావడం జరిగాయి. అప్పటి ఉద్రిక్త, ఆవేశపూరిత వాతావరణంలో ఎటువంటి వైఖరులు తీసుకుని ఉండినా, ఎన్ని అసమంజసవాదనలు వినిపించినా, ఇప్పటికైనా ప్రశాంతంగా పునరాలోచనకు, ఆత్మపరిశీలనకు, ఆత్మవిమర్శకు పూనుకోవడం, జరిగిన తప్పొప్పులను నిర్మొహమాటంగా, నిర్మమంగా, నిరభ్యంతరంగా అంగీకరించడం, సామాజిక ఉద్యమాలకూ భావప్రకటనా స్వాతంత్ర్యానికీ మధ్య ఉండవలసిన అన్యోన్య మైత్రిని, సహకారాన్ని కొనసాగించడం ఇవాళ్టి అవసరం. ఈ ఘర్షణలో మైలురాళ్లుగా ఉన్న ఏ ఒక్క సంఘటన దగ్గర ప్రారంభించినా అది అంతకుముందరి మరొక సంఘటనకు ప్రతిస్పందనగానే కనపడుతుంది. చూపుడువేలు ఇద్దరు ప్రత్యర్థులమధ్యా ముందుకూ వెనక్కూ తిరుగుతుంది. కాని చూపుడువేలు ఎక్కుపెట్టవలసినది ఈ రెండు సామాజిక బృందాలకూ ఉమ్మడి శత్రువుగా ఉన్న పాలకవర్గాలమీదనే తప్ప ఒకరిమీద ఒకరు కాదని ముందుగా గుర్తించవలసి ఉంది. అణగారిన వర్గాలమీద చిన్నచూపు, అవమాన, తృణీకారభావం వేలఏళ్లుగా మన సమాజంలో కొనసాగుతున్నదని, అది మనకు తెలియకుండానే మన భాషలో, వ్యక్తీకరణలో కనబడవచ్చునని రచయితలు, పాత్రికేయులు అంగీకరించవలసి ఉంది. అందులోనూ పత్రికలన్నీ ఏదో ఒక రాజకీయ, ఆర్థిక ప్రయోజనాన్ని నెరవేర్చడానికే పనిచేస్తున్నప్పుడు ఎంత న్యాయంగా కనిపించే రచన వెనుకనైనా ఉద్దేశ్యాలు ఉంటాయని, ఏ రచనకైనా తగిన జాగ్రత్తలు పాటించవలసి ఉంటుందని పాత్రికేయులు గుర్తించవలసి ఉంది. ఏ సమాజంలోనైనా మనుషులకు భావప్రకటనా స్వేచ్ఛ మౌలికమైనదని, బేషరతుగా అంగీకరించవలసినదని గుర్తిస్తూనే మన సామాజిక ప్రత్యేకతల వల్ల ఆ భావప్రకటనకు ఉండగల పరిమితులను, అవకాశాలను రెండు పక్షాలూ గుర్తించవలసి ఉంది. అదే సమయంలో తమ స్వార్థపూరిత, ప్రజావ్యతిరేక ప్రవర్తనను సమర్థించుకోవడానికి తమ సామాజిక మూలాలను, నేపథ్యాన్ని వాడుకోవడం తప్పు అని సామాజిక ఉద్యమ నాయకులు గుర్తించవలసి ఉంది. తమ ప్రవర్తనలోని లోపాల గురించి ఎవరు ఎంత దురుద్దేశ్యంతో విమర్శ చేసినా దానికి ప్రతిస్పందన భౌతిక దాడి రూపంలో ఉండడం సరయినది కాదని గుర్తించవలసి ఉంది. ఇవాళ సామాజిక న్యాయాన్ని సమర్థిస్తున్నట్టు నటిస్తూ భావప్రకటనమీద దాడి చేసిన పాలకులు రేపు దళితుల ఆత్మగౌరవంపై కూడా దాడి చేస్తారు. ఇరువైపులా ఆ అవగాహన అవసరం. ◆

## ధరల పెరుగుదల

**దే**శంలో నిత్యావసర వస్తువుల ధరలు రోజురోజుకూ పైపైకి పెరిగిపోతున్నాయి. ప్రభుత్వ గణాంకాలే ద్రవ్యోల్బణం ఎంతగా పెరిగిపోతున్నదో భయంగొలిపే వివరాలు ఇస్తున్నాయి. ధరల పెరుగుదలను కొలవడానికి ప్రభుత్వం దగ్గర ఉన్న బలహీనమైన సాధనం ద్రవ్యోల్బణం రేటు జూన్‌లో 11.45 శాతానికి చేరిందని, ఇది గత పదమూడు సంవత్సరాలలో ఎన్నడూ లేనంత పెద్ద అంకె అని ప్రభుత్వం అంటున్నది. ఈ సంవత్సరాంతం వరకూ కూడా ద్రవ్యోల్బణం ఇలా పెరుగుతూనే పోతుందని కనీసం 13 శాతం దాకా పెరగవచ్చునని ప్రభుత్వ వర్గాలు, 15 శాతం దాకా కూడా పెరగవచ్చునని స్వతంత్ర ఆర్థిక నిపుణులు అంటున్నారు. చమురు ధరల్లో, ఖనిజాల ధరల్లో, ఆహారపదార్థాల ధరల్లో, పారిశ్రామిక ఉత్పత్తుల ధరల్లో, ఇంధన వనరుల ధరల్లో పెరుగుదలే ఈ ద్రవ్యోల్బణానికి కారణమని అంటున్నారు. నిజానికి ఈ ప్రభుత్వ ప్రకటనలు, అంకెల గారడీలు, ప్రజలకు అర్థం కాని పదజాలంలో వివరణలు అన్నీ కూడా పాలకవర్గాల అక్రమ, అసమర్థ పాలనను, తప్పుడు విధానాలను ప్రజలు గుర్తించకుండా ఉండడానికి వేస్తున్న ఎత్తుగడలే తప్ప మరేమీ కాదు. ధరల పెరుగుదలకు ఏకైక కారణం ప్రభుత్వ విధానాలు. ఆ విధానాలు బహుళజాతి సంస్థలకు అనుకూలమైన రాజకీయార్థిక విధానాలు కావచ్చు. వ్యవసాయోత్పత్తుల విషయంలో అవలంబిస్తున్న అస్తవ్యస్త విధానాలు కావచ్చు. ధరల నియంత్రణ యంత్రాంగం సక్రమంగా పనిచేయకపోవడం కావచ్చు. దళారీ వ్యాపారుల లాభాపేక్ష, సరుకుల అక్రమ నిలువలు కావచ్చు. మార్కెట్ శక్తుల అరాచకానికి తలుపులు బార్లా తెరవడం కావచ్చు. ఈ అన్ని కారణాలను అదుపులో పెట్టగల, నియంత్రించగల, అరికట్టగల శక్తి, సాధనాలు, అవకాశాలు అన్నీ ప్రభుత్వానికి ఉన్నాయి. కాని ఆ పని చేయాలంటే తనను ఎన్నుకున్న ప్రజల పట్ల కనీసమైన బాధ్యత ఉండాలి. లోపిస్తున్నది అదే. ఇది తమ ప్రభుత్వం కాదని, తమ బాగుకోసం పనిచేస్తున్న ప్రభుత్వం కాదని ప్రజలు గుర్తించేవరకూ ధరల పెరుగుదలతో సహా, అనేక సమస్యలు యథాతథంగా ఉంటాయి.

## అణు ఒప్పందం

**మ**ళ్లీ ఒకసారి అణు ఒప్పందం మీద పాలకపక్షమైన కాంగ్రెస్‌కు, భారత కమ్యూనిస్ట్ పార్టీ (మార్క్సిస్ట్) కు మధ్య విభేదాలు తెరమీదికి వచ్చి కేంద్ర ప్రభుత్వం సంక్షోభంలో పడింది. అమెరికా పాలకవర్గాలకూ, ఆయుధ పరిశ్రమలోని బహుళజాతి సంస్థలకూ అడుగులకు మడుగులొత్తుతున్న మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం దేశం మీద అనవసరమైన, అవమానకరమైన అణు ఒప్పందాన్ని రుద్దడానికి ఉత్సాహపడుతున్న విషయం అందరికీ తెలిసిందే. ఆ ఒప్పందాన్ని వ్యతిరేకించడంలో పార్లమెంటరీ వామపక్షాలు కూడ సూత్రబద్ధ, హేతుబద్ధ వైఖరిని తీసుకోవడం లేదనే విషయాన్ని గత కొంతకాలంగా అవి చేస్తున్న వాదనలు చూపుతున్నాయి. రానున్న ఎన్నికలను దృష్టిలో ఉంచుకుని కేవలం ఎన్నికల ఎత్తుగడగా మాత్రమే, లేదా ఎన్నికలలో బేరసారాలకు ఉపయోగపడే రీతిలో మాత్రమే వామపక్షాలు అణు ఒప్పందాన్ని వ్యతిరేకిస్తున్నాయి గాని, అణు విద్యుత్తు విషయంలో, భారత ప్రభుత్వం చెపుతున్న కుంటిసాకుల విషయంలో మౌలికమైన ప్రశ్నలు వేయడంలేదు. అసలు అణువిద్యుత్తు అవసరమా, వాంఛనీయమా, దానితో వచ్చే సమస్యలు ఏమిటి, అణు విద్యుదుత్పత్తి వల్ల తయారయ్యే వ్యర్థ పదార్థాలతో అణ్వస్త్ర తయారీ జరిగితే అవి ఎందుకొరకు, ప్రత్యామ్నాయ ఇంధన వనరులపై పరిశోధన ఎందుకు జరగడం లేదు వంటి ప్రశ్నలు సిపిఐ (ఎం) వేయడం లేదు. నిజానికి వారు తాజాగా విడుదల చేసిన పత్రికా ప్రకటనలో కూడా అణువిద్యుత్తుకు అనుకూలమైన వ్యాఖ్యలే ఉన్నాయి. ఇటువంటి ద్వంద్వవైఖరివల్ల తాము సాధించదలచుకున్న రాజకీయ ప్రయోజనాలను సాధించడం సాధ్యమవుతుందేమోగాని నిజమైన భారత ప్రజానీకపు ప్రయోజనాలు దెబ్బతినక తప్పదు. ఇప్పటికైనా అణు ఒప్పందం మీద అటు ప్రభుత్వం చేస్తున్న దళారీ వాదనలు, ఇటు పార్లమెంటరీ వామపక్షాలు చేస్తున్న అవకాశవాద వాదనలు మాత్రమే గాక విస్తృతమైన ప్రజాభాగస్వామ్యంతో సవివరమైన సమాచారంతో కూడిన లోతయిన వాదనలు జరిగి, ఆ వాదనల ఆధారంగా మాత్రమే అంతిమ నిర్ణయం జరగాలి.

## శ్వేతసౌధంలో నల్లకలువ

**అ**గ్రరాజ్యం అమెరికా అధ్యక్షస్థానానికి 55 పదవీకాలాలలో నలభైమూడు మంది అధ్యక్షులుగా ఎన్నికయినప్పటికీ జనాభాలో పదమూడు శాతంగా ఉన్న ఆఫ్రికన్ – అమెరికన్లు, నల్ల జాతీయులు ఒక్కరు కూడా ఆ స్థానానికి రాలేదంటే, ఇవాళ్టికీ ఆ సమాజంలో వర్ణవివక్ష ఎంత పెద్ద ఎత్తున కొనసాగుతున్నదో అర్థమవుతుంది. నల్లజాతి యువకులకు విద్య లేకుండా, సామాజిక అవకాశాలు లేకుండా చేయడమే కాక, వారిని నేరప్రపంచంలోకి, అధోజగత్తులోకి నెట్టి జైళ్లలోకి నెడుతున్న అమెరికన్ సమాజంలో చిట్టచివరికి ఎట్టకేలకు బారక్ ఒబామా అనే నల్లజాతి వ్యక్తి (తండ్రి కెన్యన్, తల్లి అమెరికన్ శ్వేతజాతీయురాలు) అధ్యక్ష స్థానానికి ఎన్నికయ్యే మొదటిమెట్టును సాధించడం ఆహ్వానించ దగిన విషయం. ఎన్నికలు సక్రమంగా జరిగి, డెమొక్రటిక్ పార్టీ విజయం సాధిస్తే వాషింగ్టన్‌లోని శ్వేతసౌధంలోకి రెండు శతాబ్దాల తర్వాత మొదటిసారిగా ఒక నల్లకలువ ప్రవేశిస్తుంది. ఈ పరిణామం తప్పనిసరిగా ఆహ్వానించి గౌరవించవలసిందేగాని ఇది అంతర్జాతీయ రాజకీయాలలో అమెరికా పోషిస్తున్న పాత్రను ఏ కొద్దిగా అయినా మారుస్తుందనే ఆశలేమీ పెట్టుకోనక్కరలేదు. డెమొక్రటిక్ పార్టీ ఇప్పటికీ ఇరాక్ యుద్ధానికి వ్యతిరేకంగాగాని, మొత్తంగా అమెరికన్ పాలకవర్గాల దురహంకారాన్ని గాని ఖండించిన దాఖలాలేమీలేవు. ఒబామా కూడ అటువంటి వైఖరి తీసుకుంటాడనే ఆశ ఏమీలేదు. విదేశాంగ విధానంలో కాకపోయినా, అమెరికా ఆంతరంగిక విధానాలలో, ముఖ్యంగా జాతి వివక్షను పెంచి పోషిస్తున్న విధానాలలో ఏ కొద్దిపాటి మార్పులనైనా ఒబామా తీసుకురాగలడేమో చూడాలి. భారతదేశంలో అత్యున్నత అధికారాన్ని అనుభవించిన ఒక స్త్రీ గాని, ఒక దళితుడుగాని, ఒక ముస్లిం గాని, ఒక సిక్కు గాని ఆ అణగారిన వర్గాలకు ఎంత మేలు చేయగలిగారో మన అనుభవంలో ఉన్నదే. కాని వారు ఆ స్థానంలోకి వెళ్లగలగడమే సామాజిక న్యాయానికి ఒకానొక చిహ్నం గనుక అనుమానాలతోనైనా సరే అటువంటి పరిణామాలను ఆహ్వానించవలసి ఉంది. ఒబామా అభ్యర్థిత్వాన్ని కూడ ప్రపంచం అదే విధంగా అనుమానంతోనే ఆహ్వానిస్తున్నది. ◆

# లోపలి పేజీల్లో...

## ప్రత్యేక ఆర్థిక మండలాలు

ఆర్థిక సంస్కరణలు - అనువైన వాతావరణం పేరుతో ఇప్పటికే చట్టాలన్నీ 'సరళీకరణ' చేసిన ప్రభుత్వాలు ఇప్పుడు ఈ దేశాన్ని ఖండ ఖండాలుగా విభజించి కొత్తగా వస్తోన్న కంపెనీలకు, పారిశ్రామికవేత్తలకు, బహుళజాతి వ్యాపార కూటములకు అప్పగిస్తున్నాయి. ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్‌లు) పేరుతో ఇప్పుడు విస్తరిస్తోన్న ఈ కొత్త సామ్రాజ్యాలు దేశాన్ని కొల్లగొట్టేందుకు సిద్ధమవుతున్నాయి. అందుకోసం ప్రభుత్వం స్వయంగా సెజ్ చట్టం 2005లో అన్ని చర్యలు తీసుకున్నది. ఈ చట్టం ఆమోదం పొందిన ఈ రెండేళ్లలో ఇప్పటికి దాదాపు ఐదు వందల కంపెనీలకు సెజ్‌లు ఏర్పాటు చేసుకోవడానికి కేంద్ర ప్రభుత్వం అన్ని రకాల అనుమతులు ఇచ్చింది. ఈస్టిండియా కంపెనీని తలదన్నే రీతిలో వస్తోన్న ఈ ప్రత్యేక మండలాలు లక్షలాది మంది మదుపరులు, కోట్లాదిమంది వినియోగదారులను కొల్లగొట్టే కొత్త సామ్రాజ్యవాద పెట్టుబడిని దేశంలో విస్తరించబోతున్నాయి.

### ఫోకస్ : ప్రత్యేక ఆర్థిక మండలాలు



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం** – అనుబంధ సంపుటం – కూర్పు : చలసాని ప్రసాద్ – విరసం ప్రచురణ – 86 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురు, కాచిగూడా, హైదరాబాద్ – 500 027. ఫోన్ : 040–24652387
- **ఆపరేషన్ రెడ్‌లైట్** – జాఫర్ – సాదియా పబ్లికేషన్స్ – 196 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : ఎం.డి. జాఫర్ బాబు, ఫ్లాట్ నెం. 204, రహేష్ అపార్ట్‌మెంట్స్, హుమాయిన్‌నగర్, సరోజిని దేవీ కంటి ఆసుపత్రి సమీపాన, ఆంధ్రాబ్యాంక్ ఎ.టి.ఎం. దగ్గర, హైదరాబాద్. ఫోన్ : 9959988710, 9912666212, 9849576110; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **తెలంగాణ మట్టిపాటలు** – సంపాదకులు : నల్లెల్ల రాజయ్య – వరంగల్ రచయితల సంఘం – 86 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : నల్లెల్ల రాజయ్య, 7–1–384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్ జిల్లా – 506 011, సెల్ : 99894 15571; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **సి.నా.రె. విశ్వంభరలో అర్థయుక్తి** – పెన్నా శివరామకృష్ణ – స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ, 124 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **పక్షులు** – దీర్ఘ కవిత – నవీన్ – పల్లె ప్రచురణ, 44 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : నవీన్, 1–4–38/బి/2, రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్ – 509 001, సెల్ : 94409 19162; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **ఖండిత** – కథలు – వి. ప్రతిమ – 153 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : వి. ప్రతిమ, శ్రీ వెంకటేశ్వర టాకీస్, నాయుడుపేట – 524 125; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **గుంటూరు జిల్లా సమగ్ర చరిత్ర – సంస్కృతి** – ద్వితీయ సంపుటం – ఆధునిక యుగం (క్రీ.శ. 1788–1970) – సంపాదకులు : ఆచార్య పి. రామలక్ష్మి, గుంటూరు జిల్లా చరిత్ర సంఘం ప్రచురణ, 432 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : ఎన్.వి. నరసింహారావు, కార్యదర్శి, గుంటూరు జిల్లా చరిత్ర సంఘం, ఇ. నెం. 8–9–117/సి, 2వ లైను, నెహ్రూనగర్, గుంటూరు. ఫోన్ : 0863 – 2256438
- **ఎంతెంత దూరం** – కవితా సంపుటి – అన్ను విజయకుమారి – ప్రకాశం జిల్లా రచయితల సంఘం ప్రచురణ, 76 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : పొన్నూరు వేంకట శ్రీనివాసులు, కార్యదర్శి, ప్రకాశం జిల్లా రచయితల సంఘం, తిరువెంగళ పిళ్ళై వీథి, ఒంగోలు, ఫోన్ : 94404 32939; అన్ను విజయకుమారి, టీచర్, పేర్నమిట్ట, ప్రకాశం జిల్లా
- **పీడిత మహిళల పోరు కెరటం** – మహిళా మార్గం ప్రచురణ, 84 పేజీలు, 1/8 డెమీ, రు. 15
- **యువతపై మీడియా ప్రభావం – పరిష్కారాలు** – మహిళా మార్గం ప్రచురణ, 90 పేజీలు, 1/8 డెమీ, రు. 10

  పై రెండు పుస్తకాల ప్రతులకు : బి. జ్యోతి, ఎడిటర్, మహిళా మార్గం, 3–6–779/6, వీధి నెం. 14, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029, ఫోన్ : 040–27625245; దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్‌హౌస్, సహచర బుక్‌మార్క్









## పాఠకుల వీక్షణం

జూన్ 2008 సంచికలో అచ్చయిన నా వ్యాసం రాజకీయ ఉద్యమంగా స్థిరపడిన తెలంగాణ ఉపఎన్నికల ఫలితాలు వెలువడకముందే రాసింది. జూన్ 1న ఉపఎన్నికల ఫలితాలు వెలువడిన తరువాత నా వ్యాసంపై వీక్షణం పాఠకులకు మరికొంత వివరణ ఇవ్వవలసిన బాధ్యత నామీద ఉందని భావించి ఈ లేఖ రాస్తున్నాను. వ్యాసంలో నేను వ్యక్తీకరించిన అభిప్రాయాలకు ఇప్పటికీ కట్టుబడి ఉన్నాను. ఉపఎన్నికలలో ఓడింది టి.ఆర్.ఎస్ కాని తెలంగాణ ఆకాంక్షకాదు. అయితే 16 అసెంబ్లీ స్థానాలలో తొమ్మిదింటిలో టి.ఆర్.ఎస్ ఓడిపోయింది కనుక తెలంగాణవాదం ఓడిపోయిందని సమైక్యవాదులు సంబరపడుతున్నారు. అట్లా సంబరపడుతున్నవారిలో కోస్తా రియల్ఎస్టేట్ వ్యాపారులు, రాయలసీమ ల్యాండ్ మాఫియా ముందు వరుసలో ఉన్నారు.

ఎన్నికల ఫలితాలను విశ్లేషించినపుడు 16 అసెంబ్లీ స్థానాలలో 7 టి.ఆర్.ఎస్, 5 కాంగ్రెస్, 4 టిడిపి గెలుచుకున్నాయి. 4 పార్లమెంట్ స్థానాలలో 2 టి.ఆర్.ఎస్, చెరొక్కటి కాంగ్రెస్, టి.డి.పిలు గెలుచుకున్నాయి. మొత్తం పోలయిన ఓట్లలో 34 శాతం టి.ఆర్.ఎస్‌కు 30 శాతం టి.డి.పి 29 శాతం కాంగ్రెస్‌కు వచ్చాయి. సమైక్యవాదంపై పోటీచేసిన ఒకే ఒక్క పార్టీ సి.పి.ఎం పోటీ చేసిన రెండు చోట్లలో చిత్తుగా ఓడిపోయింది. స్థూలంగా చూసినపుడు టి.ఆర్.ఎస్ ఇప్పటికే బలమైన పార్టీగా నిలబడి ఉన్నది. అయితే మొత్తం 16+4 స్థానాలలో విజయ ఢంకా మోగిస్తానని చెప్పుకున్న టి.ఆర్.ఎస్ ఎందుకు మెజారిటీ స్థానాలలో ఓడిపోయింది? ఈ ప్రశ్నను తెలంగాణవాదులు మదింపువేసి కర్ణుడి చావుకు ఎన్ని కారణాలు ఉన్నాయో అన్నే కారణాలు టి.ఆర్.ఎస్ ఓటమికి పనిచేసాయి అని తేల్చారు. వాటిని క్రోడీకరిస్తే.

- టి.ఆర్.ఎస్‌కి గ్రామస్థాయి వరకు సంస్థాగతమైన నిర్మాణం లేకపోవడంచేత ప్రజల ఆకాంక్షలను ఓట్ల రూపంలోకి మలుచుకోలేకపోయింది.
- టి.ఆర్.ఎస్ ప్రత్యేక రాష్ట్ర సాధనకు ఎన్నికల రాజకీయాలనే మార్గంగా ఎన్నుకుంది తప్ప తెలంగాణ సమస్యలపై ప్రజల దైనందిన సమస్యలపై ఉద్యమించక పోవడంచేత పార్టీకీ, ప్రజలకు ఉండవలసిన బంధం తెగిపోయింది. ప్రజాప్రతినిధులకు పార్టీ పని ఇవ్వలేకపోయింది. ఈ నాలుగేండ్లలో బహిరంగసభలకు జనాన్ని సమీకరించడం తప్ప వాళ్లు చేసింది తక్కువ.
- తెలంగాణ వచ్చేదాక సమస్యల పరిష్కారం కోసం ప్రజలు ఆగలేరు. కాబట్టి వారికి అందుబాటులో ఉండే కాంగ్రెస్, టి.డి.పి.ల వైపు మళ్లక తప్పదు. పైగా వారూ తెలంగాణ అంటున్నారు. ముఖ్యమంత్రి మా వల్లనే తెలంగాణ వస్తుందన్నాడు. చంద్రబాబునాయుడు మేం తెలంగాణకు వ్యతిరేకం కాదన్నాడు. తెలంగాణ అంటున్నారు కాబట్టి టి.ఆర్.ఎస్. మీది ఆగ్రహం వారికి లాభించింది.
- టి.ఆర్.ఎస్. నాయకత్వపు ఒంటెత్తు పోకడలకు, ఏకపక్ష నిర్ణయాలకు తామే తెలంగాణ ఉద్యమానికి రేకేదారులమన్న అహంభావపూరిత ధోరణి వల్ల ప్రజలు విసుగెత్తి వారిని అనేక స్థానాలలో ఓడించారు.
- 2006 ఉపఎన్నికల్లో టి.ఆర్.ఎస్. విజయానికి కృషి చేసిన తెలంగాణ అనుకూల శక్తులు, వ్యక్తులు 2008 ఉప ఎన్నికల నాటికి పార్టీకి దూరమయ్యి, ఆ మేరకు టి.ఆర్.ఎస్. నష్టపోయింది.
- అనేక నియోజకవర్గాలలో అధికారపక్షం 1.5 శాతం నుండి 2 శాతం ఓట్లను మానేజ్ చేసుకోవడం వల్ల కనీసం నాలుగు అసెంబ్లీ, ఒక పార్లమెంట్ స్థానంలో టి.ఆర్.ఎస్. గల్లంతయ్యింది. పార్టీకి గ్రామస్థాయి వరకు నిర్మాణం ఉండి ఉంటే ఈ పోల్ మ్యానేజ్‌మెంట్‌ను నివారించి ఉండేది.
- మాటతప్పి ఖైరతాబాద్‌లో టి.ఆర్.ఎస్. అభ్యర్థిని పోటీకి దింపడం, తెలుగుదేశంలో తెలంగాణ వాణిని వినిపిస్తున్న దేవేందర్‌గౌడ్‌పై విరుచుకుపడటం బలహీనవర్గాల్లో టి.ఆర్.ఎస్. పై విముఖతని పెంచాయి.
- నాలుగేండ్లుగా టి.ఆర్.ఎస్. శాసనసభ్యులు ప్రజలతో సంబంధాలు లేకపోవడంతో వారిపట్ల వ్యతిరేకత ఎంతగా పెరిగిపోయిందంటే బలమైన తెలంగాణ ఆకాంక్ష కూడా ఆ వ్యతిరేకతను నిలువరించలేకపోయింది. వికారాబాద్, జడ్చర్ల, స్టేషన్ ఘన్‌పూర్, డిచ్‌పల్లి, ఖానాపూర్ అసెంబ్లీ స్థానాల్లో, ఆదిలాబాద్, వరంగల్ పార్లమెంట్ స్థానాల్లో అభ్యర్థులు తీవ్రమైన ఎంటీ ఇంకంబన్సీ కారణంగా ఓడిపోయారే తప్ప తెలంగాణ ఆకాంక్ష తక్కువై కాదు.

ఈ ఎన్నికల్లో తెలంగాణ ప్రజలు జ్ఞానవంతమైన తీర్పునే ఇచ్చారని తెలంగాణ వాదులు భావిస్తున్నారు. వారు అన్ని పార్టీలకు హెచ్చరికలు జారీచేశారు. బాధ్యతల్ని మోపారు. టి.ఆర్.ఎస్. తన సంస్థాగత, నాయకత్వ, ఉద్యమ కార్యాచరణకు సంబంధించిన లోపాలను సవరించుకుని ఉద్యమాన్ని పునర్నిర్మించుకునే అవకాశాన్ని ప్రజలు ఇచ్చారు. అందుకే అత్యధిక ఓట్లు, సీట్లు వారికి ఇచ్చి వదిలిపెట్టారు. ఫలితాల నుంచి గుణపాఠాలు తీసుకొని ముందుకు వెళితే పార్టీ బతుకుతుంది. తద్వారా తెలంగాణ ప్రజల ఆకాంక్షలు నెరవేరుతాయి. ఇక కాంగ్రెస్, టి.డి.పి.లు కూడా తెలంగాణ పేరు చెప్పే ఓట్లు అడిగాయి, సీట్లు గెలిచాయి. గనుక వారిపై తెలంగాణపై తను చిత్తశుద్ధిని నిరూపించుకునే గురుతర బాధ్యత ఉంది. ఇపుడు టి.డి.పి. ఏం చెయ్యాలి. కోర్ కమిటీ ప్రహసనం మానేసి తెలంగాణకు అనుకూలంగా స్పష్టమైన విధాన ప్రకటన చెయ్యాలి. గతంలో తాము తెలంగాణకు వ్యతిరేకమని ప్రణబ్ కమిటీకి రాసిన లేఖని ఉపసంహరించుకొని తెలంగాణకు అనుకూలమని చెబుతూ మరో లేఖ రాయాలి. కాంగ్రెస్ ఏం చెయ్యాలి? రాష్ట్ర అసెంబ్లీలో తెలంగాణ ఏర్పాటుకు తీర్మానించి కేంద్రానికి పంపాలి. కేంద్రం పార్లమెంట్‌లో తెలంగాణ బిల్లును ప్రవేశపెట్టి తెలంగాణ ఏర్పాటుకు రాజ్యాంగపరమైన చర్యలు చేపట్టాలి. ఈ రకమైన నిర్దిష్టమైన చర్యలు ఈ పార్టీ చేపడితేనే వారి చిత్తశుద్ధిని నిరూపించుకున్న వారవుతారు. లేదంటే 2009 ఎన్నికల్లో ప్రజల ఆగ్రహాన్ని ఎదుర్కోక తప్పదు.

**– నాగోబా**
హైదరాబాద్

'వీక్షణం పత్రిక చాలా బాగుంటోంది. సమాజ చైతన్యానికి పత్రిక చేస్తున్న కృషికి నా విప్లవాభినందనలు.

**– బోర సుభాష్**
హైదరాబాద్

## రాష్ట్రస్థాయి సినారె కవితా పురస్కారం - 2008

జ్ఞానపీఠ అవార్డ్ గ్రహీత డా. సి. నారాయణ రెడ్డి కవితా స్ఫూర్తితో కరీంనగర్ జిల్లా సాహితీ సంస్థల సమాఖ్య సాహితీ గౌతమీ ద్వారా రాష్ట్ర స్థాయిలో ఉత్తమ కవితా సంకలనానికి ప్రతియేటా అందించే ప్రతిష్ఠాత్మక సి.నా.రె. కవితా పురస్కారం కోసం రచనలను ఆహ్వానిస్తున్నాం. ఇది 19వ పురస్కారం. ఈ పురస్కారం కోసం రాష్ట్ర వ్యాప్తంగా కవుల నుండి ప్రచురితమైన వచన కవితా సంకలనాలను పంపవలసిందిగా కోరుతున్నాం.

ఉత్తమంగా ఎంపికైన కవితా సంకలనానికి రు. 10,000 (పదివేలు) నగదుతో పాటు శాలువా, జ్ఞాపికతో ఆగస్ట్‌లో నిర్వహించే ప్రత్యేక కార్యక్రమంలో అందించబడును.

1. కవులు గత మూడు సంవత్సరాలలో (2005, 2006, 2007) ప్రచురించిన కవితా సంకలనాలను మాత్రమే పంపించాలి. అంతకు ముందు గాని, తరువాతవి గాని అంగీకరించబడవు.
2. గతంలో ఈ పురస్కారం పొందినవారు తిరిగి పోటీకి అర్హులు కారు.
3. పోటీకి నాలుగు (4) ప్రతులు పంపించాలి.
4. పోటీలో న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
5. పోటీకి ప్రతులు పంపించడానికి చివరి తేది 15 జూలై 2008.
6. ప్రతులు పంపించవలసిన చిరునామా

**డా. ఎడవల్లి విజయేంద్రరెడ్డి**
కన్వీనర్, సినారె కవితా పురస్కార కమిటీ
శివానంద ఆసుపత్రి, కరీంనగర్ – 505 001.

## ఆంధ్రజ్యోతి కథనం - పరిణామాలు

ఆంధ్రజ్యోతి దినపత్రికలో మే 26న అచ్చయిన 'బాదుగ నేతలు' కథనానికి స్పందనగా అదే రోజు మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎం.ఆర్.పి.ఎస్.) కార్యకర్తలు ఆంధ్రజ్యోతి కార్యాలయంపై దాడి చేశారు. ఆ కథనం దళిత, బడుగువర్గాల ఆత్మగౌరవాన్ని దెబ్బతీసేదిగా ఉందన్నారు. ఎం.ఆర్.పి.ఎస్. నేత మందకృష్ణ మాదిగ, రాష్ట్ర బి.సి. సంక్షేమ సంఘం అధ్యక్షుడు ఆర్. కృష్ణయ్య, మాలమహానాడు రాష్ట్ర అధ్యక్షుడు జూపూడి ప్రభాకర్‌రావులు ఆ కథనాన్ని ఖండించారు. తదనంతర పరిణామాలలో ఆంధ్రజ్యోతి కార్యాలయం పై ఎం.ఆర్.పి.ఎస్. కార్యకర్తలు చేసిన దాడిని మందకృష్ణ మాదిగ సమర్థించుకున్నారు. రాష్ట్రవ్యాప్తంగా ఆంధ్రజ్యోతికి వ్యతిరేకంగా దాడులు నిర్వహించారు. ఆంధ్రజ్యోతి పత్రిక ప్రతులను తగులబెట్టారు. అగ్రకుల దురహంకారంతో ఈ వార్తలు రాశారన్నారు. వార్తలో నిజం లేదని, భాష బాగోలేదని, దళిత బహుజన వర్గాల ఆత్మగౌరవాన్ని దెబ్బతీశారని, ఆంధ్రజ్యోతి ఎం.డి. వేమూరి రాధాకృష్ణకు అసలిలా రాసే అర్హత లేదని అన్నారు. మరోపక్క రాతకు రాతతోనే జవాబు చెప్పాలని, ఈ విధమైన దాడి సరిఅయినది కాదని, భావ ప్రకటనా స్వేచ్ఛకు విఘాతమని అంటూ జర్నలిస్ట్ సంఘాలు, ప్రజాసంఘాలు, వివిధ రాజకీయ పార్టీల నేతలు ఖండించారు. యాజమాన్యాల, నాయకుల దిష్టిబొమ్మలను పరస్పరం తగులబెట్టారు. రాష్ట్రవ్యాప్తంగా ఈ సంఘటనలు చర్చకు దారితీశాయి.

## జ్యోతిర్మయికి అంతిమ వీడ్కోలు

ఇంగ్లండ్‌లోని బర్మింగ్‌హామ్‌లో మే 6న హత్యకు గురైన విద్యార్థిని వెంపాల సామ్రాజ్య జ్యోతిర్మయి (23) భౌతిక కాయానికి మే 24న విజయవాడలో అంత్యక్రియలు జరిగాయి. తల్లిదండ్రులు, బంధువులు, మిత్రులు మృతదేహం చేరగానే కన్నీరు మున్నీరు అయ్యారు. శవాన్ని ఎక్కువసేపు ఉంచనివ్వలేదని వాపోయారు. దారి పొడువునా ప్రజలు, రాజకీయ పార్టీల నాయకుల నివాళులతో ఊరేగింపు కొనసాగింది. చదువుకని పోయి శవమై వచ్చిన జ్యోతిర్మయిని చూసి అంతా చలించిపోయారు.

## ఉప ఎన్నికల ఫలితాలు

రాష్ట్రంలో మే 29న జరిగిన ఉప ఎన్నికల ఫలితాలు జూన్ 1న వెలువడ్డాయి. మొత్తం పద్దెనిమిది శాసనసభ స్థానాలకు, నాలుగు పార్లమెంట్ స్థానాలకు ఈ ఉప ఎన్నికలు జరిగాయి. తెలంగాణ ఆకాంక్షతో రాజీనామాలు చేసి, బరిలోకి దిగి పదహారు స్థానాలలో పోటీ చేసిన టి.ఆర్.ఎస్. – 7 (సిద్ధిపేట, దొమ్మాట, మేడారం, హుజూరాబాద్, కమలాపూర్, చేర్యాల, ఆలేరు); కాంగ్రెస్ – 5 (జడ్చర్ల, వికారాబాద్, ముషీరాబాద్, ఎల్లారెడ్డి, డిచ్‌పల్లి); తెలుగుదేశం – 4 ( సికింద్రాబాద్, రామాయంపేట, ఖానాపూర్, స్టేషన్ ఘన్‌పూర్) స్థానాలను గెలుచుకున్నాయి. ఇవే కాక శాసనసభ్యుల మృతి కారణంగా ఎన్నికలు జరిగిన ఖైరతాబాద్‌ను కాంగ్రెస్, తెర్లాంను తెలుగుదేశం నిలబెట్టు కున్నాయి. తెలంగాణ ప్రాంత పదహారు శాసనసభ స్థానాల్లో పార్టీల వారీగా ఓట్ల శాతం చూస్తే టి.ఆర్.ఎస్.కు – 33.54 శాతం, తెలుగుదేశంకు – 30.77 శాతం, కాంగ్రెస్‌కు – 29.62 శాతం ఓట్లు వచ్చాయి. పార్లమెంట్ నాలుగు స్థానాల్లో టి.ఆర్.ఎస్. – 2 (కరీంనగర్, హన్మకొండ) స్థానాలు నిలుపుకోగా, కాంగ్రెస్ ఆదిలాబాద్‌లో, తెలుగుదేశం వరంగల్‌లో గెలుపొందాయి.

## ఎర్రజొన్నలు మరింత 'ఎరుపు'

నిజామాబాద్‌లోని ఆర్మూర్ ప్రాంతంలో సుమారు ముప్పై నుంచి నలభై వేల ఎకరాల్లో రైతులు ఎర్రజొన్నలు పండిస్తున్నారు. ఇక్కడ ఉన్న నలభై విత్తన కంపెనీలే రైతులకు విత్తనాన్ని సరఫరా చేసి పండిన తరువాత పంటను కొనుగోలు చేస్తాయి. గత సంవత్సరం క్వింటాకు రు. 1100 పొందిన రైతులు, ఈ సంవత్సరం క్వింటాకు రు. 1500 అయినా ఇవ్వాలని, అప్పుడే గిట్టుబాటవుతుందని డిమాండ్ చేశారు. స్థానిక వ్యాపారులు ఢిల్లీ వ్యాపారులతో క్వింటా రు. 1050 చొప్పున ఒప్పందం చేసుకోవడంతో రైతుకు మరింత తక్కువకు అమ్ముకోవాల్సిన స్థితి ఏర్పడింది. సీడ్ కార్పొరేషన్, హాకా, మార్క్‌ఫెడ్‌ల ద్వారా ప్రభుత్వమే ఎర్రజొన్నలను కొనుగోలు చేయాలని, తమకు క్వింటాకు రు. 1500 ఇప్పించాలని ధర్నా చేశారు. కొనుగోలుదారుపై దాడికి దిగారు. తదనంతర పరిణామాలలో పోలీసులు జరిపిన కాల్పుల్లో నలుగురు రైతులు గాయపడ్డారు. ఎట్టకేలకు ప్రభుత్వం క్వింటా రు. 1540 చొప్పున కొనుగోలు చెయ్యడానికి ఒప్పుకుంది.

## జైళ్లు శిక్షించడానికా? సంస్కరించడానికా?

జైళ్లు సంస్కరించడానికి కాకుండా తీవ్రంగా హింసించడానికే ఉన్నాయని అంటున్నారు మావోయిస్ట్–జనశక్తి పార్టీల రాజకీయ ఖైదీలు. కనీసమైన హక్కులకు నోచుకోక తీవ్రమైన అణచివేతలకు లోనవుతున్నారని, మానవతావాదులు, న్యాయకోవిదులు కాంక్షిస్తున్నట్లు జైళ్లు సంస్కరణాలయాలుగా లేవని తమ ప్రకటనలో పేర్కొన్నారు. దేశం మొత్తం మీద 1147 జైళ్లు ఉన్నాయనీ, వీటిల్లో 2,35,012 మంది ఖైదీలు మాత్రమే పడతారని పేర్కొన్నారు. అయితే సామర్థ్యానికి మించి 3,31,391 మంది ఉన్నారని అన్నారు. దాదాపు 40–60 శాతం ఖైదీలు అధికంగా ఉన్నట్లు తెలుస్తోంది. ఈ ఖైదీల్లో 75 శాతం విచారణ ఖైదీలే తీర్పు కోసం ఏళ్ల తరబడి జైళ్లలో మగ్గుతున్నారన్నారు. సరి అయిన ఆహారం, వైద్య సదుపాయం అందక ఏటా వెయ్యి మంది ఖైదీలు జైళ్లలో మరణిస్తున్నారని ఆ ప్రకటనలో తెలిపారు.

## బెల్ట్ షాపులు రద్దుచేయాలి

జూన్ 16న నిర్వహించిన మద్యం టెండర్లను అడ్డుకోవడానికి మహిళా సంఘాలు, వివిధ రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు రాష్ట్ర వ్యాప్తంగా టెండర్లు నిర్వహించే స్థలం వద్ద నిరసనలు చేపట్టాయి. బెల్ట్ షాపులను రద్దు చేయాలంటూ నినాదాలు చేసారు. పలుచోట్ల రోడ్లపై బైఠాయించి ట్రాఫిక్‌ను స్తంభింపచేసారు. హైదరాబాద్‌లో ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ ఎదుట టి.డి.పి., ప్రగతిశీల మహిళా సంఘం (పి.ఒ.డబ్ల్యూ), ఎ.పి. చైతన్య మహిళా సమాఖ్య, బి.జె.పి. మహిళా మోర్చా, మహిళా సమాఖ్య, ఐద్వా, లోక్‌సత్తాల ఆధ్వర్యంలో మహిళలు బైఠాయించారు. ◆

*కాంగ్రెస్ పార్టీలో నెలకొన్న అంతర్గత సంక్షోభం, బహునాయకత్వం, నిర్మాణగత పటిష్టత లేకపోవడం వంటి కారణాలు బి.జె.పి. విజయానికి తోడ్పడ్డాయని అంటున్నారు* **వకుళాభరణం రామకృష్ణ**

# కర్ణాటకలో కమలహాసం

**2004** సార్వత్రిక ఎన్నికల్లో ఓడి, ప్రాభవాన్ని కోల్పోయి కనుమరుగవతుందనుకున్న భారతీయ జనతా పార్టీ (బి.జె.పి.), గత నాలుగేళ్లలో కాంగ్రెస్ నాయకత్వంలోని యు.పి.ఎ. ప్రభుత్వమనుసరించిన ప్రజావ్యతిరేక విధానాల ఫలితంగా తిరిగి బలం పుంజుకొంది. గత సార్వత్రిక ఎన్నికల తర్వాత జరిగిన రాష్ట్రాల ఎన్నికల్లో పదింటిలో తొమ్మిది కాంగ్రెస్ ఓడిపోయింది. ఈ పరిణామం పట్ల దేశంలోని లౌకిక శక్తులు ఆందోళన చెందుతున్నాయి. యు.పి.ఎ. ప్రభుత్వం అమలు పరుస్తున్న నయా ఉదారవాద ఆర్థిక విధానాలు పరోక్షంగా ఫాసిస్టు మత భావజాల పెంపుదలకు దోహదం చేస్తున్నాయి. ప్రపంచీకరణలో భాగంగా ఆర్థిక విధానాలు, వాటి ఫలితంగా తలెత్తుతున్న సంస్కృతిక వాతావరణంలో, మతఛాందస భావాలవైపు ప్రజలు మొగ్గుచూపడం గమనిస్తున్నాం. సంపద ఒకవైపు, దారిద్ర్యం మరో వైపు వృద్ధి చెందడం ఉదారవాద ఆర్థిక విధానాల్లో వైరుధ్యం. దీంతో పేదరికంలో మగ్గుతున్న ప్రజలు ఊరటకోసం, మతంవైపు మళ్లుతున్నారు. వారి కష్టాలను, బాధలను, వాటికి విరుగుడును మతం, దైవం ఇత్యాది అంశాల్లో కనుగొనాలని చూస్తున్నారు. పేదరికానికి కారణాలు రాజ్యం చేపట్టే ఆర్థిక విధానాల్లో గాక, ఇతర మతాల వల్ల, ఆ మతాలనుసరించే విధానాల వల్ల కలుగుతున్నాయన్న తప్పుడు అవగాహనకు గురవుతున్నారు.

కర్ణాటక అసెంబ్లీ ఎన్నికలను పై నేపథ్యంలో పరిశీలించాల్సి ఉంది. ఇక్కడ బి.జె.పి. గెలవడం, కాంగ్రెస్ ఓడిపోవడం ఆ రెండు రాజకీయ పక్షాలకు పరిమితమయితే, వాటిని గూర్చి చర్చించుకోవాల్సిన అవసరం ఉంది. ఈ ఎన్నికలు భవిష్యత్ రాజకీయ పరిణామాలను ప్రభావితం చేసే దిశలో ఉన్నాయన్నది నా వాదన.

కాంగ్రెస్ పార్టీకి సెక్యులర్ అర్హతలు అంతంత మాత్రమేనన్న ఆరోపణ, ఆ పార్టీకి బాధ కలిగించినా, ఆచరణలో అది వాస్తవమన్నది ఎన్నో సందర్భాల్లో నిగ్గుతేలిన నిజం. షాబానో ఉదంతం నుండి, శిలాన్యాస్, ఇంకా చెప్పాలంటే బాబ్రీ మసీదు విధ్వంసాన్ని అడ్డుకోలేక పోయినంత వరకూ (గుజరాత్‌లో మోడీ ప్రభుత్వం నిర్వహించిన నరమేధాన్ని ఆపలేక పోవడం గూడ) కొనసాగింది. ఇవన్నీ ఉన్నా, నేడున్న వాస్తవ పరిస్థితుల దృష్ట్యా, ముఖ్యంగా దేశ రాజకీయాలు చిన్నాభిన్నమై, పేలికలు, ఏలికలుగా చీలిపోయినపుడు, ఏ ఒక్క రాజకీయ పక్షమూ సమర్థవంతంగా మతోన్మాదాన్ని ఎదుర్కోలేని స్థితిలో, జాతీయ స్థాయిలో, రాజకీయ లౌకిక శక్తి కాంగ్రెస్ పార్టీయేనని రాజకీయ విశ్లేషకులు భావిస్తున్నారు. రాజకీయ లబ్ధికోసం చేపట్టే స్వీయ ప్రయోజనాల వల్ల గానీ, సుదీర్ఘ జాతీయోద్యమ పోరాట వారసత్వంగా స్వీకరించిన లౌకిక తత్వం వల్లనైతేనేమీ, లౌకిక శక్తులకు నాయకత్వం కాంగ్రెస్ పార్టీ వహించక తప్పని పరిస్థితులు భవిష్యత్‌లో ఏర్పడతాయని వీరి ఉద్దేశం. దీనిలోని సాధ్యాసాధ్యాలను భవిష్యత్తు నిర్ణయించాల్సిందే.

పై నేపథ్యంలో కర్ణాటక ఎన్నికలను సమీక్షించుకోవాలి. అదనంగా మరో రాష్ట్రంలో బి.జె.పి. అధికారంలోకి వచ్చిందన్నది గాదు ఇక్కడ సమస్య. బి.జె.పి. బహిరంగంగా అంగీకరించినా, లేకున్నా హిందూత్వ అనబడే మెజార్టీ మత సాంస్కృతిక జాతీయవాదం దాని ప్రధాన భావజాలం. మెజార్టీ మత భావజాలాన్ని వ్యాపింపచేయడం, ఒకరకమైన సివిల్ కోడ్‌ను రూపొందించడం, రాజ్యాంగంలో 356 నిబంధనను తొలగించడం, యితర మతాల పట్ల, ముఖ్యంగా వామపక్ష రాజకీయాల పట్ల ద్వేషభావాన్ని పెంచడం దాని ముఖ్యోద్దేశాలు. చరిత్రను వక్రీకరించి, పుక్కిటి పురాణాలతో, కట్టు కథలతో గత చరిత్రను మతపరంగా వివరించి, హిందూయేతర మతాలను, వాటి పాలకులను, పరిపాలనను మతపరంగా చిత్రీకరించడం – వీటన్నింటినీ దృష్టిలో ఉంచుకొన్నప్పుడు కర్ణాటకలో బి.జె.పి. విజయం ప్రమాద ఘంటికలను మోగిస్తోంది.

కర్ణాటకలో కొన్ని సంవత్సరాలుగా బి.జె.పి. తన బలాన్ని పెంచుకోడాన్కి ప్రయత్నాలు చేస్తూ వచ్చింది. ఒక దశలో రాష్ట్ర అసెంబ్లీలో నాలుగుస్థానాలు మాత్రమే ఉన్న పార్టీ ఈనాడు ఏకంగా 110 స్థానాలకు తన బలాన్ని గణనీయంగా పెంచుకొంది. ఇది ఎలా జరిగింది? తిరంగ ఉద్యమం, ఇస్లాం మత పూజనీయ స్థానాలను వివాదాస్పద ప్రాంతాలుగా ప్రకటించి, వాటిని ఆక్రమించేందుకు ఉద్యమాలు నిర్వహించడంతో పాటు, కర్ణాటక రాష్ట్రంలో నెలకొన్న రాజకీయ పరిస్థితులను తనకు అనుకూలంగా మలచుకోడంలో విజయం సాధించింది. జనతాదళ్ (సెక్యులర్) పార్టీ అవకాశవాద రాజకీయాలను తెలిసివుండీ, దానితో పొత్తులు పెట్టుకోడం (ఈ పనిలో కాంగ్రెస్, బి.జె.పి.కి ఏమాత్రమూ తీసిపోలేదని గ్రహించాలి), వారి కార్యక్రమంలో ఒక భాగమే. దక్షిణ భారతదేశంలోని నాలుగు రాష్ట్రాల్లో కర్ణాటక ఒకింత ఇతర రాష్ట్రాల కంటె భిన్నం. చారిత్రకంగా, మతానికీ, మతమౌఢ్యానికీ, మతపరమైన రాజకీయాలకూ దక్షిణాది దూరంగా ఉంటూ వచ్చింది. ద్రావిడ సంస్కృతి ప్రభావం కావచ్చు. ఇక్కడ అనుచానంగా కులవ్యవస్థకున్న పట్టు, మతానికి లేదు. బ్రాహ్మణాధిపత్యానికి వ్యతిరేకంగా నెలకొన్న బ్రాహ్మణేతర ఉద్యమాలు, విదేశీ దండయాత్రలకు దూరంగా ఉండడం కూడా కావచ్చు. ఇంకా, వామపక్ష భావజాలం, ప్రజా ఉద్యమాలు, పోరాటాలు బలంగా

*పెట్రో ముడిచమురు ఉత్పత్తులపై, వాణిజ్యంపై గుత్తాధిపత్యం అమెరికన్ కంపెనీలదేనని, అందువల్లనే ఈ ధరల పెరుగుదల అని అంటున్నారు* **బోర సుభాష్**

# ప్రజలపై పెట్రో ధరల పెనుభారం

**భా**రత ప్రభుత్వం పెట్రో ఉత్పత్తుల ధరలను పెంచింది. పెట్రోల్ ధరను లీటరుకు ఐదు రూపాయలు, డీజిల్ లీటర్‌కు మూడు రూపాయలు, గ్యాస్ సిలెండర్‌కు యాభై రూపాయలు పెంచింది. దీనికితోడు పెట్రోల్, డీజిల్‌పై ఎక్సైజ్ సుంకాన్ని ఒక్క రూపాయి తగ్గించింది. ముడిచమురు దిగుమతులపై కస్టమ్స్ సుంకాన్ని ఐదు శాతం తగ్గించింది. ప్రజలపై 45 వేల కోట్ల రూపాయల భారం మోపింది. ఫలితంగా ద్రవ్యోల్బణం తొమ్మిది శాతానికి చేరుతుందనీ, త్వరలో రెండంకెల స్థాయిని దాటుతుందని ఆర్థిక నిపుణుల అంచనా. అంటే ఇప్పటికే ఆకాశాన్నంటు తున్న ధరలు రాకెట్ వేగంతో రోదసిలోకి దూసుకుపోతాయి.

పెట్రో ధరల పెంపుదల తర్వాత దేశ ప్రజలనుద్దేశించి ప్రధాన మంత్రి మన్మోహన్ సింగ్ మాట్లాడుతూ అంతర్జాతీయ మార్కెట్లో ముడి చమురు ధరలు పెరిగినందున దేశంలో ధరలు పెంచక తప్పలేదని అన్నారు. వినియోగాన్ని తగ్గించుకోవాలని, ఇంధన వ్యయాన్ని తగ్గించి ప్రతి చుక్క పెట్రోలునూ ఆదా చేయాలనీ ప్రజలను కోరారు. ధరలను అదుపులో ఉంచేందుకు రాష్ట్ర ప్రభుత్వాలు తమ అమ్మకం పన్నును

---

వెళ్ళూనుకొని, మత రాజకీయాలకు ఇటీవలి వరకూ తావులేకుండా చేశాయి. ఒక కోణంలో చూసినప్పుడు, లౌకిక రాజకీయాలకు బలమైన కేంద్రంగా దక్షిణ భారతం నిలిచింది. కానీ, గత రెండు దశాబ్దాల్లో, దేశ రాజకీయాల్లో వచ్చిన మార్పుల దృష్ట్యా, పైన వివరించుకొన్న పరిస్థితుల్లో మార్పు క్రమేపీ పొడసూపుతూ వచ్చింది. ముఖ్యకారణం, ప్రధాన రాజకీయ పక్షమైన కాంగ్రెస్ అవలంబిస్తున్న అవకాశవాద రాజకీయాలు, సమ సమయానుకూలంగా, అది అవలంబించే మెతక హిందూత్వ (సాఫ్ట్ హిందూత్వ) కూడా కారణాలుగా చెప్పుకోవాలి. తెలుగుదేశం లాంటి ప్రాంతీయ పార్టీలు ఎన్నికల్లో లబ్ది కోసం, కాంగ్రెస్‌ను వ్యతిరేకించే విధానాల్లో భాగంగా బి.జె.పి.తో చేతులు కలపడం కూడా దీనికి కారణాలు. కాగా, అయోధ్యలో బాబ్రీ విధ్వంసం తర్వాత కింది కులాలని చెప్పబడ్డ వాటిలో మత విద్వేషాన్ని రగిలించడం దీనికి తోడ్పడింది. దీనికి తార్కాణం, అయోధ్యలో తలపెట్టిన కరసేవకులు, వలంటీర్లు ఈ కులాల నుండి అసంఖ్యాకంగా ఆంధ్రప్రదేశ్, కర్ణాటక నుండి వెళ్ళడమే. దక్షిణాదిన ఉన్న మూడూ రాష్ట్రాల్లో – ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళల్లో అక్కడున్న ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా మినహాయిస్తే – మిగిలిన కర్ణాటకలోనే బి.జె.పి. వ్యూహం నెరవేరేందుకు అనువైన పరిస్థితులేర్పడ్డాయి.

ఇక కాంగ్రెస్ పార్టీలో నెలకొన్న అంతర్గత సంక్షోభంతో పాటు బహు నాయకత్వం తోడైంది. నిర్మాణగత పటిష్టతలేదు. క్షేత్రస్థాయిలో కొన్ని చోట్ల బూత్ కమిటీలు లేకపోవడం దీనికొక ఉదాహరణ. బి.జె.పి.కి కలసొచ్చిన సానుభూతి పవనాలు – ఇవన్నీ, కర్ణుని చావుకు కారణాల కోసం అన్నట్లు, కాంగ్రెస్ ఓటమికి దారితీసి ఉండవచ్చు. దేశంలోనే పెద్ద ప్రజాస్వామిక పక్షంగా చెప్పుకొనే కాంగ్రెస్‌కు వారసత్వంగా వచ్చిన ఫ్యూడల్ దర్బారీ సంస్కృతి స్థానిక నాయకత్వానికి చోరవలేకుండా చేసింది. ఈ సంస్కృతిని కాంగ్రెస్‌వాదులు ప్రశ్నించడానికి వీల్లేదు. ఓటమిని నిజాయితీగా అంగీకరించి, సమీక్షించుకొని, పాఠాలు నేర్చుకొనే సంప్రదాయం కాంగ్రెస్‌కు ఏనాడూ లేదు. ఏవో కుంటిసాకులతో కాలక్షేపం చేయడం మినహా. కాంగ్రెస్ ఓటమికి ఇవి మాత్రమే కారణాలనుకుంటే పొరబాటే. అనైక్యత, స్వార్థ ప్రయోజనాలు, అంతర్గత సంక్షోభానికి బి.జె.పి. మినహాయింపేమీకాదు. ఇక్కడ గమనించాల్సిన మరో ముఖ్య కారణం, ప్రజల్లో కాంగ్రెస్ పార్టీ అనుసరిస్తున్న విధానాల వలన గూడుకట్టుకుంటున్న తీవ్ర వ్యతిరేకత. పెరుగుతున్న ద్రవ్యోల్బణం, దాన్ని అరికట్టలేని ప్రభుత్వ సంపన్న వర్గాల అనుకూల విధానాలు, అధిక ధరల తాకిడికి కుదేలవుతున్న మధ్య, కింది మధ్య తరగతి, పేద వర్గాల్లో కాంగ్రెస్ వ్యతిరేకత పెరిగింది. సంపన్న వర్గాల్లో అనుకూల విధానాలు పార్టీకి నష్టం తెస్తున్నాయని కాంగ్రెస్ సీనియర్ నేతలు భావిస్తున్నారనీ, దీనికి తోడు, నిజాయితీ పరుడనిపించుకొన్నా, 'బలహీనమైన ప్రధాని' గా మన్మోహన్‌సింగ్‌ను కొందరు భావిస్తున్న వార్తలు ఊపందుకొంటున్నాయి. యు.పి.ఎ. ప్రభుత్వాన్ని సమర్థిస్తున్న వామపక్షాలు (మతవాద రాజకీయాలకు అడ్డుకట్ట వేయాలన్న సదుద్దేశంతోనే కావచ్చు) కూడ ప్రజల్లో తమ విశ్వసనీయతను క్రమేపీ కోల్పోయే పరిస్థితి ఏర్పడింది.

ఫాసిస్టు మతభావజాల ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి దేశంలోని లౌకిక శక్తులన్ని ఏకం కావాల్సిన పరిస్థితి ఆసన్నమైంది. భారతీయ బహుళ సంస్కృతీ సంప్రదాయాలకు మత రాజకీయాలు ఎంత ప్రమాదమో, కేంద్ర ప్రభుత్వమనుసరిస్తున్న ఆర్థిక విధానాలు సామాన్య ప్రజల జీవనానికి మరింత ప్రమాదాన్ని కలిగిస్తున్నాయి. వీటినెదుర్కొని పోరాడ్డానికి ప్రజాస్వామ్యవాదులు, వామపక్ష శక్తులు కలిసి సంఘటిత ఉద్యమాలు నిర్మించడం అవసరం. ◆

తగ్గించుకోవాలని కోరారు. వెనువెంటనే వివిధ రాష్ట్రాల ముఖ్యమంత్రులు కేంద్రం పెంచిన ధరలను తామే భరించి, పాత ధరలకే అమ్ముతామంటూ ప్రకటించారు.

ఇది అసలు విషయాన్ని తిరగేసి చెప్పటం తప్ప మరేమీ కాదు. పెట్రో ఉత్పత్తులపై రాష్ట్రాల అమ్మకం పన్ను 20-30 శాతం వరకూ ఉంది. దీనివల్ల రాష్ట్రాలకు 37 వేల కోట్ల రూపాయల ఆదాయం వస్తోంది. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్‌నే తీసుకుంటే కేంద్రం పన్ను తగ్గించినందువల్ల ఆరు వందల కోట్ల రూపాయల ఆదాయం తగ్గుతుంది. అంతకు ముందు 1800 కోట్ల రూపాయల ఆదాయం వచ్చేది. కాగా ధరలు పెరిగినందున పన్ను రేటు తగ్గించినా అమ్మకం పన్ను నుండి ఆదాయం 425 కోట్లు పెరుగుతుంది. కాగా ఆదాయంలో తగ్గుదల 175 కోట్ల రూపాయలు మాత్రమే. ముఖ్యమంత్రి పెంచిన గ్యాస్ ధర యాభై రూపాయలు పెంచకుండా పాత ధరకే అమ్ముతామని ప్రకటించారు. దీనివల్ల అదనంగా రావలసిన అమ్మకం పన్ను ఆదాయాన్ని కోల్పోతారు తప్ప నష్టపోయేదో, ప్రభుత్వం భరించేదో ఏమీ ఉండదు.

ఇప్పుడు పెంచిన ధరల ప్రకారం పెట్రోల్ ధర ఐదు రూపాయలు పెరిగి 56 రూపాయలు చేరుతున్నదంటే, ఆ ధరలో వివిధ విభాగాలు ఇలా ఉంటాయి. (రమారమిగా)

| | రూపాయలు |
|---|---|
| ఉత్పత్తి, రవాణా, లాభం కలిపి పెట్రోల్ ధర | 24.00 |
| కేంద్రం కస్టమ్స్, ఎక్సైజ్ | 16.50 |
| అదనపు ఎక్సైజ్ | 6.00 |
| రోడ్ల అభివృద్ధి సెస్ | 1.50 |
| ఆంధ్రప్రదేశ్ అమ్మకం పన్ను | 8.00 |
| **మొత్తం ధర** | **56.00** |

అంటే లీటర్‌కు 24 రూపాయలు ధర మీద కేంద్రం 24 రూపాయలు పన్నులు వేస్తుండగా రాష్ట్రం ఎనిమిది రూపాయల పన్నులు వేస్తోంది. కేంద్రానికి వస్తున్న ఎక్సైజ్ ఆదాయంలో సగం అంటే 1,25,000 కోట్ల రూపాయలు పెట్రోలియం ఉత్పత్తుల నుండే వస్తోంది. వీటిపై కస్టమ్స్ డ్యూటీ వల్ల రు. 1,04,900 కోట్లు వచ్చింది. దాదాపు 2,30,000 కోట్ల రూపాయలు పన్నుల రూపేణా కేంద్రం పొందుతుండగా రాష్ట్రాలు అమ్మకం పన్ను ద్వారా మరో 36 వేల కోట్ల రూపాయలు పొందు తున్నాయి. ప్రస్తుతం ఎక్సైజ్, కస్టమ్స్‌ను తగ్గించినందువల్ల కేంద్రానికి ఇరవై రెండు వేల కోట్ల రూపాయలు మాత్రమే ఆదాయం తగ్గుతోంది. ఇంకా 2,44,000 కోట్ల రూపాయల ఆదాయం వస్తోంది.

చమురు నుండి కేంద్రం, రాష్ట్రాలకు 2001-02లో రు. 73 వేల కోట్లు పన్నుల ఆదాయం రాగా, అది 2002-03లో 96 వేల కోట్ల రూపాయలకూ, 2003-04లో లక్ష కోట్లకూ, గత ఏడాది ఒక లక్షా 64 వేల కోట్లకూ పెరిగింది. ఈ ఏడాది రెండు లక్షల నలభై నాలుగు వేల కోట్లకు చేరింది. ఇవి కాక చమురు అభివృద్ధి సెస్ కింద ఒ.ఎన్.జి.సి., ఐ.ఒ.ఎల్.ల నుండి టన్ను చమురు పై 2500 రూపాయలు వసూలు చేస్తోంది. ముడిచమురు ధరలు పెరిగినప్పుడల్లా ప్రభుత్వానికి రాబడి ఇబ్బడిముబ్బడిగా పెరుగుతున్నది.

దేశంలోనూ, ప్రపంచంలోనూ, ప్రత్యేకించి భారత్, చైనాలలో వినియోగం పెరిగినందున పెట్రో ఉత్పత్తుల డిమాండ్ పెరిగి ధరలు పెరుగుతున్నాయని అమెరికా ప్రచారం చేస్తోంది. ప్రధానమంత్రి తన ప్రసంగంలో పరోక్షంగా ఈ వాదనను అంగీకరించారు. వినియోగం తగ్గించమనీ, ప్రతి చుక్క ఇంధనాన్ని ఆదా చెయ్యమని పిలుపునిచ్చారు. ఈ వాదనలో వాస్తవముందా?

'ప్రపంచ పెట్రోల్ వినియోగ పెరుగుదల బలంగా లేదన్న ముఖ్య అంశాన్ని మనం గుర్తించాలి' ఈ మాటలన్నది పెట్రో పరిశ్రమలకు ద్రవ్యమందించే బ్యాంకుల్లో మొదటి స్థానంలో ఉన్న జె.పి. మోర్గాన్ ఫండ్‌కు మార్కెట్ల ముఖ్య విశ్లేషకుడు డెవిడ్ కెల్లి.

అంతేకాక పెట్రోలియం ఎగుమతి చేసే దేశాల సంస్థ (ఒపెక్) 2008లో ముడిచమురు డిమాండ్ మార్పు చెందకుండా రోజుకు 8.7 కోట్ల బ్యారెల్సు ఉంటుందని అంచనా వేసింది. కనుక అంతర్జాతీయ మార్కెట్‌లో ముడిచమురుధరల పెరుగుదలకు వినియోగం బాగా పెరిగిపోవడం అనేది కారణం కాదు.

2003లో అమెరికా పార్లమెంట్ సభ్యులతో కూడిన కమిటి ముడిచమురు బ్యారెల్ 60 డాలర్లు ఉన్న సమయంలో పరిశీలన జరిపి, బ్యారెల్ ధర 25 డాలర్లు ఉండగా మిగిలిన 35 డాలర్లు భవిష్యత్ వాణిజ్య జూదం వల్ల పెరిగిందని నిర్ధారణకు వచ్చింది. ఇప్పుడు 2008లో ముడిచమురు బ్యారెల్‌కు 128 డాలర్లకు చేరుకోగా దానిలో అరవై శాతం వాణిజ్య జూదం వల్లనేనని తేలుతున్నది. అంటే ముడి చమురు బ్యారెల్ ధర 50-55 డాలర్ల మధ్య ఉండగా, వాణిజ్యం దానిని 128 డాలర్లకు పెంచింది. అసలు వాస్తవ ధర ఎంతో జె.పి. మోర్గాన్ వంటి బ్యాంకులు, ఎక్సాన్, మొబిల్ వంటి ఆయిల్ కంపెనీ యాజమాన్యానికి మాత్రమే తెలుసు.

ముడిచమురు ఉత్పత్తిపై (అది ఏ దేశంలో సాగుతున్నా) గుత్తాధిపత్యం నాలుగు అమెరికా కంపెనీలదే. ముడిచమురు వాణిజ్యం పై గుత్తాధిపత్యం కూడా నాలుగు అమెరికా బ్యాంకులదే. కనుకనే మధ్య ప్రాచ్య దేశాలపై, వాటి ముడిచమురు వనరులపై ఆధిపత్యం కోసం దురాక్రమణ యుద్ధాలు సాగిస్తూ, ఆ యుద్ధ భారాన్నంతా ప్రపంచ ప్రజలపై రుద్దుతోంది. ముడి చమురు ధరల పెరుగుదలకు అసలు కారణమిది.

భారతదేశ ముడిచమురు అవసరాలలో ముప్పై శాతం వరకూ దేశీయంగా ఉత్పత్తి అవుతుండగా మిగిలినది దిగుమతి చేసుకుంటున్నారు. భారతదేశంలో ఒ.ఎన్.జి.సి. ముడిచమురును వెలికితీసి, ఐ.ఒ.సి., హెచ్.పి.సి.ఎల్., ఐ.బి.పి. వంటి రిఫైనరీలకు అంతర్జాతీయ రేటుకు అమ్ముతోంది. ధరలను నియంత్రించే బాధ్యతను ప్రభుత్వం వదలివేసి, మార్కెట్ శక్తులే నిర్ణయిస్తాయన్న విధానాన్ని అనుసరిస్తోంది. ఉత్పత్తి ఖర్చులను బట్టి కాకుండా ఉక్కుమిల్లులు ఉక్కు ధరలను ఒక టన్ను అరవై వేల రూపాయలకు పెంచినట్లుగానే ఒ.ఎన్.జి.సి. కూడా అంతర్జాతీయ ధరలతో అమ్ముతోంది. కాగా ఒ.ఎన్.జి.సి. కి ఉత్పత్తి వ్యయం బ్యారెల్‌కు ముప్పై డాలర్లు మించదు. కనుకనే ప్రస్తుత పెంపుదల సందర్భంగా ఒ.ఎన్.జి.సి. వంటి కంపెనీలకు వస్తున్న నలభై అయిదు వేల కోట్ల రూపాయల లాభాల నుండి రిఫైనరీ

లకు చెల్లించమని ప్రభుత్వం చెప్పింది. ప్రభుత్వం బ్యారెల్ తొంభై డాలర్లు దాటినప్పుడు ధరలు పెంచింది. ఇప్పుడు 120 అయింది కనుక నష్టాలంటున్నది. ముప్ఫై శాతం దేశీయ ఉత్పత్తిపై వస్తున్న లాభాలను కలిపితే, నష్టం ప్రభుత్వం చెబుతున్నదానికన్నా చాలా తగ్గుతుంది. ప్రభుత్వం నిర్ణయించిన రేటుకే అమ్ముతున్న రిలయన్స్ ఇండస్ట్రీస్ చమురు రిఫైనరీ విభాగంకు 2005-06 లో రు. 5915 కోట్లు లాభం రాగా, 2007-08లో రు. 10,372 కోట్లకు పెరిగింది. అంటే రిలయన్స్ లాభాలు మూడేళ్లలో రెట్టింపు కాగా, ప్రభుత్వ రిఫైనరీలకు నష్టాలెలా వచ్చాయి? దీన్ని బట్టి నష్టాల అంకెలన్నీ అతిశయోక్తులే.

దిగుమతులను తగ్గించేందుకు దేశీయ ఉత్పత్తిని పెంచుకోవలసి ఉండగా, దేశీయ వనరులను విదేశీ కంపెనీలకు అమ్మివేస్తున్నారు. దేశీయ కంపెనీలనే వాటికి ఇచ్చిన వనరులను కూడా అవి విదేశీ కంపెనీలకు అమ్ముకుంటున్నాయి. కెజి బేసిన్‌లో డి-6 బ్లాక్‌ను రిలయన్స్ కంపెనీకివ్వగా, అది షెల్ కంపెనీకి లాభానికి అమ్ముకుంది. షెల్ కంపెనీ ఇక్కడి నుండి వెలికితీసే గ్యాస్, ముడి చమురును అంతర్జాతీయ రేటుకు అమ్ముతోంది. అంటే మన ముడి చమురును మనకే అధిక ధరలకు అమ్ముతోంది.

వెలికితీసేందుకు మన వద్ద పెట్టుబడులు లేనందున విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తున్నామంటున్నారు. ఒ.ఎన్.జి.సి. నైజీరియాలోనూ, రష్యాలోని సఖాలిన్‌లోనూ ముడిచమురు వెలికితీతకు ఒప్పందాలు చేసుకుంది. అంటే తగిన సాంకేతిక పరిజ్ఞానమూ, పెట్టుబడులు ఒ.ఎన్.జి.సి. వద్ద ఉన్నాయని తెలుస్తోంది. వాటినే దేశీయ ముడిచమురు వెలికితీతకు వినియోగిస్తే, విదేశీ దోపిడీ నుండి బయటపడతాం. ముడిచమురు ధరలు మన అదుపులోనే ఉంటాయి. కాగా సామ్రాజ్యవాదుల ముందు మోకరిల్లే మన పాలకులు మన వనరులన్నీ సామ్రాజ్యవాదుల పరం చేసి దేశ ప్రజలపై దోపిడీని రుద్దుతున్నారు.

అంతేకాక, దేశంలో పెట్రో ఉత్పత్తుల వినియోగం విచక్షణా రహితంగా పెంచివేసే విధానాలను ప్రభుత్వం అనుసరిస్తోంది. ఆ విధంగా మన సహజ వనరులు దుర్వినియోగమవుతున్నాయి. వ్యక్తిగత రవాణా వాహనాలు - కార్లు, మోటార్ సైకిళ్ల వాడకాన్ని ప్రోత్సహిస్తోంది. సామూహిక ప్రజారవాణా సాధనాలను నిరుత్సాహపరుస్తోంది. ఉదాహరణకు హైదరాబాద్ నగరంలో రోడ్డు స్థలంలో ఐదు శాతం ఆక్రమిస్తున్న బస్సులు అరవై శాతం ప్రయాణీకులను గమ్యాలకు చేరవేస్తుండగా, ఎనభై శాతం స్థలాన్ని ఆక్రమిస్తున్న కార్లు పది శాతం మందిని మాత్రమే రవాణా చేస్తున్నాయి. నలుగురు ప్రయాణీకులు తీసుకువెళ్లే కారుకు కావలసిన స్థలం కన్నా, అంతమందినే తీసుకువెళ్లే ఆటోకు మూడవ వంతు స్థలం అవసరం. అయినా ఆటోల వల్లే ట్రాఫిక్ అంతా అస్తవ్యస్థమౌతున్నదంటూ కార్లకోసమే వేల కోట్ల రూపాయలు వెచ్చించి, ఇళ్లు కూలగొట్టి, స్వయం ఉపాధినిచ్చే షాపులను తొలగించి రోడ్లు వెడల్పు చేస్తున్నారు. ఏ ఇంధనమూ అవసరంలేని, ఆరోగ్యకరమైన సైకిళ్లతో ఈ రోడ్లపై ప్రయాణించడం ప్రాణాలతో చెలగాటమైంది. ఈ వ్యక్తిగత వాహనాలలో ఎనభై శాతం వరకూ ఆరు మహానగరాలలోనే ఉన్నాయంటే నగరాలలో వాయుకాలుష్యానికీ, తత్పర్యవసానంగా నగరంలో నివసించే వారి అనారోగ్యానికీ ఎలా కారణమౌతున్నాయో వేరుగా వివరించనక్కరలేదు. పెట్రో ధరల పేరుతో అమెరికాతో అణు ఒప్పందాన్ని ఒప్పించ జూస్తున్నారు. అణు ఇంధనం కోసం అమెరికాపై ఆధారపడే విధానం తప్ప మరొకటి కాదు.

డీజిల్ రేటు పెంపుదల వల్ల డీజిల్ పంపుసెట్లు వాడే రైతాంగం పరిస్థితి మరింత . ప్రభుత్వాల నుండి ఏ మద్దతూ అందక సాగుభారమై అప్పుల ఊబిలో కూరుకుపోతున్న రైతాంగానికి ఇది పెనుభారమే. బస్సు, లారీల రవాణా ఛార్జీలు పెరిగి, ధరల పెరుగుదల రూపంలో ఆ భారమంతా ప్రజలపైనే పడుతోంది. మరోవైపున అయిదు నుండి యాభై లక్షల ఖరీదు చేసే కార్లను కొన్న ధనాఢ్యులు డీజిల్ వాడుతున్నారు. మూడు రూపాయల పెంపుదల వారికేమాత్రం భారం కాకపోగా, పెట్రోలుతో పోల్చినప్పుడు లాభదాయకంగా ఉంది. దీనితో డీజిల్ కార్లు పెరుగుతున్నాయి. జనాభాలో 15 శాతంగా ఉన్న ధనిక వర్గాల కార్ల వాడకాన్ని పెంచే విధంగా ధరలు నిర్ణయించి, నాలుగు కార్ల తయారీ కంపెనీలు దేశ వనరులను తరలించుకు పోయేందుకు వీలైన విధానాలను ప్రభుత్వం అనసరిస్తోంది. ఒక్క సుజూకీ మారుతీ కార్ల కంపెనీ గత ఏడాది రాయల్టీ పేరిట వంద కోట్లు, విడిభాగాల పేరిట ఏడు వందల కోట్ల లాభాలను తరలించుకు పోయింది.

పెంచిన డీజిల్, వంటగ్యాస్ ధరలను తగ్గించాలనీ, ప్రజా రవాణా సాధనాలైన రైల్వేలు, బస్సులకు డీజిల్ తక్కువ రేటుకివ్వాలనీ, వ్యక్తిగత మోటారు రవాణా వాహనాల వినియోగంపై ఆర్థిక నియంత్రణ విధించాలనీ, ప్రజా రవాణా వ్యవస్థలను పటిష్టం చేయాలనీ, దేశీయ చమురు ఉత్పత్తిని పెంచి, దిగుమతులను తగ్గించే విధంగా ధరల విధానం ఉండాలనీ, పెట్రోలియం రంగం ప్రభుత్వ ఆధీనంలో ఉండాలనీ, ఈ రంగంలో విదేశీ కంపెనీలన్నింటినీ తొలగించాలనీ, సమగ్ర ఇంధన వినియోగ విధానాన్ని ప్రజా ప్రయోజనాల దృష్టితో రూపొందించాలనీ, తరిగిపోని ఇంధన వనరులపై (గాలి, నీరు, సూర్యరశ్మి) పరిశోధన కేంద్రీకరించాలనీ విధానకర్తలపై ఒత్తిడి తేవాలి. ప్రత్యామ్నాయంగా అణు ఇంధనాన్ని ప్రతిపాదించకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఒత్తిడి తేవాలి. ◆


**వచ్చే సంచికలో...**

- **ఫోకస్ - ఆగస్ట్ 2008 : మారుతున్న ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు**
- **ప్రాచీన లిపుల సమస్యలు - కొడవటిగంటి రోహిణీప్రసాద్**
- **సంస్కరణల వైఫల్యం - ద్రవ్యోల్బణం పెరుగుదల - డి. నరసింహారెడ్డి**

*సమాజంలోని మెజారిటీగా ఉన్న దళిత, బహుజన ప్రజలకు చెందిన సంస్థలపై రాసే కథనాలు నిర్దిష్టమైన ఆధారాలతో రాయాలనీ, ఆ బాధ్యత ఆంధ్రజ్యోతి పత్రిక విస్మరించిందనీ అంటున్నారు* **కె. సత్యనారాయణ**

# ఆ కథనంపై చర్చ అవసరం లేదా?

మన రాష్ట్రంలో పత్రికా స్వేచ్ఛను ఒక ప్రజాస్వామిక విలువగా గుర్తిస్తున్నారనడానికి, ఆ విలువను కాపాడుకోవడానికి చాలామంది ప్రజాస్వామికవాదులు, సంస్థలు ఉన్నాయనడానికి ఆంధ్రజ్యోతిపై ఎం.ఆర్.పి.ఎస్. చేసిన దాడిని నిరసిస్తూ వచ్చిన వెల్లువలాంటి ప్రకటనలు, స్పందనలు, వ్యాసాలే సాక్ష్యం. పత్రికల భావ ప్రకటనా స్వేచ్ఛను దాడుల ద్వారా నియంత్రించడం వల్ల సమాజంలో పీడితులైన దళిత, పీడిత కులాల వారికే ఎక్కువ నష్టం జరుగుతుందనడంలో సందేహం లేదు. ఎం.ఆర్.పి.ఎస్. నాయకత్వం ఆంధ్రజ్యోతిపై భౌతిక దాడికి విచారం వ్యక్తం చేయడం వల్ల దళిత కులాల, ఇతర పీడిత కులాల ప్రజల ఉద్యమాల పట్ల, ఆ సంస్థల నాయకత్వం పట్ల సమాజంలో గౌరవం పెరుగుతుంది. ముఖ్యంగా ఉద్యమ సంస్థల నాయకుల్ని కించ పరుస్తూ, నిందిస్తూ రాసిన 'బాడుగ నేతలు' కథనంపై నిష్పాక్షమైన బహిరంగ చర్చకు వీలు కలుగుతుంది. పత్రికా రంగం కుల స్వభావంపై, వర్గ రాజకీయాలపై జరపాల్సిన చర్చకు ఎం.ఆర్.పి.ఎస్. వైఖరి అడ్డంకిగా ఉంది.

ఆంధ్రజ్యోతి యాజమాన్యం ఎం.ఆర్.పి.ఎస్. దాడి ఘటనపై జరుగుతున్న చర్చలో ఒక కోణాన్ని మాత్రమే ప్రచారం చేస్తోంది. ఆంధ్రజ్యోతి యాజమాన్యపు వైఖరి ఎం.ఆర్.పి.ఎస్. వైఖరులతో విభేదిస్తూ రాసిన వ్యాసాలు, లేఖలకు ఆంధ్రజ్యోతిలో 'స్పేస్' లభించడం లేదు. ఆంధ్రజ్యోతి యాజమాన్యం పత్రికా స్వేచ్ఛకు గ్యారంటీ ఇచ్చిన తర్వాతే తాము రాసిన 'బాడుగ నేతలు' కథనంపై చర్చ జరపాలని అన్నది. దాడి జరిగిన రోజునుంచి ఆ పత్రిక ప్రచురించిన వ్యాసాలు, ప్రకటనలు పరిశీలిస్తే, పత్రికా స్వేచ్ఛను సమర్థిస్తూ, ఎం.ఆర్.పి.ఎస్. దాడిని ఖండిస్తున్న వాటినే అంటే పత్రిక వైఖరిని ఎత్తిపట్టే వాదనలకే చోటు కల్పించినట్టు తెలుస్తోంది. మహారథి, అమర్వాణి, రంగనాయకమ్మ గార్ల వ్యాసాలు, దుడ్డు ప్రభాకర్ రాసిన రెండు వ్యాసాలు ఆంధ్రజ్యోతి వాదనల్ని బలపరిచేవిగా ఉన్నాయి. ఆంధ్రజ్యోతిపై దాడిని పత్రికా స్వేచ్ఛపై దాడిగా ఖండించటం అధికార పార్టీ అండదండలతోనే ఎం.ఆర్.పి.ఎస్. దాడి చేసిందని విమర్శించటం, ఈ దాడివల్ల దళిత, బి.సి. కులాల ఉద్యమాలకే నష్టమని హెచ్చరించటం లాంటి అంశాలే ఆంధ్రజ్యోతి పత్రికలో చర్చకొచ్చాయి. 'ప్రజా జీవితంలో ఉన్న వ్యక్తుల మంచి చెడ్డలను చర్చించడం భావ ప్రకటనా స్వేచ్ఛలో ఒక భాగం' అని భావించే ఆంధ్రజ్యోతికి తన వైఖరిని మాత్రమే సమర్థించుకునే వ్యాసాలు వేయడం, విభిన్న వర్గాల వాదనల్ని వినిపించకపోవడం సమంజసమేనా? మరీ ముఖ్యంగా 'బాడుగ నేతలు' కథనం వాస్తవమే, ఇలాంటి కథనాలు ఉద్యమాలను 'చెక్' చేయటానికి అవసరమే అనే వాదనల్ని తప్ప, ఆ కథనంపై విమర్శనాత్మక వాదనల్ని ఎందుకు అడ్డుకుంటోంది? ఆంధ్రజ్యోతి బడుగుల పట్ల ఆర్తితో ఈ కథనం రాసిందని అంటున్నారు కాబట్టి దానిపై వివిధ బడుగువర్గాల సంస్థలు, నాయకుల స్పందన తెలుసుకోవాల్సిన అవసరం ఇప్పటికైనా లేదా? తమ పత్రికను 'నిజం చెప్పేనోరు', 'సత్యం పలికే కలం'గా వర్ణిస్తే సరిపోతుందా?

ఆంధ్రజ్యోతిపై దాడికి కారణమైన 'బాడుగ నేతలు' కథనాన్ని పరిశీలిద్దాం. రాష్ట్రంలో ఉపఎన్నికలు జరుగుతున్న సందర్భంలో దళిత, బి.సి. కుల సంఘాలు అధికార కాంగ్రెస్ పార్టీకి అమ్ముడుపోయాయని ఎత్తిచూపటం ఈ కథనంలో ప్రధానాంశం. ఈ కథనం చదివిన పాఠకులకు రాష్ట్రంలోని ఏయే దళిత, బి.సి. సంఘాలను ఉద్దేశించి రాసారో స్పష్టంగానే అర్థమవుతుంది. ఆంధ్రజ్యోతి 'మేం పేర్లను ప్రస్తావించలేదు' అన్నంత మాత్రాన ఆ కథనం కల్పితమని ఎవరూ అనుకోరు. అలా అనుకోవాలనేది ఆంధ్రజ్యోతి ఉద్దేశ్యం కాదు.

పత్రిక మొదటి పేజీలో వేసిన 'బాడుగ నేతలు' కథనం, ఇతర సబ్ హెడ్డింగ్స్ చాలా అభ్యంతరకరంగా ఉన్నాయి. దళిత, బి.సి. సంఘాల నాయకుల్ని విమర్శించటానికి (కాదు దూషించడానికి) ఉపయోగించిన భాష, పదజాలం, హర్షించదగిన రీతిలో లేవు. కులసంఘాల నాయకుల్ని 'ఊసరవెల్లులు', 'దగాకోరులు', 'స్వీయ సంక్షేమవాదులు' అంటూ నిందించారు. ఈ నాయకులు 'సర్కార్‌కు దాసోహమయ్యారని', 'ప్రభుత్వ భజన' చేస్తున్నారని, అందినకాడికి దండుకుంటున్నారని, కొందరు రాజకీయ నాయకులు ఇచ్చే జీతాలతో ఉద్యమాలు నడుపుతున్నారని తీవ్రస్థాయిలో దుమ్మెత్తిపోసారు. దళిత, బి.సి. సంఘాల నాయకుల్ని అవినీతిపరులుగా, నీతి, నిజాయితీ లేని వారుగా చిత్రీకరించి, వారి పరువుతీసి, ప్రజల్లో భ్రష్టుపట్టించాలనేదే ఆంధ్రజ్యోతి ఉద్దేశ్యంగా కనిపిస్తోంది. దళిత, బి.సి. సంఘాలలోని తప్పుడు ధోరణుల్ని సరిదిద్దాలనే 'ఆర్తి' ఈ కథనంలో కనబడదు. ఇంత అన్యాయమైన కథనం రాసి, దాడి తర్వాత మళ్లా ప్రచురించి, 'ఇందులో తప్పేమిటి?' అని ఆంధ్రజ్యోతి యాజమాన్యం అమాయకంగా అడగడం విడ్డూరంగా ఉంది.

సమాజంలోని మెజారిటీ ప్రజలైన దళిత, బి.సి. ప్రజలకు చెందిన సంస్థలపై రాసే కథనం విషయంలో కచ్చితమైన ఆధారలతో నిర్దిష్టమైన ఆరోపణలు, విమర్శలు చేయాల్సిన బాధ్యతను ఆంధ్రజ్యోతి విస్మరించింది. దళిత, బి.సి. సంఘాలన్నింటినీ ఒకే గాటనకట్టి, ఆ సంఘాలపై, నాయకులపై అవినీతి, అక్రమార్జన లాంటి తీవ్ర ఆరోపణలు చేయడంవల్ల మొత్తంగా పీడిత కులాల ప్రజల ఉద్యమాలపై సమాజంలో చులకనభావం, వ్యతిరేకత ఏర్పడుతుంది. ఎలాగూ మన సమాజంలో దళితులు, బి.సి.లంటే చిన్నచూపు ఉన్నది. ఆ చిన్నచూపు మరింత వ్యవస్థీకృతం కావడానికి ఆంధ్రజ్యోతి కథనం ఉపయోగపడుతుంది. కుల సంఘాలు, నాయకులు కొన్ని సమూహాలకు ప్రతినిధులైనపుడు, వారిపై చేసే అనిర్దిష్ట ఆరోపణలు, సాధారణీకరించిన వాఖ్యలవల్ల మొత్తంగా ఆ సమూహాలను 'అవినీతిపరులుగా', 'దగాకోరులుగా' చూసే ధోరణి బలపడుతుంది. అలాగే ఉద్యమ సంస్థల్లో స్వచ్ఛతను, ఉద్యమ నాయకుల్లో నీతి, నిజాయితీలను కోరుతూ రాసే కథనాలు కొందరు దళిత, బి.సి. నాయకుల్ని 'అవినీతిపరులుగా', 'దగాకోరులు'గా చిత్రీకరించటం వల్ల మన వ్యవస్థలోని అవినీతి, అక్రమాలు వ్యక్తుల నైతిక సమస్యలుగా కనబడతాయి.

మన వ్యవస్థలో అవినీతి, అక్రమార్జన లాంటి రుగ్మతలకి కారణాలు మన రాజకీయ సంస్కృతిలోనే వెదకాలి. 'బాడుగ నేతలు' కథనంలోని విమర్శలు, ఆరోపణలన్నీ మన ప్రధాన రాజకీయ పార్టీలన్నిటికీ వర్తిస్తాయి. పాలకపార్టీతో ఒప్పందాలు, ఎన్నికల్లో పొత్తులు, డబ్బు, పదవుల పంపిణీ లాంటివన్నీ మన సమాజంలో వ్యవస్థీకరింపబడి ఉన్నాయి. మన దళిత, బి.సి. సంఘాల నేతలు ఈ వ్యవస్థీకృత, నేరమయ, అవినీతి చట్రంలోనే తమ వ్యూహాలు, తమ ఉద్యమాలు నడుపుతున్నారు. వర్గీకరణ కోసమో, ప్రత్యేక రాష్ట్రం కోసమో రాజకీయ పార్టీలతో, ముఖ్యంగా పాలకపార్టీలతో బేరసారాలు ఈ వ్యూహంలో భాగమని ఆయా సంస్థలు అంటున్నాయి. మన వ్యవస్థలోని అవినీతి, అక్రమాలు మన ఉద్యమ సంస్థలనే కాదు, మీడియా రంగాన్ని, విద్యా, వైద్య రంగాల్ని, కళారంగాన్ని, మొత్తం సమాజాన్ని పట్టి పీడిస్తున్నాయి.

ఈ అవినీతి, అక్రమాల్ని రాజకీయ సమస్యగా, వ్యవస్థీకృతమైన జాడ్యంగా చూడకపోతే, వీటికి వ్యతిరేకంగా పోరాడలేం. అలాగే – ఆంధ్రజ్యోతి యాజమాన్యం అట్టడుగు వర్గాల నుండి కొత్తగా రాజకీయ రంగంలోకి వచ్చిన శక్తులు రాజకీయాల్లో కొత్త విలువలు, కొత్త సంస్కారం తెస్తాయని ఆశించడం కూడా ఆ సంస్థలపై లేనిపోని భ్రమలు పెంచు కోవడమే తప్ప, వాస్తవిక అంచనా కాదు. కుల సంఘాలు ఈ వ్యవస్థలో తమ హక్కుల కోసం, రాయితీల కోసం, సమానత్వం కోసం, ఉదారవాద ప్రజాస్వామ్య చట్రంలోనే పోరాడుతున్నాయి. ఎన్నికగల రాజకీయాల చట్రంలో భాగంగానే అవి పనిచేస్తున్నాయి. ఈ వాస్తవాన్ని మనం గుర్తించాలి. వాటి పరిమితుల్ని మనం ఈ దృష్టినుంచే అంచనా వేయాలి.

ఆంధ్రజ్యోతి యాజమాన్యం తమ కథనం విమర్శనాత్మకమైనదని అన్నారు. 'తాము ఫలానా వర్గాలకు చెందినవారం కాబట్టి తమ మీద విమర్శలే ఉండకూడదని శాసించే అధికారం ఎవరికీ లేదు' అంటూ ఆంధ్రజ్యోతి ఎం.ఆర్.పి.ఎస్. వారు తాము దళిత కులాలకు చెందిన వారు కాబట్టి, తాము విమర్శలకి అతీతం అంటున్నారని వక్రభాష్యం చెపుతున్నారు. ఆంధ్రజ్యోతి కథనం 'విమర్శ' అని చెప్పడం వాస్తవం కాదు. 'బాడుగ నేతలు' కథనంగా దళిత, బి.సి. సంఘాల నేతలపై వారు అధికార కాంగ్రెస్ పార్టీని సమర్థిస్తున్నారనే అక్కసుతో రాసినది. దళిత, బి.సి. నేతల్ని కించపరచటానికి, వారిని ప్రజల్లో తిరగకుండా అవమానించటానికి, వారి సాధికారతను దెబ్బ తీయటానికి ఉద్దేశించిన కథనమిది.

ఎన్నికల సందర్భంలో కుల సంఘాల ప్రభావాన్ని తగ్గించటానికి చేసిన దాడి ఇది. సరిగ్గా ఈ సందర్భంలోనే ఆంధ్రజ్యోతి యజమాని తెలుగుదేశం అనుకూల రాజకీయాలు గుర్తుకొస్తాయి. లేదా, కాంగ్రెస్ పార్టీతో ఆయనకున్న వైరుధ్యాలు గుర్తుకొస్తాయి. ఆంధ్రజ్యోతి గతంలో దళితవాదాన్ని ప్రోత్సహించిన చరిత్ర, దళిత ఉద్యమాలకు గొంతు నిచ్చిన చరిత్ర బడుగువర్గాలు గుర్తుంచుకోవాల్సిన, గౌరవించాల్సిన చరిత్ర. ఈ గత చరిత్రను చూసి, ప్రస్తుత యాజమాన్యం రాసే రాతల ప్రభావాన్ని, స్వభావాన్ని దళిత, బి.సి. వర్గాలకు మేలు చేసే రాతలుగా అంగీకరించలేం. (ఎం.ఆర్.పి.ఎస్. చరిత్రలో ఎపుడూ పత్రికాఫీసుపై దాడి చేయనంత మాత్రాన, ప్రస్తుతం వారు చేసిన దాడిని సమర్థించలేం) దళిత, బి.సి. సంఘాలు, నేతలు అడుగుతున్నది తాము ఫలానా వర్గానికి చెందినవారం కాబట్టి తాము విమర్శలకు అతీతమని కాదు. మమ్మల్ని ఫలానా వర్గానికి చెందిన వారం కాబట్టే సులభంగా ఆంధ్రజ్యోతి లాంటి పత్రికలు తోచినట్లు రాస్తున్నాయి అంటున్నారు. ఆంధ్రజ్యోతి రాసిన కథనం ఒక వార్తా విశ్లేషణ కాదు. ఒక పరిశోధనాత్మక వ్యాసం కాదు. కేవలం ఎన్నికల ప్రయోజనాల దృష్టితో కొన్ని రాజకీయ పక్షాల కొమ్ముకాస్తూ రాసిందేకానీ 'వంచనకు గురవుతున్న వర్గాలపై ఎంతో ఆర్తితో రాసిన కథనం' ఎంత మాత్రం కాదు.

సమాజంలో చాలా ముఖ్యమైన ఉద్యమరంగం, పత్రికారంగాల మధ్య వచ్చిన ఘర్షణను కేవలం ఎం.ఆర్.పి.ఎస్. – ఆంధ్రజ్యోతిల మధ్య సమస్యగా వారు చూడడం, అలాగే ఇతరులు చూడడం వల్ల ఉద్యమాలు, పత్రికల సంబంధాలపై జరగాల్సినంత చర్చ జరగలేదు. పత్రికా స్వేచ్ఛకు ఉద్యమ సంస్థల భౌతికదాడులు ఎంత ప్రమాదకరమో ఉద్యమసంస్థలు ఆత్మపరిశీలన చేసుకోవాలి. అలాగే పత్రికల యాజమాన్యాలు పత్రికా స్వేచ్ఛను ఎంత నిష్పాక్షికంగా, బాధ్యతగా, ప్రజాస్వామికంగా ఉపయోగిస్తున్నారో పరిశీలించడం, విమర్శించడం అవసరం. కులసంఘాలకు రాజకీయలున్నట్లే, పత్రికలకూ రాజకీయాలు న్నాయని గుర్తించడం అవసరం. మన రాష్ట్రంలో కుల సంఘాల్లాగే, కొన్ని పత్రికలు, ఛానళ్లు కొన్ని రాజకీయ పార్టీలకు బాకాలుగా ఉన్నాయి. ఈ వాస్తవం ప్రజలందరికీ తెలిసిందే. పాలకపార్టీల రాజకీయాల నుంచి మన ఉద్యమ సంస్థల్ని, పత్రికల్ని కాపాడుకున్నపుడే పత్రికా స్వేచ్ఛను కాపాడుకోగలం. కేవలం పత్రికా స్వేచ్ఛకు ఎం.ఆర్.పి.ఎస్. దాడి మాత్రమే ప్రమాదమని అనుకోవడం ఇటు పత్రికలకు అటు ఉద్యమ సంస్థలకి మంచిదికాదు. ◆

*పత్రికా స్వేచ్ఛ అంటే మీడియా సంస్థల, యాజమాన్యాల స్వేచ్ఛ కాదనీ, మొదట అది అణగారిన ప్రజల భావ ప్రకటనా స్వేచ్ఛ మాత్రమేననీ అంటున్నారు* **కృపాకర్ మాదిగ**

# మీడియా వ్యవస్థకు కొన్ని ప్రశ్నలు

మీడియా ఒక వ్యవస్థ. దిన, వార, పక్ష, మాస... పత్రికలూ, రేడియో, టి.వి. ఛానళ్లూ మీడియాలో భాగం. మీడియా ఒక పరిశ్రమ. వార్తలనూ, ఊహలనూ ఉత్పత్తి చేస్తుంది. మీడియాకి ఆర్థిక స్వభావం ఉంది. అది పెట్టుబడి స్వభావం ఉంది. మీడియాకి ప్రయోజనం ఉంది. అది లాభాపేక్ష కలిగిన వ్యాపారం. మీడియాకి కులం ఉంది. అది అగ్రకులం. మీడియాకి జెండర్ ఉంది. అది మగది. మీడియాకి ప్రాంత స్వభావం ఉంది. అది కోస్తా లేక అభివృద్ధి చెందిన ప్రాంతం. మీడియాకి మతం ఉంది. అది హిందూ మతం. ముఖ్యమైన కొన్ని దినపత్రికల యాజమాన్యాలు పరోక్షంగానో, ప్రత్యక్షంగానో కమ్మ, రెడ్డి, బ్రాహ్మణ ఆధిపత్య రాజకీయాలను అనుసరించడం లేదా బలపరచడం చేస్తున్నాయి. మీడియాకి సామాజిక బాధ్యత ఉండటం గొప్ప సంగతి కాదు. అది ఒక అవసరం. విధిగా ఉండాల్సిన బాధ్యత. చిన్న పత్రికలు, చిన్న ఛానెళ్ల గురించి ఇక్కడ రాయబోవడం లేదు. వందలకొద్దీ సిబ్బందిని నియమించుకున్న మీడియా సంస్థల (పత్రికలు, ఛానెళ్లు) గురించే ఇక్కడ ప్రస్తావన.

మీడియా శ్రమశక్తిలో మాదిగలు, దళితులు, ఆదివాసులు, బి.సి.లు మైనారిటీలు భాగస్తులా? కారా? రాష్ట్రంలో, దేశంలో మా(యీ) వర్గాల ప్రజలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలను మీడియా ఎందుకు ప్రతిబింబించలేకపోతోంది? దేశం, రాష్ట్రం ఎదుర్కొంటున్న వివిధ ముఖ్యమైన సమస్యలపై మా సామాజిక వర్గాల రచయితలు మీడియా ముఖంగా తమ అభిప్రాయాలు వ్యక్తం చేసే హక్కు, అవకాశాలు కలిగి ఉన్నారా? ఉదాహరణకు ఎంతోమంది మాదిగ ఉద్యమ కార్యకర్తలు, మేధావులు రాసిన వార్తలు, వ్యాసాల ప్రచురణ కోసం సాధారణ విలేకరుల దగ్గర నుండి ఆయా సంపాదక వర్గాల్లోని సీనియర్ల వరకు అర్థింపులు, బతిమిలాటలు చేసుకున్న సందర్భాలు కోకొల్లలు. ఈ వ్యాస రచయిత కూడా ఇలాంటి ఇబ్బందులెదుర్కొన్నాడు. ఉద్యమ నాయకుల దుస్థితే ఇలా ఉంటే, ఇక సామాన్య కార్యకర్తలు, చిన్న నాయకులు, కొత్త రచయితలు, కవుల విషయంలో పరిస్థితి ఇంకెంత దిగజారి ఉంటుందో ఎవరైనా ఇట్టే ఊహించుకోగలరు. పత్రికా స్వేచ్ఛ అంటే, మీడియా సంస్థల, యాజమాన్యాల స్వేచ్ఛ కాదు. మొదట అది అణగారిన ప్రజల భావ ప్రకటనా స్వేచ్ఛ మాత్రమే.

దేశంలో, రాష్ట్రంలో మా వర్గాల ప్రజలు 85 శాతం ఉన్నారు. రాష్ట్రంలో పది శాతం జనాభాగా మాదిగ కులస్తులున్నారు. కాగా, అగ్రకులాల జనాభా అంతా కలిసి 15 శాతానికి మించిలేదు. ఈ 15 శాతం అగ్రకులాల వారే మీడియా సంస్థల యజమానులుగా, మీడియా విధాననిర్ణేతలుగా, అగ్రవర్ణాల ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ప్రయోజనాల పరిరక్షకులుగా ఉండటం సరైందేనా? ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ సామాజిక వర్గాలకు చెంది ఉండి, 85 శాతం జనాభా శక్తి కలిగిన మాకు, ప్రతి వార్తా పత్రిక, ప్రతి టి.వి. ఛానెల్‌ల 85 శాతం స్థల, కాలాలను మా సమస్యల కోసం, మా ప్రయోజనాల కోసం వెచ్చించాలి. కాని, ఏ వార్తా పత్రిక, ఏ రేడియో, టి.వి. ఛానెల్ మాకు 85 శాతం స్థల, కాలాలను కేటాయించకపోవడం బాధ్యతారాహిత్యం కాదా? ఇది మీడియా వివక్ష కాదా? దండోరా ఉద్యమం గురించి, దళితుల నిధులు దారి మళ్లింపు గురించి, హాస్టళ్లలో బడుగు బాలల కష్టాల గురించి, వాకపల్లి సంఘటన గురించి, ఒ.బి.సి. రిజర్వేషన్ల గురించి రాస్తున్నాం, చెబుతున్నాం, చూపిస్తున్నాం కదా అని మీడియా యాజమాన్యాలు అనవచ్చు. నిజమే కావచ్చు. కాని, మాకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన సంఘటనలపై వార్తల్లో, కథనాలో వస్తే సరిపోవు. దారిద్ర్యం, నిరక్షరాస్యత, అంటరానితనం, దోపిడీ, అవకాశాల చట్రం నుండి పక్కకి తోసివేయబడటం అంతా మాదిగలు, దళితులు, బి.సి.లు, ఆదివాసులు, మైనారిటీలవైన మాపైనే కొనసాగుతోంది. అసలు సింహభాగం, ఆ మాటకొస్తే మొత్తం ప్రజలం మేమే గనుక, మేమెదుర్కొంటున్న సమస్యల కంటే, ముఖ్యమైన సమస్యలు దేశానికి లేవు. గనుక వార్తా పత్రికలు, రేడియో, టి.వి. ఛానెళ్లు వాటి మొత్తం స్థల, కాలాలను మా ప్రయోజనాల కోసమే కేటాయించాల్సి ఉంటుంది. ఇలా జరగటం లేదు. అడపాదడపా, వార్తలు కథనాలు కాదు, మేం కోరేది. మీడియా నేడు కొద్దిపాటి చోటునీ, కాలాన్నైనా మాకు కల్పిస్తున్నదంటే, అదీ కొన్ని దశాబ్దాలుగా మనుషులుగా గుర్తింపు, గౌరవం, హక్కులకోసం, సరైన ప్రాతినిధ్యం కోసం మా సామాజిక వర్గాలు సాగిస్తున్న నిరంతర పోరాటాలు, ఉద్యమాల ద్వారానే సాధ్యమయింది తప్ప, వేరే కాదు. ఇప్పుడు మీడియాలో మాకు లభిస్తున్న యీ కొద్దిపాటి స్థల, కాలాలు ఒక్కోసారి యాజమాన్యాల ప్రయోజనాల కోసం, ఒక్కోసారి మీడియా సంస్థల సిబ్బందిలో ఉండే మా సానుభూతిపరులవల్లా, చాలా సందర్భాల్లో మా ప్రజలు హక్కుగా సాధించుకోవడం వల్లా వచ్చినవే. కాని, మీడియా మాకిప్పుడిస్తున్న కొద్దిపాటి స్థల, కాలాలు సరిపోవు. మీడియా మొత్తం స్థల, కాలాలను

మా సామాజిక వర్గాల ప్రయోజనాల కోసం వెచ్చించాలని డిమాండ్ చేస్తున్నాం. జనాభాలో 85 శాతం ఉన్న మాకు మీడియాలో 85 శాతం స్థల, కాలాలను ఎందుకు కేటాయించలేకపోతున్నారో మీడియా సంస్థల యాజమాన్యాలు మాకు సమాధానాలు చెప్పాలి. మీడియా మాకు తగినంత స్థల, కాలాలను కేటాయించకపోవడం మమ్మల్ని మార్జినలైజ్ చేయ్యడంగా ఎందుకు భావించకూడదని ప్రశ్నిస్తున్నాం. 85 శాతం స్థల, కాలాలను కేటాయించలేమని మీడియా సంస్థలు అంటాయా? అలాగైతే, సామాజిక బాధ్యత వంటి ఆదర్శాలు వల్లించడం మానివేసి మీడియా సంస్థలు వారి వార్తా ప్రకటనల వ్యాపారాలు చక్కపెట్టుకుంటే సరిపోతుంది. ఇది మంచిదంటారా?

ప్రింట్ మీడియా స్థలాన్ని కొలతల ప్రకారం అమ్ముకుంటుంది. లేదా 'బాడుగ'కిస్తుంది. అదే ఎలక్ట్రానిక్ మీడియా అయితే సెకెండ్లు, నిమిషాలు, గంటల ప్రకారం కాలాన్ని అమ్ముకుంటుంది. లేదా 'బాడుగ'కిస్తుంది. మీడియా కార్యాలయాల్లోని విస్తరణ, వ్యాపార ప్రకటనల విభాగాలు చేసే పనులు ఇందుకు సంబంధించినవేనని పరిశీలిస్తే అర్థమవుతుంది. దినపత్రికల విషయానికొద్దాం. సాధారణంగా మొదటి ఒకటీ, రెండు పెజీలను అగ్రకుల రాజకీయ ప్రతినిధులకు కేటాయిస్తున్నాయి. అలాగే రెండు పేజీలు వ్యాపారానికి, రెండు పేజీలు సినిమా పరిశ్రమకి, రెండు పేజీలు క్రీడారంగానికి, కొంత భాగం ఆధ్యాత్మిక అంశాలకి, మరికొంత భాగం వ్యాపార ప్రకటనలకి, ఇంకొంత భాగం క్రైం వార్తలకి కేటాయించడం మనం చూస్తున్నాం. టి.వి., రేడియో ఛానెళ్ల పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు. తెల్లారి నిద్రలేచింది మొదలు మాదిగలు, దళితులు, ఆదివాసులు, బి.సి.లు, మైనారిటీలు ఇవన్నీ ఎందుకు చదవాలి? ఎందుకు చూడాలి? మాకు సంబంధం లేని వార్తాంశాలను మాపై రుద్దడం అన్యాయం కాదా? మా అణగారిన కులాలు, జాతులు, తెగల పట్ల మీడియాకి తగినంత శ్రద్ధ, సౌహార్ద్రత, మద్దతు, బాధ్యత లేదనడానికి ఇంతకంటే ఇంకేన్ని రుజువులు కావాలి?

ముస్లింల సమస్యలపై ముస్లిం జర్నలిస్టులు రాయడాన్ని మహిళల సమస్యలపై మహిళా జర్నలిస్టులు రాయడాన్ని, బి.సి.ల సమస్యలపై బి.సి. జర్నలిస్టులు రాయడాన్ని, మీడియా సంస్థలు కొద్దిమేరకు అనుమతిస్తున్నాయి. తగినంతగా కాదు. కాని, మాదిగలు, దళితులు, ఆదివాసుల సమస్యలపై మా జర్నలిస్టులను, రచయితలను, రాయడాన్ని అనుమతించే, ప్రోత్సహించే సౌహార్ద్రతా కార్యాచరణ మీడియా సంస్థలకు లేకపోవడం ఆశ్చర్యకరం, బాధాకరం. ఇది నిజం కాదా? అణగారిన వర్గాలకు ప్రాతినిధ్యం, ప్రోత్సాహం లేకుండా మీడియా సంస్థల్లో ప్రజాస్వామ్యం ఉంటుందా?

మీడియా కార్యాలయాల్లో మాదిగల, దళితుల, ఆదివాసుల, బి.సి.ల, మైనారిటీల ప్రాతినిధ్యం పరిస్థితులు ఎలా ఉన్నాయి? ఎడిటర్లు, న్యూస్ రీడర్లు, యాంకర్లు, జర్నలిస్టులు, జాకీలు, కంప్యూటర్ ఆపరేటర్లు మొదలగు ఉద్యోగుల్లో మాదిగలు ఎంతమంది ఉన్నారు? మాదిగేతర దళితులు, ఆదివాసులు, బి.సి.లు, మైనారిటీ, సామాజికవర్గాలకు చెందినవారు ఎంతమంది ఉన్నారు? అసలు ఉన్నారా? మహా అయితే, మీడియా సంస్థల క్యాంటీన్లలో పనివారిగా, ఊడ్చేవారిగా, టాయిలెట్లు శుభ్రం చేసేవారిగా, ప్యాకింగ్, ప్రింటింగ్, ట్రాన్స్‌పోర్ట్, కాపలా విభాగాల్లోనూ, సరుకు ఎత్తుడు, దింపుడు దగ్గర మావాళ్లు కొద్ది మంది ఉన్నారేమో? ఉంటే ఉండవచ్చు? కాని, మీడియా సంస్థల యజమానులు, సంపాదకవర్గాలు తీసుకునే కీలక విధాన నిర్ణయాల్లో మాదిగలకు, దళితులకు, ఆదివాసులకు భాగస్వామ్యం శూన్యమనే చెప్పవచ్చు. కాదంటారా? మీడియా సంస్థల్లో సాంఘిక ప్రాతినిధ్యం, వైవిధ్యం, భిన్నత్వం పెద్ద స్థాయిలో కొరవడింది. నిర్లక్ష్యం చేయబడింది. మీడియా సంస్థల్లో కులాల, జాతుల ప్రాతినిధ్యం అసమానతలతో నిండి ఉంది. మీడియా సంస్థల్లోనూ, వాటి ఉత్పత్తులలోనూ తగినంత స్థల, కాలాలు కేటాయించని, ప్రాతినిధ్యం కల్పించని మీడియా వ్యాపారులను మాదిగలు, మాదిగేతర దళితులు, ఆదివాసులు ఎందుకు నెత్తిన మొయ్యాలి? ఎందుకు గౌరవించాలి? మీడియా సంస్థల యాజమాన్యాలు, సంపాదకవర్గాలు ఈ అపసవ్య పరిస్థితులను చక్కదిద్ది, మీడియా సంస్థల్లో ప్రజాస్వామిక విలువల పునరుద్ధరణకు కార్యాచరణ ప్రణాళికలేమైనా సమీప భవిష్యత్తులో అమలు చేస్తారని మేం ఆశించవచ్చునా? మీడియా రంగానికి రిజర్వేషన్లను వర్తింపచేయాలి. లేకుంటే అక్షరాలను అగ్రకుల పాశవికతకి సాధనాలుగా వాడుకునే ప్రమాదం పెరిగింది. అణగారిన కులాల, జాతులచరిత్రలపై అబద్ధాల మసకలుకమ్మే ప్రమాదం పెరిగింది.

రాష్ట్రంలో ముగ్గురు పత్రికా యజమానులు పార్లమెంట్ సభ్యులు కావడం వెనుక, మీడియా రంగ ప్రముఖుడొకరు ఎం.ఎల్.సి. కావడం వెనుక, పాత్రికేయ ప్రముఖులు ఒకరు అధికార భాషా సంఘం అధ్యక్షుడు కావడం వెనుక, మరొకరు ప్రెస్ అకాడెమీ ఛైర్మన్ కావడం వెనుక కేవలం అనుభవం, ప్రతిభేనా? కులం లేదా? ఉంది. అనుభవం, ప్రతిభలేదని ఎవరైనా వాదిస్తే, ఆ వాదంలోనూ కులం ఉందని మేం అంటాం. పదవులు పొందిన మీడియా రంగ ప్రముఖుల్లో ఏ ఒక్కరైనా మాదిగ, దళిత, ఆదివాసీ సామాజిక వర్గాలువారు లేకపోవడానికి అన్ని రంగాలనూ శాసిస్తున్న అగ్రకుల వ్యవస్థే కారణం కాదా? రాష్ట్ర స్థాయిలో ఉన్న వివిధ జర్నలిస్టు సంఘాల్లో అధ్యక్షులు, రాష్ట్ర ప్రధాన కార్యదర్శులు ఏయే కులాలకి చెందినవారున్నారో బయట పెట్టగలిగితే, పత్రికా రంగంలో కుల వివక్ష ఎంత లోతుగా వెళ్లూనుకొని ఉందో అందరికీ తెలుస్తుంది. సీనియర్ పాత్రికేయులారా? ఇద్దరో ముగ్గురో మాల జర్నలిస్టులను మినహాయిస్తే, మీ సుదీర్ఘ వృత్తి జీవితంలో ఒక మాదిగ జర్నలిస్టుతో, ఒక ఆదివాసీ జర్నలిస్టుతో, ఒక దళిత జర్నలిస్టుతో కలిసి పని చేసిన సౌహార్ద్ర సందర్భాలున్నాయేమో దయచేసి ఒక్కసారి గుర్తు చేసుకోగలరా? వీరిని మీరు మిస్ కాలేదా? ఇప్పటి వరకూ ఎంతమంది మాదిగలను, ఆదివాసులను, దళితులను పాత్రికేయ వృత్తిలోకి ప్రోత్సహించారో మీడియా సంస్థల యాజమాన్యాలు ప్రకటించగలవా?

మీడియా సంస్థల యాజమాన్యాలు వేరు. మీడియా సిబ్బంది వేరు. మీడియా సంస్థలు, యాజమాన్యాల ప్రయోజనాలకు పాపులారిటి, ఆర్థిక, రాజకీయ, అగ్రకుల లాభాపేక్ష కోణాలు ఉండటం నిజం కాదా? మీడియా సంస్థల యాజమాన్యాలకు ఉండే ప్రజావ్యతిరేక ప్రయోజనాలకు పాత్రికేయులు, మీడియా ఉద్యోగులు అండగా నిలవకూడదని మా అభ్యర్థన. అణగారిన సామాజిక వర్గాల ప్రయోజనాలకు, మీడియా సంస్థల యాజమాన్యాలకు వివాదాలు ఏర్పడ్డ సందర్భాల్లో పాత్రికేయులు, వారి సంఘాలు అణగారిన సామాజిక వర్గాల ప్రయోజనాల వైపు అండగా

# భార్గవీరావు



బహుభాషా కోవిదురాలు, రచయిత్రి భార్గవీరావు (64) మే 23న చనిపోయారు. ఆమె గత కొంతకాలంగా గుండె సంబంధ వ్యాధులతో హైదరాబాద్‌లో చికిత్స పొందుతూ ఉన్నారు. 1944 ఏప్రిల్ 14న కర్ణాటకలోని బళ్లారిలో జన్మించారు. పుట్టింది కర్ణాటకలో మాతృభాష కన్నడం. ఉన్నత చదువులు చదివింది, పాఠాలు బోధించింది ఆంగ్ల సాహిత్యంలో. అయితే తెలుగు భాషపై అభిరుచి పెంచుకుని, తెలుగు మాతృభాషగా కలవారిని సైతం ఆశ్చర్య పరిచేలా అనేక ప్రక్రియల్లో ఆమె రచనలు చేశారు. నిజాం కాలేజీలో ఆంగ్ల శాఖ అధిపతిగా పదవీ విరమణ చేశారు. 90 దశకంలో పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయంలో తులనాత్మక అధ్యయనం కేంద్రంలో అసోసియేట్ ప్రొఫెసర్‌గా విధులు నిర్వర్తించారు. 'గుండెలో తడి', 'చుక్క నవ్వింది', 'కలగంటి', 'నాపేర' వంటి కథా సంకలనాలు, 'ఆల్బం', 'నీడల గోడలు' వంటి కవితా సంపుటాలు, 'వెన్నెల కళ్లు', 'తూర్పుగాలి' వంటి నవలలు వెలువరించారు. ఆమె పలు గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. తెలుగు దళిత వాదం ఇంకా బలంగా వేళ్లూనుకోకముందే ఆమె 'ఇంకానా! ఇకపై సాగదు' పేరుతో ప్రసిద్ధ దళిత కథలను సంకలనంగా వెలువరించారు. స్త్రీవాద సాహిత్యానికి కొత్త చేర్పుగా 'నూరేళ్లపంట' (రచయిత్రుల వంద కథలు), 'ముద్ర' (స్త్రీల కవిత్వం) కవితా సంకలనాలు వెలువరించారు. ఇంకా ఇంగ్లిష్‌లో పలు రచనలు చేశారు. రచయిత్రిగా, సంపాదకురాలిగా ఎంత కృషి చేశారో అనువాద రంగంలో దానికి రెట్టింపు కృషి చేశారు. ప్రముఖ నటుడు, రచయిత గిరీష్ కర్నాడ్ రాసిన 'యయాతి', 'హయవదన', 'నాగమండలం', 'తలదండ', 'తుగలక్' తదితర నాటకాలను ఆమె తెలుగులోకి అనువదించారు. తలదండ అనువాదానికి గానూ 1995లో కేంద్ర సాహితీ పురస్కారాన్ని అందుకున్నారు. తెలుగు నుంచి పలు రచనలను ఇంగ్లిష్‌లోకి కూడా అనువదించారు.



నిలబడాలని కోరుతున్నాం. గతంలో ఒక మీడియా సంస్థలో పాత్రికేయులు యూనియన్ పెట్టాలని ప్రయత్నించినపుడు ఆ మీడియా సంస్థ పాత్రికేయుల్ని ఎన్ని కష్ట నష్టాలకు గురిచేసిందో సీనియర్ పాత్రికేయులందరికీ తెలిసిందే. అలాగే, ప్రస్తుతం ఆంధ్రజ్యోతి దినపత్రిక – ఎం.ఆర్.పి.ఎస్., బి.సి. నాయకుల మధ్య జరుగుతున్న వివాదంలో క్రియ మీద చర్చ జరగకుండా ప్రతిక్రియ మీద చర్చ జరపడం మీడియా యాజమాన్యం కుట్ర. కారణం మీద కాకుండా కార్యం మీద చర్చ జరపడం మోసం కాదా?

కుల, హిందూ మీడియా యాజమాన్యాలు మీడియా కార్యాలయాలను గర్భగుడులుగా మార్చే ప్రయత్నం చేస్తున్నారు. అక్షరాలను మాదిగలకు, అణగారిన కులాలకు వ్యతిరేకంగా ప్రతిష్ఠిస్తున్నారు. ఎక్కుపెడుతున్నారు. ఫ్లేవర్‌గా, ఫేవర్‌గా అక్షరాలను వాడుతున్నారు. నిచ్చెనమెట్లు, జారుడు మెట్లు, లిఫ్టులుగా అక్షరాలను ఉపయోగిస్తున్నారు. తమ ప్రయోజనాలకు మంత్రదండంగా, తమ లాభాలగాట్లో చమురు విత్తులుగా అక్షరాలను ఉపయోగిస్తున్నారు. అక్షరం తల్లికాదు. దేవత అంతకన్నా కాదు. అక్షరాలు కుల హిందువుల రాజకీయ ప్రయోజనాలకు అభిప్రాయాలు వండే దినుసులుగా వాడుతున్నారు. పూర్వం కుల వ్యవస్థ అక్షరాలను మాదిగలకు నిషేధించిన మాదిరిగానే, మనువు వారసులైన నేటి మీడియా సంస్థల యాజమాన్యాలు నేడు 'మీడియా గుళ్ల'ల్లోకి మాదిగలను, ఆదివాసులను రానీయకుండా, వార్తా, ప్రసార, ప్రచార గుత్తాధికారాన్ని చెలాయిస్తున్నారు. పూజారి వ్యవస్థలో దళితులు ప్రవేశించడానికి చట్టాలు అనుమతిస్తున్నాయి. కాని మీడియా వ్యవస్థలోకి దళితుల ప్రవేశాలను మీడియా యాజమాన్యాలు ఇప్పటికీ అనుమతించక పోవడం దారుణం. అప్రజాస్వామికం. మాదిగలపై, దళితులపై, ఆదివాసులపై, బి.సి., మైనారిటీలపై మీడియాలో జరుగుతున్న కుల వివక్ష ఇప్పుడు చర్చకు రావాలి. హిందూ అగ్రకుల, ఆంధ్ర, మగ, వ్యాపారుల, పెట్టుబడిదారుల ప్రయోజనాలు కాపాడడమే లక్ష్యంగా మీడియా విధానాలు ఉండడం పై ఇప్పుడు అన్ని చోట్ల విస్తృతంగా చర్చ జరగాలి. మా సామాజిక వర్గాల వార్తలపై కత్తిరింపులు, దేబిరింపులు, అదృశ్యాలు, నిషేధాలు, అవాచ్యాలు, వక్రీకరణలు, చిన్నవిగా చూపెట్టే ప్రయత్నాలు, నామమాత్రపు వ్యక్తీకరణలు – ఇవన్నీ, వ్యవస్థీకృతంగా మీడియా రంగం మాపై జరుపుతున్న అత్యాచారాలే. వివక్షలే. మీడియా యాజమాన్యాలు కర్తలు, క్రియలై మమ్మల్ని మావారిని కర్మల స్థానంలోకి నెట్టడం అన్యాయం కాదా?

అందుకే ఇప్పుడు మీడియాలో మాదిగీకరణ జరగాలి. మాదిగీకరణ అంటే నలిగిపోయిన మానవీకరణేనని గుర్తించాలి. అగ్రకుల మీడియా కార్యాలయాల్లో కుర్చీల దగ్గర నిలబడి వార్తలు, వ్యాసాలు, కథనాల ప్రచురణ కోసం సరైన స్థల, కాలాలు కేటాయించమని అడుక్కునే దుస్థితి మాకు తొలగిపోవాలి. మాదిగలు తమ గొంతుకలను, డప్పులను, ప్రచార, ప్రసార సాధనాలుగా మార్చి చరిత్ర నిండా సమాజానికి సేవలందించారు. అలాంటి మాదిగలకు ఆధునిక మీడియా అందుబాటులోకి రాకపోవడం ఒక విషాదం. ఆధునిక మీడియాకి మాదిగలు యజమానులు కాలేకపోవడం అంతకన్నా పెను విషాదం. మా సమాజాలను మేం ప్రతిబింబించుకోవడానికి మాకు మాదిగ మీడియా కావాలి. దళిత మీడియా కావాలి. బి.సి. మీడియా కావాలి. మైనారిటీ మీడియా కావాలి. పెట్టుబడికీ, కట్టుకతకీ మధ్య నలిగిపోకుండా ఎదగడం ఇప్పటి మా అవసరం. చరిత్రను తాటాకులపై బొమ్మలుగా మలిచి చూపిన డక్కలోళ్లకి, నరాలను తీగెలుగా జమిడికపై మీటి చరిత్రను పాడిన బైండ్లోళ్లకి, డప్పుతో సమాజాన్ని మేల్కొలిపి, చెప్పుతో చరిత్రను ముందు నడిపించిన మాదిగలకు ఆధునిక మీడియాలో స్థల, కాలాలు కావాలి. యాజమాన్య హక్కులు కావాలి. మీడియా రంగ విధానాలకు మాదిగలు, అణగారిన కులాలు, జాతులు దిశానిర్దేశం చేసే రోజు త్వరలోనే రావాలి. ఇందుకు అవకాశాలు కావాలి. అందుకోసం పోరాడుతాం.



*ఆంగ్ల మాధ్యమం ప్రతిపాదనల వెనుక డ్రాపౌట్స్‌ను పెంచడం, పాఠశాలలు ఎత్తివేయడం, ఉన్నత పాఠశాలల సంఖ్యను కుదించడం, టీచర్ పోస్టులను రద్దుచేయడం వంటి దుర్మార్గ విధానాలున్నాయని అంటున్నారు* **కె. ప్రభాకర్**

# జి.ఒ. 76 తో విద్యారంగానికి ఉరి

మహాత్మాగాంధీని తమ ఆదర్శంగా ప్రకటించుకున్న ప్రభుత్వం ఆయన ఆదర్శాలకు భిన్నంగా ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశపెట్టడం ఇవ్వాల్టి విషాదం. ఆంగ్ల మాధ్యమం ద్వారా విద్యార్థులు మానసికంగా ఎంతటి క్షోభను అనుభవిస్తున్నారో రామంతపూర్ పబ్లిక్ స్కూల్ విద్యార్థి రాసిన కవిత వ్యక్తం చేస్తుంది. రాష్ట్ర ప్రభుత్వం 'సక్సెస్' పథకం పేరిట ఆరువేలకు పైగా ప్రభుత్వ పాఠశాలల్లో ఆరవ తరగతి నుండి ఆంగ్లమాధ్యమంలో సి.బి.ఎస్.ఇ. సిలబస్‌ను ప్రవేశపెడుతూ జి.ఒ. 76ను విడుదల చేసింది. ఆ జి.ఒ. పట్ల వివిధ ఉపాధ్యాయ సంఘాలు, విద్యార్థి సంఘాలు టి.ఆర్.ఎస్. లాంటి రాజకీయ పక్షాలు వ్యతిరేకిస్తున్నా వెనుకకు తగ్గేది లేదని విద్యామంత్రి రాజనర్సింహ గారు ప్రకటించటంతో ఆందోళనను తీవ్రతరం చేయటానికి ఉపాధ్యాయ సంఘాల సంయుక్త మండలి (జాక్టో) నిర్ణయించింది. డి.టి.ఎఫ్. లాంటి సంస్థలు మాతృభాషలోనే బోధన సాగాలంటున్నవి. ప్రభుత్వం ఉపాధ్యాయ, విద్యార్థి, రాజకీయ పక్షాలు ఆంగ్ల మాధ్యమం కాని, సి.బి.ఎస్.ఇ. సిలబస్‌ను కాని సమర్థించటంలో వ్యతిరేకించటంలో వాస్తవాస్తవాలను పరిశీలించాల్సి ఉంది.

ప్రజలు, విద్యావేత్తలు ఇంగ్లిష్ మీడియం చదువుల వల్లనే ఉజ్వలమైన భవిష్యత్తు ఉంటుందని, పై చదువులకు తెలుగు మాధ్యమం ఆటంకంగా ఉంటుందని, ప్రజలంతా ఆంగ్లం పట్ల మోజు పెంచు కుంటున్నారని, ఇవ్వాల్టి ప్రపంచీకరణ సందర్భంలో గ్లోబల్ మెన్స్, ఐ.ఐ.టి.యన్స్‌గా మారటమే విద్య అన్న దశకు విద్యారంగం పోకడలు కొనసాగుతున్నవి.

1985-90ల వరకు మన రాష్ట్రంలో పి.జి. స్థాయి వరకు తెలుగు మీడియంలోనే బోధన, పరీక్షా విధానం కొనసాగాలని ఉద్యమించిన విద్యార్థి సంఘాలు, విద్యావేత్తలు, మేధావులు, ఉపాధ్యాయులు వ్యతిరేకిస్తున్న, అనుకూలిస్తున్న ఆయా సంఘాల నాయకుల పిల్లలను కూడా ఇవ్వాళ ఇంగ్లిష్ మీడియంలో చదివిస్తూ, పేద ప్రజలకు, గ్రామీణ ప్రాంత, దళిత బహుజన పిల్లలకు, తమలాంటి పిల్లల భవిష్యత్తును నిరాకరిస్తూ మాతృభాషలో బోధన కొనసాగించా లనటం అర్థరహితమని ఆయా సందర్భాలల్లో ప్రభుత్వం అనుకూలురతో దాడి చేయిస్తున్నది. ఆంగ్ల భాషను నేర్చుకోవటానికి అన్ని సబ్జెక్టులను ఆంగ్లంలో బోధించే అశాస్త్రీయ పద్ధతికి పాల్పడుతున్నది. ఆంగ్లాన్ని ఒక భాషగా సింగిల్ సబ్జెక్ట్‌గా బోధిస్తుంటేనే ఫలితాలు ఆశాజనకంగా లేవని, పదవతరగతిలో ఎక్కువమంది పిల్లలు 'ఆంగ్లం'లో వెనుకబడి పోవటం చూస్తున్నాం. ఆంగ్ల భాషా పరిజ్ఞానం కోసం అన్ని పాఠశాలల్లో అదనపు ఇంగ్లిష్ పోస్టుల ద్వారా భాషను నేర్పించవచ్చు. పాఠశాల విద్యానంతరం లాంగ్వేజ్ సెంటర్స్‌ను నెలకొల్పవచ్చు.

ఎవరు వ్యతిరేకించినా ఆగేది లేదని ఎంతమంది పిల్లలు వచ్చినా, తరగతి గదులు ఉన్నా, బోధనా సిబ్బంది లేకున్నా ఆంగ్లమాధ్యమాన్ని ప్రారంభించటానికి సన్నద్ధమైంది. తరగతి గదులు లేకుండా తాత్కాలికంగా తాటాకుల షెడ్డులు వేసైనా పుస్తకాలున్నా లేకున్నా, పిల్లలు చదవలేకున్నా, టీచర్లు బోధించలేమన్నా, పదమూడు రోజుల శిక్షణలో ఆంగ్లమాధ్యమాన్ని సి.బి.ఎస్.ఇ.తో ప్రారంభించటం వెనుక ప్రభుత్వానికి ఆంగ్ల మాధ్యమం పట్ల ఎందుకింత పట్టుదల కలిగి ఉన్నదో ఆలోచించవలసి ఉంది.

ఒకటవ తరగతి నుండి ఇంగ్లిష్ బోధనకు, ఆరవ తరగతి నుండి ఇంగ్లిష్ మాధ్యమాన్ని ప్రవేశపెట్టడం ద్వారా సాధించచూస్తున్న కొన్ని బహుళజాతి సంస్థలకు ఊడిగం చేసే కొలవుల కోసం, మధ్యతరగతి ఆపై ఉన్నత వర్గాలకు చెందిన కుటుంబాల పిల్లలు, తల్లిదండ్రులు కంటున్న 'డాలర్ డ్రీమ్స్'కు ఓ అనుకూలమైన వాదన ఇది. అట్లాంటి వర్గాల ప్రయోజనాలను నెరవేర్చడానికి ఇవ్వాళ పేద, దళిత, బహుజన ప్రజానీకపు పిల్లలను సంసిద్ధం చేయటానికి ఇంగ్లిష్‌పై ఇంత మోజు పెరిగిందనటానికి నిదర్శనం. మాతృభాషలో చదవటం వలన పై తరగతుల్లో విస్తృతమైన విజ్ఞానం ఇంగ్లిష్‌లో ఉండటం వలన ఆటంకంగా మారిందన్న సాకుతో, ఇవ్వాళ గ్రామీణ ప్రాంత పేద పిల్లలు కనీసం తమ మాతృభాషలోనే సరిగా చదవటం, రాయడం, గణితంలో ప్రాథమిక భావనలు చేయలేకపోవటాన్ని ఈ మధ్య 'రాజీవ్ విద్యామిషన్' (ఆర్.వి.ఎం.) సర్వేలో తేల్చింది.

ఇట్లా ప్రభుత్వ ప్రాథమిక విద్యారంగం బలహీనం కావటానికి కారణాలను సరిచేయకుండా కనీసం తరగతికో టీచర్‌ను, తరగతి గదని, విద్యార్థులకు మధ్యాహ్న భోజనంతో పాటు, పుస్తకాలతో పాటు నోట్ బుక్స్, పెన్నులు, బ్యాగ్‌లు అందించటం ద్వారా తమదైన మాతృభాషలో సమగ్ర జ్ఞానాన్ని పొందనీయకుండా ఒకటో తరగతి నుండే మరింత మానసిక ఒత్తిడిని పెంచడం ద్వారా ప్రాథమిక విద్యారంగంలో 'డ్రాపౌట్స్'ను మరింత పెంచ చూస్తోంది.

ఐదవ తరగతి వరకు నలభై శాతం పిల్లలు ఇవ్వాళ చదవటం, రాయటం చేయలేని స్థితిలో ఉన్నారని ఈ మధ్య 'ప్రథమ్' అనే సంస్థ

సర్వేలో తేల్చింది. అట్లాంటి విద్యార్థులను ఒకేసారి ఆరవ తరగతిలో అన్ని సబ్జెక్టులను ఆంగ్ల మాధ్యమంలో బోధించ పూనుకోవటం అంటే పసి హృదయాల మీద బండలు మోపడం లాంటిదేనని, కనీసం ప్రాథమిక స్థాయి వరకైనా తప్పనిసరి మాతృభాషలో విద్యా బోధన కొనసాగాలన్న యశ్‌పాల్ కమిటీ సిఫారసులు కాని, పాఠశాలస్థాయి వరకు మాతృభాష లోనే 'కామన్ స్కూల్' విధానంలో విద్యా విధానం అమలు చేయాలన్న కోఠారి సిఫారసులు కానీ అమలు చేయకుండా, ఆంగ్ల మాధ్యమం పేరిట పిల్లలు డ్రాపౌట్స్‌ను, పాఠశాలల ఎత్తివేత, యు.పి.ఎస్.ల కుదింపు, పోస్టుల రద్దు, సి.బి.ఎస్.ఇ. పేర ఇంటర్ విద్యకు గండి పెట్టబోతోంది. ప్రభుత్వం పాఠశాలలు మూసివేయబోవటం లేదని అందరికీ ఆంగ్ల విద్య అందించ చూస్తున్నామని, ఉన్నత వర్గాల సంపన్నుల పిల్లలకే కాకుండా దళితుల, బడుగ, బలహీన వర్గాల పిల్లలను కూడా 'కంప్యూటర్ కూలీ'లుగా మార్చ చూస్తున్నది.

రెండు కిలోమీటర్ల లోపునున్న ప్రాథమికోన్నత పాఠశాలలోని ఆరవ, ఏడవ తరగతులను సంఖ్య లేదన్న కారణంతో సమీప ఉన్నత పాఠశాలల్లోకి 'సక్సెస్' పథకం పేర షిఫ్ట్ చేస్తున్నది. నాలుగు వేలకు పైగా యూ.పి.ఎస్.ల లోని ఎనిమిది వేలకు పైగా స్కూల్ అసిస్టెంట్ పోస్టులను, రేషనలైజేషన్ పేరిట ఎస్.జి.టి. పోస్టులను హైస్కూల్స్‌లోకి సర్దుబాటు చేయడం వలన పాఠశాలలను, వేలాది పోస్టులను కుదించ చూస్తోంది. ఒకటవ తరగతిలో చేరిన వందమంది విద్యార్థుల్లో పాఠశాలలు అందుబాటులో లేకపోవటం, ఆర్థికపరమైన సమస్యలతో పాటు ఇతర కారణాలతో 36 మంది విద్యార్థులు కూడా పదవ తరగతి వరకు చేరుకోలేక పోతున్నారన్నది వాస్తవం.

ఈ పరిస్థితుల్లో ఇప్పుడున్న పాఠశాలల్ని పెంచటంతో పాటు సంఖ్య లేదన్న కారణంలో రెండు కిలోమీటర్ల లోపు ఉన్న వేలాది ప్రైవేట్ పాఠశాలల్ని కదిలించకుండా ఆరు, ఏడు తరగతులను ఎత్తివేయటం ద్వారా మరింత డ్రాపౌట్స్ సంఖ్యను పెంచడంతోపాటు, ప్రైవేట్ పాఠశాలలను బలోపేతం చేయచూస్తోంది. ఇంకొక వైపు 'సక్సెస్' పథకం పేరిట 9,155 హైస్కుల్స్‌ను 6,500 లకు కుదించటం ద్వారా మూడు వేలకు పైగా ఉన్నత పాఠశాలలకు నిధులు, నియమాకాలు లేకుండా భవిష్యత్తులో మూతవేయబోతోంది. పదవ తరగతిలోపు పెరుగుతున్న డ్రాపౌట్స్ సంఖ్యను తగ్గించటానికి చర్యలు తీసుకోలేని పాలకులు, పదవ తరగతి తరువాత డ్రాపౌట్స్ తగ్గించటం కోసం పదకొండు, పన్నెండు తరగతులు (సి.బి.ఎస్.ఇ.) ప్రవేశ పెడుతున్నామని చెపుతూ, భవిష్యత్తులో ప్రభుత్వ జూనియర్ కళాశాలల మీద వేటు వేయబోతున్నదన్నది కాదనలేని వాస్తవం.

ప్రజలంతా ఇంగ్లీష్ మీడియంను కొరుకుంటున్నారనే వాదనను ప్రభుత్వం ముందుకు తేవడానికి అసలు కారణం 'రాజీవ్ విద్యామిషన్'కు ఈ మధ్య ప్రపంచ బ్యాంక్ ప్రకటించిన 2500 కోట్ల రూపాయల ఆర్థిక సహకారం. ఆ సంస్థల ఆదేశాల మేరకే మన పాలకులు ఆంగ్లమాధ్యమం పట్ల ఇంత వ్యతిరేకత వ్యక్తమౌతున్నా అమలు చేయపూను కోవటానికి నిదర్శనం.

నిన్నటిదాకా తెలుగు మీడియంలో శిక్షణ, అర్హతలు కలిగిన ఉపాధ్యాయుడు ఆంగ్ల మాధ్యమంలో అన్ని సబ్జెక్టులు పిల్లలకు అర్థమయ్యే రీతిలో బోధించలేమని మొత్తుకున్నా శిక్షణలిస్తామని చెప్పటమంటే విద్యార్థులను ఇంగ్లిష్ మీడియం ఉరితాళ్లకు వేలాడదీసి ఇప్పుడు ఉన్నత పాఠశాలల్లో దళిత, బహుజనవర్గాలకు అందుతున్న విద్యను అందించకుండా కుట్ర పన్నుతున్నదని తేలిపోతోంది.

ఆంగ్ల మాధ్యమాన్ని ఆహ్వానిస్తున్న మేధావులు, ఉపాధ్యాయ సంఘాలు అసలు కుట్రను అర్థం చేసుకోకుండా ఆంగ్లమాధ్యమాన్ని ఆహ్వానిస్తున్నాం, కాని సి.బి.ఎస్.ఇ. సిలబస్‌ను వ్యతిరేకిస్తున్నామనటం అర్థరహితం. ఇది అంతిమంగా పాలకులకు, ప్రపంచ బ్యాంక్‌కే దోహదం చేస్తుంది. పేద, దళిత పిల్లలకు ద్రోహం చేస్తుంది. ఆంగ్ల మాధ్యమాన్ని వ్యతిరేకించే ఉపాధ్యాయ సంఘాలను, నాయకులను మీ పిల్లలు ఎక్కడ చదువుతున్నారని నిలదీస్తున్న ప్రభుత్వం, అసలు విద్యా మంత్రి నుంచి మొదలుకొని గ్రామంలోని విద్యాకమిటీ చైర్మన్ వరకు వాళ్ల పిల్లలను ఎందుకు ప్రభుత్వ పాఠశాలల్లో చేర్చలేక పోతున్నారో జవాబు చెప్పాల్సిన అవసరం ఉంది.

అసలు ప్రభుత్వ, ప్రైవేట్ అనే రెండు రకాల విద్యావ్యవస్థలు, రెండు రకాల మీడియంలు లేకుండా ప్రజలందరికి పేద, ధనిక తేడాలు లేకుండా అందరికీ ఒకే రకమైన విద్యా వ్యవస్థను డా. డి.ఎస్. కోఠారి చెప్పిన 'కామన్ స్కూల్' విధానంలో నైబర్‌హుడ్ పాఠశాలల్లో విద్యాకమిటీ చైర్మన్ నుండి మొదలు టీచర్స్, రిక్షాపుల్లర్స్, ముఖ్యమంత్రి వరకు తమ పిల్లలందరిని ఆవాస ప్రాంతాల్లోని ప్రభుత్వ పాఠశాలల్లో చదివించగలిగితే నిజమైన దేశ భవిష్యత్తు తరగతి గదిలో రూపొందించబడేది.

'డాలర్ డ్రీమ్స్'లో మధ్యతరగతిని, కింది వర్గాల తల్లిదండ్రులను మాయ, భ్రమల్లో ముంచాటనికి ఇంగ్లిష్ మీడియంలో చదివితే డాలర్ కొలువులు దొరుకుతాయని బహుళజాతి సంస్థలకు ఊడిగం చేయటమే 'మార్కెట్ విద్య' అని మన చదువులను, మన సంస్కృతిని మానవీయ సమాజాన్ని ధ్వంసం చేసి ఇక్కడి వనరుల్ని మన శ్రమతోనే కొల్లగొట్టి స్పెషల్ ఎకనామిక్ జోన్స్‌లలో, రిలయన్స్ ఫ్రెష్‌లలో సేల్స్ బాయ్‌లుగా మార్చడానికే ప్రభుత్వం పేద, దళిత పిల్లలకు ఆంగ్ల మాధ్యపు ఉరితాళ్లను బిగిస్తోంది. ఆంగ్లమాధ్యమాన్ని వ్యతిరేకించ కుండా సి.బి.ఎస్.ఇ. ను వ్యతిరేకించడమంటే ఉపాధ్యాయులను బలిపీఠం మీదకు నెట్టడమే. విద్యార్థులను ఉరికంబం మీద నిలబెట్టడమే.

*వెన్ ఐ డై బరీ మీ డీప్ / ఫోర్ ఫీట్ డౌన్ యాజ్ ఫాస్ట్ అస్లీప్ / ప్లేస్ మై ఫిజిక్స్ బుక్ ఆన్ మై చెస్ట్ / టు లెట్ మై టీచర్ నో ఐ యామ్ యట్ రెస్ట్ / ప్లేస్ మై మ్యాథ్స్ బుక్ ఇన్ ది రైట్ హ్యాండ్ / టెల్ మై టీచర్ నథింగ్ ఐ అండర్‌స్టూడ్ / బరీ మై ఇంగ్లిష్ లిటరేచర్ ఆన్ మై లెఫ్ట్ / టెల్ మై టీచర్ ఐ ట్రైడ్ మై బెస్ట్ / ప్లేస్ మై కెమిస్ట్రీ బుక్ ఆన్ మై హెడ్ / టెల్ మా టీచర్ దాట్ ఈజ్ వై ఐ యామ్ డెడ్ / అండ్ ఆల్సో టెల్ మై టీచర్స్ నాట్ టు క్రై / దే ఆర్ ది వన్స్ హు మేడ్ మీ డై....*

**జాస్తి గోపీచంద్**

*ఎనిమిదవ తరగతి, రామాంతపూర్ పబ్లిక్ స్కూల్*

ప్రభుత్వం ప్రవేశపెడుతున్న ఆంగ్లమాధ్యమం వల్ల అది స్టేట్, లేదా సి.బి.ఎస్.ఇ. సిలబస్ అయినా వాళ్లు ఎదుర్కోబోయే మానసిక హింసకు ఈ కవిత నిదర్శనం.

ఆంగ్లమాధ్యమం (జి.ఒ. 76) విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ఉరితాడు కాబోతున్నది. అంతిమంగా ప్రభుత్వ విద్యారంగాన్ని అంతం చేస్తుంది. ◆

*ఆంగ్ల మాధ్యమం వద్దంటున్నవారు అంతే తీవ్రంగా ప్రైవేట్, కార్పొరేట్ సంస్థలలో బోధన తెలుగులోనే జరగాలని డిమాండ్ చేయకపోవడం తీవ్రమైన లోపమని అంటున్నారు* **బి. రామకృష్ణ**

# ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్లమాధ్యమం

రాష్ట్రవ్యాప్తంగా ఉన్న 9,155 ప్రభుత్వ ఉన్నత పాఠశాలల్లోని 6,500 పాఠశాలల్లో 2008-09 విద్యా సంవత్సరం నుండి ఇంగ్లీష్ మీడియం ప్రారంభించనున్నారు. రెండు కిలోమీటర్ల పరిధిలోనున్న ప్రాథమికోన్నత పాఠశాలలలోని ఆరు, ఏడు తరగతులను దగ్గర్లోని ఉన్నత పాఠశాలలోకి పంపిస్తారు. ఆ విధంగా ఇక రాష్ట్రంలో ప్రాథమికోన్నత పాఠశాలలు కనుమరుగైతాయి. మిగిలేవి ప్రాథమిక, ఉన్నత పాఠశాలలు మాత్రమేనన్నమాట. ఉన్నత పాఠశాలలో తెలుగు మీడియంతో పాటుగా సమాంతరంగా ఇంగ్లీష్ మీడియంను ఈ సంవత్సరం నుండే ఆరవ తరగతిలో ప్రారంభిస్తున్నారు.

ప్రపంచవ్యాప్తంగా విద్యావేత్తలు, మనోవైజ్ఞానిక శాస్త్రజ్ఞులు, సామాజిక శాస్త్రవేత్తలు మెజారిటీగా అంగీకరించిన అంశం ఏమంటే, కనీసం పాఠశాల విద్యవరకైనా మాతృభాషలో బోధన జరగాలనేది. దీనివలన పిల్లల విజ్ఞాన, వికాసాలు మెరుగవుతాయి. ప్రజల సంస్కృతి, చారిత్రక వారసత్వాలు సుసంపన్నం కావడానికి, ప్రజల మధ్య భావ వినిమయం సులభంగాను, ప్రభావవంతంగా జరిగి ఉన్నత గమ్యాల వైపుకు సాగడానికి మాతృభాష సహకరించడమే కాకుండా ఆవశ్యక అంశంగా ఉంటుంది.

ప్రపంచీకరణ నేపథ్యంలో, అసమాన పోటీ ప్రపంచంలో సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణలు దూకుడుగా ముందుకు వస్తున్న తరుణంలో, పెట్టుబడి ప్రపంచవ్యాప్తంగా పాదరసంలా పాకుతున్న సందర్భంలో, సామ్రాజ్యవాద శక్తులకు అనుకూలంగా ప్రపంచ వ్యాప్తంగా ఒక సాధారణ భాష అవసరం ఏర్పడి ఉంది. ఆ భాషే ఇంగ్లీష్. మరోకోణంలో చూసినపుడు ప్రపంచప్రజల మధ్య భావ వినిమయం కోసం సంధాన భాషగా కూడా ఇంగ్లీష్ నేడు స్థిరపడి పోయిందనడంలో సందేహం లేదు. ఆంగ్లేయుల పాలనవల్ల మనదేశంలో ఇంగ్లీష్ ప్రాధాన్యతను సంతరించుకుంది. కారణాలేమైతేనేమి గాని ఇవ్వాళ ప్రపంచవ్యాప్తంగా సంధానభాషగా ఇంగ్లీష్ ఉందనేది వాస్తవం.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, న్యాయస్థానాలు అనేక ఇతర ప్రభుత్వ సంస్థలన్నీ తమ అధికారిక రాతపూర్వక కార్యక్రమాలను ఆంగ్లభాషలోనే నెరపుతున్నాయి. ప్రొఫెషనల్ కోర్సులు, పి.జి. మరితర ఉన్నతస్థాయి చదువులు, పి. హెచ్.డిలు అన్నీ కూడా ఆంగ్ల మాధ్యమంలోనే నడుస్తుండడం అనుభవంలో ఉన్నదే.

నేడు ప్రభుత్వ ఉద్యోగాలు కుంచించుకు పోవడం చూస్తూనే ఉన్నాం. ప్రైవేట్‌రంగంలో ఉపాధి వెతుక్కోవాల్సిన పరిస్థితి నెలకొని ఉంది. ప్రజల చేతివృత్తులు నశించిపోయి వాటి స్థానంలో బడా కంపెనీలు వచ్చి చేరాయి. వ్యవసాయం ఇవ్వాళ రైతులకు తిండి పెట్టలేని పరిస్థితిలో ఉన్నది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నం అయిపోయింది. దాని స్థానంలో నేడు జాతీయ, అంతర్జాతీయ బహుళజాతి సంస్థలు చొచ్చుకు వస్తున్నాయి. ఈ సంస్థలలో ఉద్యోగాలకు ఇంగ్లీష్ అవసరమైన భాషగా ఉంది.

విదేశాల్లో ఉద్యోగాలకు ఇంగ్లీష్ తప్పనిసరి భాషగా ఉంది. ఎంతమంది విదేశాలకు వెళ్లారు లేదా వెళ్లగల్గుతారు అనేది కాదు కాని వెళ్లే వారికి ఇంగ్లీష్ భాష అవసరమవుతోంది. అక్కడ జ్ఞానం, డబ్బు సంపాదించుకోవాలి అనుకునే వారు మధ్యతరగతిలో చాలమందే ఉన్నారు. ఆ సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది.

మాతృభాష ప్రాముఖ్యత, అవసరం తెలిసినవారు దానికోసం ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్లమాధ్యమం వద్దనే వారు సహితం వారి పిల్లలను ఇంగ్లీష్ మీడియం పాఠశాలల్లోనే చదివిస్తున్నారు. సమాజంలో కొద్దో గొప్పో మంచివనుకునే ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగాలకు ఇంగ్లీష్ ఒక అవసరంగా మారిపోయింది. ప్రస్తుత సందర్భంలో ప్రభుత్వ పాఠశాలల్లో ఇంగ్లీష్ మీడియం వద్దంటున్న వారు అంతే తీవ్రంగా ప్రైవేట్, కార్పొరేట్ సంస్థలలో మాతృభాషలోనే బోధన జరుగాలనే విధాన నిర్ణయం కోసం ఒక డిమాండ్ ముందుకు తేకపోవడం లోపంగా ఉంది. ఈ పాఠశాలలో ఇంగ్లీష్ మీడియంను కొనసాగనివ్వ వద్దని ఉద్యమం తెస్తేగాని ప్రజలు ఈ శక్తులను నమ్మే పరిస్థితి లేకుండాపోయింది.

దేశవ్యాప్తంగా కూడా మాతృభాషల్లోనే పాఠశాల స్థాయివరకు బోధన జరిపే తప్పనిసరి పరిస్థితి లేదు. కనుక కొందరికి ఇంగ్లీష్ చదువులు, మరికొందరికి మాతృభాషా చదువులు అనే విభజన ఏర్పడింది. దేశవ్యాప్తంగా అన్ని పాఠశాలల్లో మాతృభాషల్లోనే బోధన అనేది అమలు జరిగి ఉంటే, కె.జి. నుండి పి.జి. వరకు ఇతర ప్రొఫెషనల్ కోర్సుల్లో కూడా మాతృభాషల్లోనే బోధన జరిగే పరిస్థితి ఏర్పడి ఉంటే కనుక ఇవ్వాళ ఆంగ్ల మాధ్యమం డిమండ్‌గాని ఆంగ్ల భాష పట్ల వ్యామోహంగాని ఏర్పడి ఉండేది కాదు. ఈ మొత్తం నేపథ్యంలో ఆంగ్ల మాధ్యమంలో బోధన అనేది కాదనలేని పరిస్థితిలో ఉండడం గమనించవచ్చు.

సామ్రాజ్యవాదశక్తుల ప్రయోజనాలా? లేక నిజంగానే పేద పిల్లలు ఆంగ్లంలో చదువుకుంటేనే వారు అభివృద్ధి పథంలో నడుస్తారనే భావనా? మరేదైతేనేమి ఉన్నత పాఠశాలల్లో ఇంగ్లీష్ మీడియంలో బోధన చేయాలని ప్రభుత్వం విధాన నిర్ణయం తీసుకుంది. 10 జూన్ 2008న అంటే రెండు రోజులపాటు పాఠశాలలు ప్రారంభం అవుతాయనగా ఉత్తర్వులు

జారీచేసింది. పేద ప్లిలలకు మేలు చేసే సదుద్దేశంతో ఇంగ్లి మీడియంలో బోధనలను చేసేందుకు ప్రయత్నిస్తున్నారనే అనుకుందాం. అయితే ఈ కార్యక్రమం అమలయ్యే పద్ధతి పరిశీలిస్తే గాని డొల్లతనం అర్థం కాదు.

ఈ సంవత్సరం 6,500 ఉన్నత పాఠశాలలో సమాంతరంగా ఆరవ తరగతిలో ఇంగ్లిష్ మీడియం తరగతిని ప్రారంభిస్తారు. ఇప్పటికే ఉన్న తెలుగు మీడియం తరగతులు అలాగే నడుస్తుంటాయని వాటిని ఆపేదేమి లేదని చెపుతున్నారు. ఈ సంవత్సరం, మరి రానున్న సంవత్సరాల్లో పెరిగే ఇంగ్లిష్ మీడియం తరగతులతో పాటుగా అదనపు గదులు, వసతులు, ఉపాధ్యాయ సిబ్బంది, ఆటస్థలం మొదలైనవి అవసరమవుతాయి. వీటి గురించిన కార్యాచరణ ప్రణాళిక ఏమిటన్నది ముఖ్యమైన విషయం. ఇపుడున్న భవనాలతోనే, ఉన్న టీచర్లతోనే నడిపించే ప్రయత్నం ప్రభుత్వం చేస్తోంది. ప్రస్తుతం పనిచేస్తున్న టీచర్లకే శిక్షణ ఇచ్చి ఇంగ్లిష్ మీడియం తరగతులు బోధించే ప్రణాళిక రూపొందించారు. ఈ టీచర్ల సంఖ్య సరిపోతుందా అనేది ఒక ప్రశ్న. వీరు ఇంగ్లిష్ మీడియంలో బోధించడంలో నైపుణ్యం ఎలా ఉంటుంది అనేది మరో ప్రశ్న.

'కమ్యూనికేటివ్ ఇంగ్లిష్ ఫర్ కాన్ఫిడెన్స్ బిల్డింగ్ టు హైస్కూల్ టీచర్స్ ఫర్ హాండ్లింగ్ ఇంగ్లిష్ మీడియం క్లాసెస్' పేరుతో హైస్కూల్ తెలుగు, ఉర్దూ మీడియం టీచర్లకు 13 రోజులపాటు శిక్షణా కార్యక్రమాన్ని రెండు దశల్లో రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించారు. దీనికి సంబంధించిన మెటీరియల్‌ను పాఠశాల విద్యా సంచాలకులు, ఎస్.సి.ఇ.ఆర్.టి. లు సంయుక్తంగా రూపొందించాయి. ఈ శిక్షణలో గ్రామర్, స్పీకింగ్ స్కిల్స్‌పై చర్చించారు. శిక్షణను నిర్వహించే రిసోర్స్ పర్సన్స్‌గా హైస్కూల్ టీచర్స్‌ను ఎంచుకున్నారు. వీరికి అయిదు రోజులు శిక్షణ ఇచ్చారు. ఈ అయిదు రోజుల శిక్షణతో వీరు 13 రోజుల కార్యక్రమాన్ని నిర్వహించారు, వీరికి బదులుగా రిసోర్స్‌పర్సన్స్‌గా ఇంగ్లిష్ అండ్ ఫారన్ లాంగ్వేజస్ యూనివర్సిటీ లేదా రాష్ట్రంలోని యూనివర్సిటీల ఇంగ్లిష్ ఫ్యాకల్టీని వినియోగిస్తే కొంతలో కొంతైనా మెరుగ్గా ఉండేది. అలాంటి ప్రయత్నమేది జరగలేదు. ఇంగ్లిష్ భాష మీద పట్టున్న వ్యక్తులను రిసోర్స్‌పర్సన్స్‌గా నియమించుకోలేక పోవడమంటేనే ఈ శిక్షణ సఫలం కావాలని నైపుణ్యం పొందాలనే యోచన లేదని అర్థం చేసుకోవచ్చు. ఒకవేళ 13 రోజుల కార్యక్రమాన్ని సక్రమంగా నిర్వహించినప్పటికీ ఈ స్వల్పకాలంలో టీచర్లు తమ తమ సబ్జెక్టుల బోధనను ఇంగ్లిష్ మీడియంలో సమర్థవంతంగా నిర్వహించే సామర్థ్యాలను పొందగలరని అనుకోగలమా? ఇది సాధ్యమయ్యే పనేనా? ఈ పద్ధతి శాస్త్రీయమైనదని అనవచ్చా? రాష్ట్రానికి సంబంధించి అత్యున్నత విద్యాపరిశోధన సంస్థ ఎస్.సి.ఇ.ఆర్.టి. కూడా ఇలా భావించడం అంటే దాని స్థాయి, సమర్థతలను సులభంగానే అంచనా వేయొచ్చు.

ఏ టీచర్లతోనైతే ఇంగ్లిష్ మీడియం తరగతులను బోధించాలనుకున్నారో వారి సబ్జెక్ట్ పరంగా ఆంగ్ల భాషా సమర్థత ఎంత? వారి స్థాయి మెరుగుపరచకుండానే ఇంగ్లిష్ మీడియం ప్రారంభించడం అంటే అది ఎంత నిరర్థకమో తెలియంది కాదు. ఇంగ్లిష్ వాతావరణంలేని కుటుంబాల నుండి వస్తున్న పిల్లలు, టీచర్లు ఇద్దరు కలిసి బోధనా ప్రక్రియలను ఆంగ్లంలో ఎలా పంచుకుంటారో అర్థంగాని విషయమేమి కాదు. ఉపాధ్యాయుల్లో ఇంగ్లిష్ మీడియంలో బోధించే సమర్థత, నైపుణ్యాలను పెంపొందించకుండా, లేదా అవి ఉన్న టీచర్లను కొత్తగా నియమించుకోకుండా కార్యరంగంలోకి దిగడం నిష్ప్రయోజనం. ఇదంతా వృథా ప్రయాసే కాకుండా విద్యార్థికి, ఉపాధ్యాయునికి కూడా నరకప్రాయం. ప్రస్తుతం తెలుగు మీడియంను కొనసాగిస్తూనే సమాంతరంగా ఇంగ్లిష్ మీడియంను ప్రారంభిస్తామని అంటున్నప్పటికి భవిష్యత్‌లో తెలుగు మీడియంను పూర్తిగా కనుమరుగు చేసే ప్రయత్నం జరుగుతోంది. ఇంగ్లిష్ మాధ్యమంలో బోధించే సమర్థతలేని వారితో బోధన చేయిస్తూ పిల్లలు ఇటు తెలుగులో కాని అటు ఇంగ్లిష్‌లో కాని నేర్చుకోకుండా వారిలో కనీస అభ్యాసం జరుగకుండా 'రెంటికి చెడ్డ రేవడి' చందంగా తయారుకావడాన్నే ప్రభుత్వం కోరుకుంటోంది.

ప్రాథమికోన్నత పాఠశాలల్లోని ఆరు, ఏడు తరగతులను దానికి దగ్గర్లోనున్న ఉన్నత పాఠశాలలోకి తరలించే నిర్ణయం తీసుకున్నారు. అలా తరలించే బదులుగా అక్కడే ఎనిమిదవ తరగతి ప్రారంభిస్తూ దాన్నే ఉన్నత పాఠశాలగా చేయవచ్చు. అలా చేయడం ద్వారా పిల్లలు ఉన్నత పాఠశాల చదువుల కోసం దూరం పోవాల్సిన అగత్యం తప్పుతుంది. ఇలా పేద పిల్లలకు అందుబాటులోనే హైస్కూల్ చదువులను ఉంచవచ్చు. దీనిద్వారా పాఠశాలల విలీనాన్ని, వాటి సంఖ్యను తగ్గించే ప్రయత్నంను విరమించుకుంటూ మరిన్ని కొత్త పాఠశాలలను ఏర్పాటు చేసుకునే పరిస్థితి ఉంటుంది. 1 కిలోమీటర్ (కి.మీ.) లేదా 2 కి.మీ లేదా 3 కి.మీ. లేదా 5 కి.మీ. అని కాకుండా జనసాంద్రతను బట్టి, ప్రజల విద్యావసరాలను బట్టి పాఠశాలల సంఖ్యను నిర్ణయించాలి. కాని 5 కి.మీ.కు ఒక హైస్కూల్ అని 1 కి.మీ కు ఒక హైస్కూల్ అని 1 కి.మీ. కు ఒక ప్రాథమిక పాఠశాల అని పట్టుకు వేలాడడం సరైంది కాదు.

హైదరాబాద్ లాంటి నగరాలలో ఒకే ప్రాంగణంలో ఒకటి కన్నా ఎక్కువ పాఠశాలలు నడుస్తున్నాయి. కనుక వాటన్నింటిని కలిపి ఒకే పాఠశాలగా మారుస్తారని చెప్పటం సరైందిగా కనిపిస్తుంది. అలాగే తక్కువ మంది పిల్లలున్న పాఠశాలలను మూసేస్తామనడం కూడా సరైనదిగానే తోస్తుంది. అసలు సమస్య ఏమంటే ఒకే ప్రాంగణంలోకి అనేక పాఠశాలలు ఎలా వస్తాయనేది? విద్యార్థుల సంఖ్య ఎందుకు తగ్గుతోంది అనేది? ఇబ్బడి ముబ్బడిగా ప్రైవేట్ పాఠశాలలకు అనుమతులివ్వడం వలన ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిందనేది వాస్తవం కాదా? ఏ పరిస్థితులు దీనికి కారణమో తెల్సుకుని వాటిని చక్కదిద్దకుండా పాఠశాలలు మూసేస్తాం, కలిపేస్తాం, వాటి సంఖ్య ను కుదించేస్తాం అని అనడం అవివేకం అవుతుంది. హైదరాబాద్‌లో నైతే అధికారిక లెక్కల ప్రకారమే 1200 మురికివాడలున్నాయి. ఆ ప్రాంతాలలో పేదపిల్లల విద్యావసరాలు ఎన్నో ఉన్నాయి. మండలాల వారిగా ఉపాధ్యాయ, విద్యార్థి, ప్రజాసంఘాలు, ప్రభుత్వ ప్రతినిధులు కలిపి కమిటిలు ఏర్పాటు చేయాలి. ఈ కమిటీలు ఆయా ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించి, అధ్యయనం చేసి ప్రభుత్వ పాఠశాలల ఏర్పాటు ప్రాంతాలను సూచిస్తాయి ఇలానే రాష్ట్ర వ్యాప్తంగా జిల్లాల్లో మండలాల వారిగా పాఠశాలల స్థాపనకు ప్రాంతాలను గుర్తించి. ఏర్పాటుచేయవచ్చు. అలా ప్రజా అవసరాలను దృష్టిలో పెట్టుకుని నూతన పాఠశాలలను స్థాపించాలి. ఈ దిశలో ప్రభుత్వాధికారులు, మంత్రులు, ఏమాత్రం ప్రయత్నం చేయడం లేదు.

అలాకాకుండా రేషనలైజేషన్ పేరుతో పాఠశాలల్లోని సిబ్బందిని తొలగించడం, సర్దడం లేదా విద్యార్థులు లేరని మూసేయడం పాఠశాలల సంఖ్యను, ఉపాధ్యాయ నియామకాలను కుదించేస్తున్నారు. ఆ విధంగా పరోక్షంగా వ్యాపారాత్మకంగా సాగే ప్రైవేట్ విద్యాసంస్థలను ప్రోత్సహిస్తున్నారు. అవి విలసిల్లడానికి అదే సమయంలో ప్రభుత్వ పాఠశాలలో విద్య వ్యర్థం అని స్ఫురించేలా ప్రభుత్వ విధానాలంటున్నాయి. ◆

*సామాజిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకునే సెజ్‌ల స్థాపనకు అనుమతి ఇవ్వాలని, ఈ విషయంలో ప్రభుత్వం తగు జాగ్రత్తలు వహించాలని అంటున్నారు* **డా. యిమ్మానేని సత్యసుందరం**

# దారితప్పిన ప్రత్యేక ఆర్థిక మండలాలు

**భా**రతదేశ ఆర్థిక పరిస్థితి బాగానే ఉంది. అయితే, ప్రధాన సమస్యలైన దారిద్ర్యం, నిరుద్యోగం పరిష్కరించుకోలేకపోయాం. ఇటీవల కాలంలో సగటు అభివృద్ధి రేటు ఎనిమిది శాతం దాటి ఉంది. ఈ రేటు మాత్రమే మన సమస్యలను పరిష్కరించలేదు. పైగా కొత్త సమస్యలను సృష్టించవచ్చు. అభివృద్ధి రేటుతోపాటు అభివృద్ధి తీరుకూడా ముఖ్యమే. అభివృద్ధి ఫలాలు అన్నివర్గాలకు, అన్ని ప్రాంతాలకు అందాలి. అదే నిజమైన ప్రగతి. ఈ విషయంలో మనదేశం ఆశించిన విజయం సాధించలేదు.

### సెజ్‌ల లక్ష్యాలు

దేశ జనాభాలో ఇరవై మూడు శాతం దారిద్ర్య రేఖకు దిగువనున్నారు (సుమారు ముప్పై కోట్లమంది). అభివృద్ధి విషయంలో ప్రాంతీయ వ్యత్యాసాలు తగ్గలేదు. ఆదాయ, సంపద వ్యత్యాసాలు పెరుగుతున్నాయి. నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాల్చింది. సుమారు నాలుగు కోట్ల శ్రామికులు నిరుద్యోగానికి, అల్ప ఉద్యోగానికి గురవుతున్నారు.

మన ఆర్థికవ్యవస్థలో గ్రామీణరంగంలో వ్యవసాయేతర కార్యక్రమాలకు ప్రాధాన్యత నివ్వాలి. పెరిగే శ్రామికశక్తికి ఒక్క వ్యవసాయమే ఉపాధి కల్పించలేదు. కేవలం గ్రామీణ పారిశ్రామికీకరణ ద్వారా మాత్రమే గ్రామీణ దారిద్ర్యం నిరుద్యోగం నిర్మూలించగలం. గ్రామీణ సౌభాగ్యానికి వ్యవసాయేతరరంగం ప్రగతి కీలకం. మన దేశంలో గ్రామీణ వ్యవసాయేతర రంగం కొంత ప్రగతిని సాధించింది. ఈ రంగంలో ఉపాధి 1977-78 లో 16.6 శాతం ఉండగా 1999-2000 కి ఇది 23.8 శాతానికి పెరిగింది. 1988లో గ్రామీణ వ్యవసాయేతర రంగంలో నలభై మిలియన్ శ్రామికులు పనిచేసారు.

గ్రామీణ రంగంలోనే కాకుండా వ్యవసాయరంగంలో కూడా వైవిధ్యత ఉండాలి. భూమిని కేవలం ఆహారధాన్యాలకే ఉపయోగించి ప్రయోజనం లేదు. అలాగే సంవత్సరానికి రెండు లేక మూడు పంటలు పండించాలి. పండ్లు, కాయగూరలకు తగు ప్రాధాన్యతనివ్వాలి. ప్రస్తుతం ఈ రంగంలో ఉత్పాదకత తక్కువ, వృథా ఎక్కువ. అంతేకాదు, నీరు ఎక్కువ ఖర్చయ్యే పంటలకు ప్రాధాన్యతనిస్తున్నాం. అందువలన నీటిపై ఒత్తిడి పెరిగింది. మన ఆహారపు అలవాట్లలో కూడా మార్పు రావాలి.

గ్రామీణ ఆర్థికరంగంలో, ముఖ్యంగా వ్యవసాయరంగంలో వైవిధ్యత రావాలి. దీని ద్వారా మాత్రమే ఉపాధిస్థాయి పెంచి, దారిద్ర్య నిర్మూలన చేయగలం. ఈ దిశగా చాలా దేశాలు ప్రత్యేక ఆర్థిక మండలాలను (సెజ్‌లు) ఏర్పరచుకొన్నాయి.

మనదేశం కూడా సెజ్‌లకు ప్రాధాన్యతనిస్తోంది. సెజ్‌ల చట్టం 2005లో అమలులోకి వచ్చింది. ఈ చట్టం అమలులోకి రాకముందు 19 సెజ్‌లలో రు. 7,104 కోట్లు పెట్టుబడి పెట్టడం జరిగింది. 10 ఫిబ్రవరి 2006 తర్వాత ఏర్పడిన సెజ్‌లలో రు. 67,347 కోట్ల పెట్టుబడి పెట్టడం జరిగింది. అంతకుముందున్న సెజ్‌లు రెండు లక్షలమందికి ఉపాధి కల్పించాయి. సెజ్‌ల ఎగుమతులు 2005-06లో రు. 22,840 కోట్ల నుండి 2006-07లో రు. 34,615 కోట్లకు పెరిగాయి. 2007-08లో రు. 67,088 కోట్లు ఉండవచ్చని అంచనా (ఆర్థిక సర్వే 2007-08, పేజి. 147).

### కొన్ని సందేహాలు

మనదేశంలో సెజ్‌ల స్థాపన వివాదానికి దారితీసింది. సాగు భూమిని సెజ్‌లకు అప్పజెప్పి మన ఆహారభద్రతకే ముప్పు తెచ్చుకోవడం సరికాదు. సెజ్‌లు సేకరించిన భూమిలో చాలా తక్కువ భాగం మాత్రమే సెజ్‌ల కోసం ఉపయోగించుకోవడం జరుగుతోంది. భూమి యాజమానులకిచ్చే నష్టపరిహారం కూడా తక్కువే. సెజ్‌లలో పనిచేసే కార్మికుల పరిస్థితి ఏమిటి? మామూలు కార్మిక చట్టాలు సెజ్‌లకు వర్తించవు. సెజ్ కార్మికుల పరిస్థితి మరింత దిగజారే ప్రమాదం ఉంది. అంతేకాదు, సెజ్‌లలో స్థాపించే యూనిట్ల ఉపాధి కల్పనాశక్తి తక్కువ. ఉదాహరణకు, ఐ.టి. రంగం ఎంతమందికి ఉపాధి కల్పించగలదు?

సెజ్‌లు విదేశీమారక ద్రవ్యం సంపాదించగలవని ప్రత్యేక ప్రోత్సహకాలు కల్పించబడ్డాయి. అయితే, ప్రస్తుతం మన విదేశీమారక నిల్వలు సంతృప్తికరంగా ఉన్నాయి. సెజ్‌ల దుష్ఫలితాలను పక్కనబెట్టి కేవలం విదేశీమారక నిల్వలను పెంచడానికి సెజ్‌లను ప్రోత్సహించడం తగదు. అంతేకాదు, సెజ్‌ల స్థాపన కొన్ని రాష్ట్రాలలోనే (ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, తమిళనాడు మొదలైనవి) కేంద్రీకృతమై ఉంది. ఈ కారణంగా భవిష్యత్‌లో ప్రాంతీయ వ్యత్యాసాలు ఇంకా పెరిగే ప్రమాదం ఉంది.

### ఏం చేయాలి ?

గ్రామీణరంగంలో వైవిధ్యత చూపటానికి సెజ్‌లు సహాయ

*జెండాలు ఏవైనా, ఎజెండా ఏది ప్రకటించినా సామ్రాజ్యవాదులను సంతృప్తి పరచడంలో పాలక, ప్రతిపక్ష పార్టీలన్నింటి విధానం ఒకటేనని అంటున్నారు* **ఎం. రత్నమాల**

# చెబుతున్నదేమిటి - చేస్తున్నదేమిటి?

అక్షరక్రమంలో రెండో స్థానంలోనే కాదు ప్రత్యేక ఆర్థిక మండళ్ల నెలకొల్పడంలో కూడా ఆంధ్రప్రదేశ్ రెండో స్థానంలో ఉంది. భారతదేశం మొత్తం మీద అన్ని రాష్ట్రాలు కలిపి 446 సెజ్‌లు ఇప్పటికి ఏర్పాటు కానుండగా మన రాష్ట్రం 76 సెజ్‌లను అనుమతించుకుని దేశంలో రెండో స్థానంలో ఉంది. 88 సెజ్‌ల మహారాష్ట్రను కూడా మించడానికి ఆంధ్రప్రదేశ్ ఇటీవల రాష్ట్ర సముద్రతీరం పొడుగునా కోస్టల్ ఇండస్ట్రియల్ కారిడార్ నిర్మాణంతో పాటు మరో పన్నెండు ప్రత్యేక ఆర్థిక మండలాలు (స్పెషల్ ఎకానామిక్ జోన్స్ అనే సెజ్‌లు పొడి అక్షరాల్లో ఎస్.ఇ.జెడ్ లు) రాష్ట్రంలో ఇప్పటికే ఏర్పాటయిన 54 ప్రత్యేక ఆర్థిక మండలాల్లో (సెజ్‌ల్లో) 27 లక్షల మందికి ఉపాధి లభిస్తుందని రాష్ట్ర ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఆశ చూపుతున్నారు. దాదాపు సముద్రతీరం పొడుగునా శ్రీకాకుళం నుంచి నెల్లూరు దాకా విస్తరించనున్న ఇండస్ట్రియల్ కోస్టల్ కారిడార్ (సముద్రతీర ప్రాంత పారిశ్రామిక కారిడార్) లో రానున్న పది ఓడరేవులు కలిపి ముమ్ముందు మరికొన్ని లక్షల ఉద్యోగాలు లభించనున్నాయని కూడా ఎరచూపుతున్నారు. అయితే ఈ ఎర లక్ష్యం, ఫలితం, ప్రజాజీవనానికి వాటిల్లే ప్రమాదం మాటేమిటి. ప్రత్యేక ఆర్థిక మండలాలలో పొంచి ఉన్న ప్రమాదాన్ని రాష్ట్ర ప్రజలు పసిగట్టి ప్రత్యేక మండలాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. పోరాడుతున్న ప్రజలపై పాశవిక ప్రభుత్వ నిర్బంధం అమలవుతోంది.

ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టాన్ని పార్లమెంట్‌లో ఏదో కొద్దిపాటి నామమాత్రపు పైపై విమర్శలు, సూచనలతో ఒక్కరోజులోనే ఆమోదించిన ప్రతిపక్షాలు – ఒక్కరోజులోనే ఆమోదించిన రాష్ట్రపతి బిల్లు ప్రతిపాదించి వివరణ ఇచ్చి మరో రోజు వెరసి కేవలం మూడంటే మూడు రోజుల్లో స్పెషల్ ఎకనామిక్ జోన్స్ చట్టం 2005 చట్టరూపంలో 10 ఫిబ్రవరి 2006 న అమల్లోకి వచ్చింది. ఈ చట్టాన్ని పార్లమెంట్‌లో అడ్డుకొనని ప్రతిపక్షాలు, ప్రజలను అప్రమత్తం చేయడానికి ఆందోళన సరే కనీసం ప్రచార కార్యక్రమాలు కూడా చేపట్టని పార్టీలు, రైతుల భూములు ప్రభుత్వం అక్రమంగా, మోసపూరితంగా, కుట్రలు కుతంత్రాలతో, నిర్బంధం ప్రయోగించి స్వాధీనం చేసుకోవడం ప్రారంభించిన వెంటనే అడ్డుకో ప్రయత్నించని పార్టీలు ప్రత్యేక ఆర్థిక మండలాల పునాదుల కింద భూములు కోల్పోయిన రైతులు, కుటుంబాలు జీవనాధారం కోల్పోయిన వ్యవసాయాధారిత వృత్తులవారు, సముద్ర సంపదపై ఆధారపడి జీవించే ప్రజలు మొత్తంగా ప్రత్యేక ఆర్థిక మండలాలు గుటకాయాస్వాహా చేసిన గ్రామాలకు గ్రామాల ప్రజలు 2005 నుంచి పోరాడుతున్నా పట్టి పట్టనట్లు వ్యవహరిస్తున్నాయి. ప్రతిపక్ష పార్టీలు ఎన్నికలు (ఉపఎన్నికల సందర్భంగా కూడా) దగ్గపడుతున్న కొద్దీ ప్రత్యేక ఆర్థిక మండలాలకు వ్యతిరేకంగా విమర్శలు, ఆందోళనలు ప్రారంభించాయి. ధర్నాలు గట్రా చేస్తున్నారు. కాకినాడ వంటి చోట్ల భారతీయ జనతాపార్టీ పోరాట క్రమంలో జైలు నిర్బంధంలో ఉన్నవారిని పరామర్శించి విడుదల చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయడంతో పాటు పలుమార్లు ఆ ప్రాంతంలో సభలు, సమావేశాలు నిర్వహించింది. సంఘీభావ కమిటీల్లో కూడా ప్రతిపక్ష పార్టీలు భాగస్వాములవుతున్నాయి. తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబు నాయుడు 'మీకోసం' అంటూ ఓట్ల కోసం చేస్తున్న యాత్రల్లో ప్రత్యేక ఆర్థిక మండలాలకు వ్యతిరేకంగా భీకర ప్రకటనలు, ప్రతిజ్ఞలు గుప్పించారు. విశాఖ పట్టణంలో సి.పి.ఐ. (ఎం) పార్టీ సెజ్‌లను వ్యతిరేకిస్తూ నినాదాలు రాసిన ప్లేకార్డులను చేతబూని ధర్నాలు చేసింది. ఈ మార్క్సిస్ట్ పార్టీ ప్రభుత్వమే పశ్చిమ బెంగాల్ రాష్ట్రం నందిగ్రాంలో నెలకొల్ప తలపెట్టిన ఇండోనేషియా బహుళజాతి సంస్థ సలీం గ్రూప్ ఆఫ్ కంపెనీకి చెందిన రసాయన పరిశ్రమకు వ్యతిరేకంగా ఉద్యమించిన ప్రజలను ఊచకోత కోసింది.

---

పడవచ్చు. అయితే, సెజ్‌ల స్థాపన ఒక ప్రణాళికాబద్ధంగా ఉండాలి. అసలు లక్ష్యాలు మరచి ప్రస్తుతం సెజ్‌లను లాభసాటి వ్యాపార కేంద్రాలుగా మార్చటం జరిగింది. సెజ్‌ల వలన నేర్పరితనం గల శ్రామికులకు డిమాండ్ పెరుగుతోంది. అందువల్ల శ్రామిక శిక్షణకు ప్రాధాన్యతనివ్వాలి. నిరుపయోగంగా ఉన్న భూములను సెజ్‌లకు వాడుకోవడంలో తప్పులేదు. అయితే, భూమిని సెజ్ యజమానులు తమ స్వప్రయోజనాలకు వాడకూడదు. పన్ను రాయితీలు, మిగతా ప్రోత్సహకాలు ఏ స్థాయిలో ఉండాలో సమీక్షించాలి. భూమి యజమానులకు తగు నష్టపరిహారం ఇవ్వాలి. పర్యావరణంకు సంబంధించిన విషయాలను నిర్లక్ష్యం చేయరాదు. సెజ్‌ల సంఖ్య పరిమితంగా ఉండాలి. సామాజిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకునే సెజ్‌ల స్థాపనకు అనుమతి ఇవ్వాలి. సెజ్‌ల స్థాపన గ్రామీణరంగంలో అవస్థాపన, ఉపాధి సౌకర్యాలు పెంచాలి. సెజ్‌ల స్థాపన విషయంలో ప్రభుత్వం తగు జాగ్రత్తగా వ్యవహరించాలి. ◆

బెంగాల్ మార్క్సిస్ట్ (పార్టీ భాగస్వాములైన) ఆల్ ఇండియా ఫార్వర్డ్ బ్లాక్, రెవల్యూషనరీ సోషలిస్ట్ పార్టీ మొదలైన మిత్రపక్షాలు నందిగ్రాం ప్రజలపై ప్రభుత్వ మారణకాండను నామ మాత్రంగా నోటి మాటల్తో వ్యతిరేకించాయి. ఆంధ్రప్రదేశ్‌లో అదే సి.పి.ఐ. (ఎం) ప్రత్యేక ఆర్థిక మండలాలపై పోరాడుతామంటూ ప్రకటనలు చేస్తున్నది. రాష్ట్రంలో సెజ్ వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొంటున్న భారతీయ జనతా పార్టీకి గుజరాత్‌లో సెజ్‌ల గురించి గుర్తుండదు – ఇది పాలక – ప్రతిపక్ష పార్టీల ద్వంద్వ వైఖరి. రెండు నాల్కల ధోరణి.

ప్రత్యేక ఆర్థిక మండలాలు భారతదేశంలో సామ్రాజ్యవాదులకు అవసరమైన సరుకులు అతి చవగ్గా ఉత్పత్తి (చవక కూలికి అందించే కార్మికులు) చేసే పారిశ్రామిక వాడలు – ఈ పరిశ్రమల వల్ల కాలుష్యం మన దేశాన్ని కబళిస్తే సంపన్న దేశాలు సెజ్‌లో ఉత్పత్తి అయిన సరుకుల సంపదలు పెంచుకుంటాయి. ప్రత్యేక ఆర్థిక మండలాలు దేశంలో విస్తరిస్తున్న ఆధునిక సామ్రాజ్యవాద భూస్వామ్య పారిశ్రామిక వాటికలు. గోవా ప్రభుత్వం ప్రజల ప్రజాందోళనకు తలవొంచి ప్రత్యేక ఆర్థిక మండలాలను తిరస్కరించి, (అయితే ఒక్కటి ప్రభుత్వ మొత్తంగా టూరిజం ఆదాయంపై ఆధారపడి ఉంది కనుక, టూరిజం పరిశ్రమల పాలకులు వారి బంధుగణం సంపదల పురోభివృద్ధి ఆధారపడిఉంది కనుక, ఆ వర్గాల ఏకైక ఆదయవనరు టూరిజం పరిశ్రమ ఆధారిత వ్యవస్థలు, సంస్థలు, అంటే రవాణశాఖ, హోటళ్లు మొదలైనవి) వాణిజ్య మంత్రిత్వ శాఖతో సహా, కొందరు క్యాబినెట్ మంత్రులు, పాలక, ప్రతిపక్ష పార్టీలు మొదటి నుంచి సెజ్‌లకు వ్యతిరేకంగా ఉన్నాయి. ఇంతకూ పార్లమంట్ లోకి ప్రత్యేక ఆర్థిక మండలాల బిల్లు ప్రవేశపెట్టిన సందర్భంగా ఇది దేశ ఆర్థిక వ్యవస్థపై మోయలేని భారం అని సాక్షాత్తూ ఆర్థికమంత్రి చిదంబరం అన్నారు. బీహార్ రాష్ట్రం అసలు ప్రత్యేక ఆర్థిక మండలాల కోసం ప్రతిపాదనే పంపలేదు. అయితే మన రాష్ట్ర పాలకులు గోవాను ఆదర్శంగా ఆశించడం బాగానే ఉంది, కానీ ఆశలకు పునాది ఉండాలి కదా. లేకపోతే పాలకులు వ్యతిరేకిస్తే లేదా ప్రజలు కోరితే ఆ కోరికలు తీరుస్తారనే భ్రమలు వాస్తవాలు కాదని నందిగ్రాంలో మార్క్సిస్ట్ పార్టీ ప్రభుత్వం రుజువు చేసింది. ఏ జెండా కప్పుకున్నా ఎజెండా ఏది ప్రకటించినా సామ్రాజ్యవాదులను సంతృప్తిపరచడంలో భాగంగా ప్రజలను పాశవికంగా అణచివేయడానికి ఎంతటి దుర్మార్గానికైనా కుతంత్రానికైనా పాల్పడడంలో 'నందిగ్రాం' దేశ ప్రజల ముందుంచిన సజీవ ఉదాహరణ. దేశవ్యాప్త నిరసనలతో పాటు అణు ఒప్పందం – నందిగ్రాం అనే తాడు గుంజుడు ఆటలో చెరొకవైపు కాంగ్రెస్ ఐక్యసంఘటన ప్రభుత్వం కమ్యూనిస్ట్ ఐక్య సంఘటన ప్రభుత్వాల మధ్య ప్రజలు అడకత్తెరలో పోకచక్కలు అయ్యాయి. సెజ్‌లు నందిగ్రాంలో పోయినా రూబార్‌కు తరలినా ప్రజలు నిత్యం నిర్బంధం ఎదుర్కొంటూనే ఉన్నారని తెలుస్తోంది. అందరికీ అణుశక్తి అంత ప్రమాదకరమైన ప్రత్యేక ఆర్థిక మండలాల గురించి అర్థం చేసుకోవాలంటే నందిగ్రాంలో ఏం జరిగిందో, ఏం జరుగుతుందో తెలుసుకోవాలి.

### నందిగ్రాంలో ఏం జరుగుతోంది?

భారతదేశ భ్రష్ట రాజకీయ నైతిక పతనానికి నిలువుటద్దం నందిగ్రాం. ఆయుధాల, గుండాల బలంతో గత ముప్పై సంవత్సరాలుగా పశ్చిమ బెంగాల్ అశేష పేద ప్రజానీకాన్ని నరహోమానికి గురిచేసిన నందిగ్రాం రక్తపాతం సి.పి.ఐ. (ఎం) రాజకీయపు ఎత్తుగడలకీ, అధికారంలో కొనసాగే అసంఖ్యాక వ్యూహాలకీ, మచ్చు తునక. భారతీయ ప్రజాస్వామ్య చరిత్ర పుటలపై నెత్తుటి మరక నందిగ్రాం. 2007 మార్చ్ 14న సంభవించిన బీభత్సభయానక వృత్తాంతాలని ప్రత్యక్షంగా అవలోకించడం కోసం ఇటీవల నందిగ్రాం, సింగూర్ గ్రామాల్లో విస్తృతంగా పర్యటించి అందిస్తున్న నెత్తుటి కన్నీటి దృశ్యాల అక్షర సాక్ష్యం.

సెప్టెంబర్ 1,2,3 తేదీల్లో నందిగ్రాం, సింగూర్ ప్రాంతాల్లో స్త్రీలపై హింసవ్యతిరేక కమిటీ, నిజనిర్ధారణ బృందం పర్యటించింది. సి.పి.ఐ. (ఎం) ప్రభుత్వం నందిగ్రాంలో మళ్ళీ ఒకసారి వ్యూహాత్మక రక్తపాత రాజకీయానికి మరోసారి తెరను లేపింది. మేం గ్రామాలు పర్యటిస్తున్నపుడు ప్రతి గ్రామం, సోనాచుర్, ఖెజోరి, గోకుల్ నగర్ ఈ గ్రామాలూ, గ్రామాల్లో ప్రజలు గుండెలు నివురుగప్పిన నిప్పులా సెగలు పొగలతో ఉడికెత్తి ఉన్నాయి. ఇది త్వరలోనే బద్దలవుతుందని అప్పుడే అనిపించింది. మరోపక్క మేం ఆ ప్రాంతాన్ని పర్యటిస్తున్నపుడు మార్చ్ 14న ఖెజోరి, సోనాచుర గ్రామాలమధ్య కూలిన తల్పట్టి వంతెన కిరువైపులా ఉన్న గ్రామాలు మార్చ్ 14న జరిగిన మారణకాండ తరువాత సి.పి.ఐ. (ఎం) సాయుధ నాయకత్వం, కార్యకర్తలు, ఖెజోరి గ్రామం నుంచి ప్రజలను బయటికి తరిమేసి ఖెజోరిని పూర్తిగా ఆక్రమించారు. అది మేం కళ్లారా చూసాం. మేం అక్కడ కాల్పులు జరిగిన ప్రాంతాన్ని సందర్శించినపుడు మాకు ఆ ప్రదేశంలో సంఘటనలను వివరిస్తున్న భూమి విచ్ఛేద్ ప్రతిరోధ్ కమిటీ కార్యకర్తలు ఎక్కువగా మాట్లాడకండి, గట్టిగా మాట్లాడకండి, మనమీ ప్రాంతంలో ఉన్నట్టు తెలిస్తే, అవతలివైపు ఖెజోరి నుంచి సి.పి.ఐ. (ఎం) వాళ్లు కాల్పులు జరుపుతారు అని హెచ్చరిస్తూనే ఉన్నారు. అయితే మాకు ఆ అనుభవం లేదు గనుక 'ఇక్కడేమయింది, ఇక్కడ తూటాలు గుర్తులు ఉన్నాయే, ఇక్కడ ఆడవాళ్ల చిరిగిన చీరకొంగులున్నాయేమిటి? పగిలిన గాజులున్నాయేమిటి? ఇక్కడ గోడలకు తూటాలు గుర్తులున్నాయేమిటి? మార్చ్ 14న ఎక్కడ ఏమి జరిగింది?' అని వివరాలు అడుగుతుండగా ఆ కొద్దిపాటి శబ్దాలకే అక్కడ పోలీసులు ముగ్గురు ఉండగానే, ఖెజోరిలో ఎర్ర జెండాలెగురుతున్న ఇండ్లల్లోంచి (సి.పి.ఐ.(ఎం) వాళ్ల హైదౌట్స్) తుపాకి శబ్దాలతో పాటు మావైపు తూటాలు ఎగిరివచ్చాయి. మేం అక్కడ నుంచి పరుగు పెట్టక తప్పలేదు. మర్నాడు మేం గోకుల్‌నగర్ వెళ్లాం. గోకుల్‌నగర్ మార్చ్ 14న కాల్పులు జరిగిన రెండోదిక్కు ప్రాంతం. అక్కడ కూడా రాత్రికావడం వల్ల మాలో ముగ్గురు సభ్యులు వెనకబడి పోవటంతో భూమి విచ్ఛేద్ ప్రతిరోద్ కమిటీ (భూ స్వాధీన వ్యతిరేక పోరాట కమిటీ) సభ్యులు గట్టిగా పిలవద్దని చెపుతున్నప్పటికీ, మేం మావాళ్ల కోసం గట్టిగా పిలిచాం. దాంతో అటువైపు నుంచి మళ్లీ కాల్పులు. మాకు అక్కడ అదే పరిస్థితి ఎదురయింది. ఈ గ్రామాలల్లో ప్రజలు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని బతుకుతున్నారన్న విషయం అప్పుడే అర్థమయింది. వాళ్లు ఒక్కటే మాట అడిగారు, 'అమ్మా! మీ రాష్ట్రంలో సి.పి.ఐ. (ఎం) పార్టీ ప్రజలకు భూము లివ్వాలని ఆందోళన చేస్తున్నదట.

ఆ కార్యక్రమాలలో భాగంగా ఖమ్మం జిల్లా ముదిగొండలో భూమి కోసం సి.పి.ఐ. (ఎం) వారు పోరాటం చేస్తున్నపుడు అక్కడ కాంగ్రెస్ ప్రభుత్వం కాల్పులు జరిపిందట. కొందరు మరణించారట. ఆ తరువాత మీ రాష్ట్ర ప్రభుత్వం ప్రజల ఒత్తిడికి తలవంచి కుటుంబాలకు నష్టపరిహారం ఇచ్చిందట. గాయపడిన వారికి వైద్య సహాయం అందించిందట. కమిషన్ వేసిందట. కాల్పులు తప్పని ఒప్పుకొని విచారం ప్రకటించిందట. మాకు నష్టపరిహారం ఇవ్వక పోయినా సరే, ప్రజల పట్ల సానుభూతి కల రచయిత్రి మహాశ్వేతాదేవి, ప్రజలకు మద్దతు ఇచ్చే వైద్యులు కొందరు కలిసి సోనాచురిలో నెలకొల్పిన షహీద్ స్మృతి స్వాస్థ్య కేంద్ర (అమరుల స్మారక వైద్య కేంద్రం) వైద్యులు కాల్పుల్లో గాయపడిన మాకు చికిత్సలు చేస్తూనే ఉన్నారు. కనీసం 'మీ రాష్ట్ర ప్రభుత్వం ఒప్పుకున్నట్టు మా బుద్ధ ప్రభుత్వం విచారం ప్రకటించి తప్పు ఒప్పుకుంటుందా? అట్లా ఒప్పుకోవాలని మీ రాష్ట్రంలోని సి.పి.ఐ. (ఎం) వారు మా ప్రభుత్వానికి చెబుతారా అని మమ్మల్ని అడిగారు' మేమేం చెప్పగలం?

ఈ పరిస్థితి ఇలా ఉంటే, చనిపోయివారు చనిపోగా, తీవ్రంగా గాయపడివారు ఇంకా కోలుకోలేని స్థితిలో ఉండగా, ఆనాడు కాల్పుల్లో గాయపడి, రోడ్డుమీద పడివున్నవారిని పరుగెడుతున్న ప్రజలు కొందరు చూశారు. వారిలో కొందరు మరణిస్తే, కొందరు కొనవూపిరితో ఉన్నవారికి ప్రజలు సహాయం చేద్దామని చూస్తే పోలీసులు వారిని దగ్గరికి రానీయలేదు. అలా కొనవూపిరితో కొట్టుమిట్టాడుతుండగా ప్రజలు, చూసిన కొందరు వ్యక్తులు ఇప్పటికీ గ్రామాలకుగానీ, ఇళ్లకుగానీ తిరిగిరాలేదు. వారేమయ్యారో ఇప్పటికీ తెలియదు. పౌరహక్కుల భాషలో చెప్పాలంటే ఇవన్నీ మిస్సింగ్ కేసులు. ఇలాంటి ఒక మిస్సింగ్ వ్యక్తి ఇంటికి మేం వెళ్లాం. చనిపోయిన వ్యక్తుల ఇళ్లకి వెళ్లినప్పుడు కొంచెం కళ్లు తుడుచుకున్నారు, బాధపడ్డారుగానీ, మార్చ్ 14న తల్పట్టి వంతెన పక్కన చిట్టచివరి సారిగా క్షతగాత్రుడై పడివున్న సుభద్రత సామంత్, గ్రామస్తులు (ఘర్‌చక్రబెరియా) మమ్మల్ని చూడగానే బోరుబోరున విలపించారు. సుభద్రత్ సామంత్ కుటుంబ సభ్యుల దుఃఖాన్ని అయితే మేం అక్కడున్న మూడు నాలుగు గంటలు ఆపలేకపోయాం. చచ్చిన కుటుంబాల్లో ఏడ్చి ఏడ్చి ఊరుకున్నారు. గానీ, చచ్చాడో, బతికాడో తెలియని సామంత్ కుటుంబమూ, ఆ గ్రామస్తులు పడుతున్న క్షోభ అతడేమయ్యాడో తెలిసేవరకూ ఇట్లానే ఉంటుందేమో?

ఖెజోరి గ్రామాన్ని మార్చ్ 14న స్వాధీనం చేసుకున్న సి.పి.ఐ. (ఎం) సాయుధులు ఆ గ్రామం నుంచి 125 కుటుంబాల ప్రజలను బయటికి తరిమారు. అట్లా నిర్వాసితులైన ప్రజలను మేం సోనాచూరిలో భూమి విచ్ఛేద్ ప్రతిరోధ్ కమిటీ నిర్వహిస్తున్న నిర్వాసితుల శిబిరం వద్ద కలిసాం. కమిటీ ప్రతినిధులు జిల్లా అధికారులతో విజ్ఞప్తులు చేయగా చేయగా, ఒక అరవై మందిని స్త్రీలు, వృద్ధులను మాత్రం ఖెజోరి గ్రామంలోకి అనుమతించారని, మిగతావారి గురించీ ఇంకా విజ్ఞప్తులు చేస్తున్నామని చెప్పారు. పరిస్థితి ఇలా ఉంటే ఇప్పుడు బుద్ధదేవుడు ప్రభుత్వం మాత్రం ఆయా గ్రామాలలోకి నిర్వాసితుల్ని తిరిగి ప్రవేశపెట్టడానికి సి.పి.ఎం. కార్యకర్తలూ, ప్రభుత్వ సేనలు కలిసి ఈ వారం రోజులుగా జరుగుతున్న బీభత్సాన్ని చేయక తప్పలేదని అనడం ఎంత అసంబద్ధంగా ఉందో మేధావులూ, ప్రజాస్వామికవాదులూ అర్థం చేసుకోవాలి. అందుకనే 14 మార్చ్ 2007 తరువాత మరింత ఉధృతంగా, మరింత తీవ్రస్థాయిలో బుద్ధదేవుడి ప్రభుత్వం పథకం ప్రకారం జరిపిన వ్యూహాత్మక రక్తపాత రాజకీయం నందిగ్రాంలో ప్రజలు భూములను స్వాధీనం చేసుకుని 'సలీం గ్రూప్ ఆఫ్ బహుళజాతి సంస్థ' కి ధారాదత్తం చేయడానికేనని, దేశవ్యాప్తంగా ప్రజలూ, ప్రజాస్వామికవాదులూ అర్థం చేసుకునే విధంగా నందిగ్రాంపై మారణహోమానికి మరోసారి తెరలేపింది.

## బుద్ధదేవుడి భూమిలో రాజకీయ రక్తపాతం

14 మార్చ్‌కి ముందునుంచే అంటే 2006 నుంచే పశ్చిమబెంగాల్ అధికారపార్టీ, సి.పి.ఐ. (ఎం) సాయుధులు సింగూర్, నందిగ్రాం ప్రజలపై వారి ప్రభుత్వ అండదండలతో దాడులూ, దౌర్జన్యాలూ సాగిస్తూనే ఉన్నారు. పాలకులు పాలిత ప్రజలపై సాగిస్తున్న ఈ ప్రచ్ఛన్నయుద్ధం 2006 డిసెంబర్ 28నే మొదలైంది. హల్దియా (నందిగ్రాంలో ఒక డివిజన్) అభివృద్ధి అధికార సంస్థ డిసెంబర్ 28న నందిగ్రామ్ డివిజన్‌లోని కొన్ని గ్రామాల రైతులకు వారి వ్యవసాయ భూములను, నివాస భూములను ప్రభుత్వానికి స్వాధీనం చేయవలసిందిగా నోటీసులు జారీచేసింది. నందిగ్రాంలో ఇండోనేషియాకి చెందిన బహుళజాతి సంస్థ సలీం గ్రూప్ ఆఫ్ కంపెనీ నందిగ్రాంలో నెలకొల్ప తలపెట్టిన రసాయన పరిశ్రమ కోసం స్పెషల్ ఎకనామిక్ జోన్స్ అంటే ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) కోసం పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఈ భూమిని రైతులనుంచి స్వాధీనం చేసుకోవడానికి చేస్తున్న ప్రయత్నాల్లో భాగమే ఈ నోటీస్. ఈ నోటీస్ ప్రకారం నందిగ్రాం డివిజన్‌లో 1,2,3 బ్లాక్‌ల గ్రామాల్లో (ముఖ్యంగా ఒకటవ బ్లాక్ అత్యధిక విస్తీర్ణ భూమి) 27 మౌజాలు, మరో చోట రెండు మౌజాల (సుమారు 25,000 ఎకరాలు) వ్యవసాయ భూమిని, కొన్ని నివాస భూములను కూడా ప్రభుత్వానికి దఖలు చేయాల్సిందిగా ఆయా భూముల రైతులకు, ఆయా భూముల సర్వే నంబర్లతో సహా నోటీసు జారీ చేసింది. ఈ నోటీసుతో నందిగ్రామ్ ప్రజల్లో ఆందోళన, ఉద్రిక్తత చోటుచేసుకుంది. ఈ విషయాన్ని నిర్ధారించుకోడానికి మరింత స్పష్టంగా తెలుసుకోవడానికి 3 జనవరి 2007న రైతులు 'కాళీ చరణ్‌పూర్' పంచాయతీ ముందు గుమిగూడారు. అక్కడ కొంత ఘర్షణ జరిగింది. ఆ తరవాత జనవరి 7న సి.పి.ఐ. (ఎం) సాయుధులు తల్పట్టి వంతెనవద్ద హత్యాకాండ జరిపారు. ఆరోజు తెల్లవారు జామున సి.పి.ఐ. (ఎం) సాయుధులు బాంబులు, తుపాకులూ, తదితర మారణాయుధాలతో సోనాచురా, ఖెజోరి ప్రజలపై జరిపిన దాడిలో అయిదుగురు మరణించిన విషయాన్ని సిక్కిమ్ హైకోర్ట్ మాజీ ప్రధాన న్యాయమూర్తి ఎస్.ఎన్. భార్గవ ఆధ్వర్యంలో పౌరహక్కులూ, మానవహక్కుల సంస్థల ప్రతినిధులూ, మేధావులూ, ప్రజావైద్యులూ, రచయితల బృందం 2007 మే 26, 27, 28 తేదీలలో నందిగ్రాం, కోల్‌కతాలలో నిర్వహించిన ప్రజా ట్రిబ్యునల్ నివేదిక కూడా ధృవీకరించింది. తల్పట్టి వంతెన పక్కనే ఉన్న స్థానిక సి.పి.ఐ. (ఎం) నాయకుడు శంకర్ సామంత్ నివాసముంటున్న పెద్ద బంగ్లా నుంచి

సి.పి.ఐ. (ఎం) సాయుధులు ప్రజల మీదికి బాంబులు విసిరారనీ, కాల్పులు జరిపారనీ, పరిగెత్తే ప్రజలను వెంటాడి మారణాయుధాలతో గాయపరచారనీ స్థానిక ప్రజలు తెలిపారు. ఈ హత్యాకాండలో విశ్వజిత్ మండల్, షేక్ సలీమ్, బాదల్ మండల్, అనుకూల్ పాత్ర అక్కడికక్కడే మరణించారు. ఈ అయిదుగురు మృతుల కుటుంబ సభ్యులతో మేం మాట్లాడాం. వీరంతా న్యాయమూర్తి భార్గవ ట్రిబ్యునల్ ఎదుట హాజరై సాక్ష్యం చెప్పారు. రోజంతా ఇక్కడ మారణకాండ నిరాఘాటంగా సాగుతూంటే స్థానిక అధికార యంత్రాంగం కానీ, పోలీసు యంత్రాంగం కానీ, ఎంతమాత్రం పట్టించుకోలేదని న్యాయమూర్తి భార్గవ నివేదిక పేర్కొంది. దాడి జరుగుతున్న సమయంలో నందిగ్రామ్ పోలీస్‌స్టేషన్‌కు కొందరు ప్రజలు వెళ్లి ఫిర్యాదు చేసినా, పోలీసులు పోలీస్‌స్టేషన్ నుండి బయటకి ఒక్క అడుగు వేయలేదని చెప్పారు. ఈ విషయాన్ని స్థానిక అధికారులను విచారించిన భార్గవ కమిషన్ న్యాయమూర్తి కూడా ధ్రువీకరించారు. పోలీసులూ, అధికారులూ ఆదుకోకపోవడంతో కోపోద్రిక్తులైన ప్రజలు బాంబులూ, తూటాలూ చొచ్చుకువస్తున్న ఇంటిని భారటూలీ క్యాంపు (తల్పట్టి వంతెన పక్కనున్న శంకర్ సామంత్ పెద్ద బంగ్లా)ను తగలబెట్టారు. అందులో శంకర్ సామంత్ సజీవ దహనమయ్యాడు. అదే రోజు సమీపంలో జరిగిన మరో ఘర్షణలో రెచ్చిపోయిన ప్రజలు సాధూ ఛటర్జీ అనే సబ్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్‌ని రాళ్లు విసిరి, కొట్టి చంపారు. అతని శవం 10న సమీపంలో ఉన్న నదిలో కొట్టుకువచ్చింది.

ఇన్ని దారుణాలు జరిగాకనే 12 ఫిబ్రవరి 2007న హల్దియా పట్టణంలో జరిగిన ఒక బహిరంగసభలో పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్య మాట్లాడుతూ, రైతుల అభీష్టానికి వ్యతిరేకంగా, భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోబోదని హామీ ఇచ్చారు. కానీ ముఖ్యమంత్రి హామీ ఇచ్చిన మరునాడే, ముఖ్యమంత్రి హామీకి విరుద్ధంగా సి.పి.ఐ. (ఎం) స్థానిక పార్లమెంట్ సభ్యులు లక్ష్మణ్ సేథి తమ్లూక్‌లో పత్రికా ప్రతినిధుల సమావేశం ఏర్పాటు చేసి 'హల్దియా అభివృద్ధి అధికార సంస్థ జారీ చేసిన నోటీస్ ప్రకారం రైతుల నుంచి వ్యవసాయ భూములను, నివాస భూములను కూడా ప్రభుత్వం స్వాధీనం చేసుకుని తీరుతుంద'ని ప్రకటించారు. ఇది పశ్చిమ బెంగాల్ మార్క్సిస్ట్ పాలకుల ధోరణి. పార్టీవారు గిచ్చుతారు, ప్రభుత్వం జోలపాడుతుంది. వ్యూహాలూ, పథకాలూ రూపొందించుకుని వ్యూహాత్మక రక్తపాత రాజకీయాలకు ప్రజలను బలిచేస్తారు. జనవరి 14న కాల్పుల ఘటన తరవాత పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోనూ, దేశవ్యాప్తంగానూ ప్రజలూ, ప్రజాస్వామిక వాదులూ మేధావుల నిరసనలూ, ఆందోళన వల్ల, గత ముప్ఫై ఏళ్లుగా మార్క్సిస్ట్ పార్టీ రాజకీయాలనూ, ప్రభుత్వాలనూ సమర్థిస్తూ వారి పక్షాన ఉన్న రచయితలూ, కళాకారులూ, మేధావులూ, ప్రభుత్వ అవార్డులనూ, రివార్డులనూ కూడా వాపసు చేసి, ఒక్కరొక్కరుగా సిపిఐ (ఎం) ప్రభుత్వానికి దూరం కావడంతో, బుద్ధదేవుడు మరోసారి నందిగ్రాం రైతుల నుంచీ భూములను స్వాధీనం చేసుకోబోమని 14 జనవరి 2008 తరువాత నెలరోజులకు, పత్రికలలో దృశ్యప్రసార సాధనాల్లో, సభలలో, సమావేశాలలో పదే పదే ప్రకటనలు చేస్తూ వచ్చారు. బుద్ధదేవుని నోట అబద్ధాల ఊట అన్న వాస్తవానికి నిదర్శనంగా రైతుల నుంచి భూములను స్వాధీనం చేసుకునే ప్రయత్నంలోనే నవంబర్ 2007లో మళ్లీ రక్తపాత రాజకీయ పథకంలో భాగంగా సైన్యాన్ని రప్పించుకుని, బీభత్సం సృష్టించి 7 జనవరి 2008 నుంచి అనేక హత్యాకాండల్లో పాల్గొన్న సిపిఐ (ఎం) పార్టీకి చెందిన నిందితులను (పోలీస్ స్టేషన్‌లలో కేసులు నమోదై ఉన్న వాళ్లని కూడా) నందిగ్రాం డివిజన్‌లోని గ్రామాలకి భద్రంగా చేర్చింది. అరెస్ట్ చేయడానికి దొరకని నిందితులు గ్రామాలకు తిరిగి చేర్చడానికి ఏ విధంగా అందుబాటులోకి వచ్చారో బుద్ధదేవుడూ, ఆయన పార్టీ వాళ్లూ, పోలీసులే చెప్పాలి.

ఇండోనేషియా సలీం కంపెనీ కోసం భూములు స్వాధీనం చేసుకునే ప్రయత్నంలో భాగంగా ప్రజలపై సాయుధ దాడులకు పాల్గొన్న సిపిఐ (ఎం) నాయకులనూ, కార్యకర్తలనూ గ్రామాల్లో పునఃప్రతిష్టించి నందిగ్రాం, ఇతర గ్రామాలను తిరిగి సిపిఐ (ఎం) సాయుధ ముఠాలకు అప్పజెప్పే ప్రయత్నంలో ఆడుతున్న నాటకమే అమెరికాతో భారతదేశ అణు ఒప్పంద వ్యతిరేక నాటకీయ వ్యూహాత్మక పట్టును సడలించడం.

నందిగ్రాం సెజ్ ప్రతిపాదన విరమించుకున్నా, మార్క్సిస్ట్ పార్టీ ప్రభుత్వం ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు క్రమంలో ప్రజలపై ఎంచుకున్న పగను మాత్రం వదులుకోలేదని ఇటీవల భూమి విచ్ఛేద్ ప్రతిరోధ్ కమిటీ ప్రతినిధులు నిత్యం నందిగ్రాంలో మార్క్సిస్ట్ పార్టీ సాయుధ గూండాలు సాగిస్తున్న దౌర్జన్యకాండ, హత్యలు, అత్యాచారాలు, వెల్లడిస్తున్నా అందుకే అప్పుడే కాదు ఇప్పుడు కూడా ప్రజాస్వామిక వాదులు, మేధావులు ప్రజలకు అండగా నిలవాల్సిన అవసరం ఉంది.

మన రాష్ట్రంలో విశాఖ జిల్లా అనంతగిరి మండలం, అరకులోయ ప్రాంతంలో జిందాల్ అల్యూమినా కంపెనీ సెజ్ కోసం ప్రభుత్వం చేస్తున్న భూసేకరణ ప్రయత్నాలను, గిరిజనులు ప్రతిఘటిస్తున్నారు. (ఇది ఏజెన్సీ ప్రాంతం. ఇక్కడ ఏజెన్సీ చట్టాలు, 1/70 చట్టం ప్రకారం గిరిజనుల నుంచి ఏ విధమైన భూబదలాయింపు చేయరాదు. అంటే గిరిజనుల నుంచి భూమిని కొనుక్కోవడం కూడా ఈ చట్టం ఉల్లంఘన కిందికి వస్తుంది) ప్రభుత్వ చట్టాలను ప్రభుత్వమే ఉల్లంఘిస్తున్నదనటానికి ఇంతకంటే నిదర్శనం అవసరం లేదు. భూసేకరణ ప్రయత్నాల్లో భాగంగా, ప్రభుత్వం విశాఖపట్నంలో నిర్వహించిన 'ప్రజాభిప్రాయ సేకరణ' మొదటి సదస్సును ప్రజలు బహిష్కరించారు. రెండవసారి నిర్వహించిన సదస్సులో 99 శాతం మంది ప్రజాభిప్రాయ సదస్సులో పాల్గొని 'సెజ్'ని వ్యతిరేకిస్తూ ఖరాఖండిగా తమ అభిప్రాయాలను నమోదు చేశారు. ఈ విధంగా ప్రజలు రెండుసార్లు ప్రభుత్వ ప్రయత్నాలను విజయవంతంగా తిప్పికొట్టారు. భంగపడిన ప్రభుత్వం, పోలీసులు, ఆ ప్రాంతాలపై 'కూంబింగ్' పేరుతో జరిపిన బీభత్సకాండ ముఖ్యంగా వాకపల్లి గ్రామంలో గిరిజన ప్రాంతాల స్త్రీలపై పోలీసుల హింసాత్మక, లైంగిక దౌర్జన్యాలు రాష్ట్ర ప్రజలకు విదితమే. బాధిత మహిళలు హైదరాబాద్‌లో మానవ హక్కుల కమిషన్‌కు విన్నవించుకున్నా, గిరిజన సంఘాలు హైకోర్టులో, పబ్లిక్ ఇంట్రెస్ట్ లిటిగేషన్ (పి.ఐ.ఎల్.) వేసినా, బాధిత ప్రజలకు సామాజిక మద్దతు, ద్వారా సామాజిక న్యాయం లభించిందే కానీ, చట్టపరమైన న్యాయం దొరకలేదు. ◆

*సెజ్‌ల వల్లత భూములు కోల్పోయిన రైతుల కష్టాలను, ఈ పరిణామాలతో మరిన్ని అవస్థల పాలవుతున్న స్త్రీల పరిస్థితిని వివరిస్తున్నారు* **సాదు రాజేష్**

# ప్రత్యేక ఆర్థిక మండలాలు - మహిళలపై ప్రభావం

అభివృద్ధి ఎలా ఉంటుంది? అభివృద్ధి ఫలాలు ఎవరు అందుకోవాలి? అభివృద్ధి అవసరం ఎవరికి కావాలి? అభివృద్ధిని ఎలా సాధించాలి? ఈ ప్రశ్నలకు నేడు మన ప్రభుత్వాల నూతన అభివృద్ధి సంస్కరణల విధానం స్పష్టంగా తెలియజేస్తోంది. అభివృద్ధి అంటే పచ్చని పంటలతో తులతూగే పల్లె సీమలను విస్తాపనం చేసి వాటి స్థానంలో ధగధగ కాంతులతో మెరిసే హోటల్స్‌ను, సినిమాహాళ్లను, టౌన్‌షిప్‌లను, హబ్‌లను, పబ్‌లను నిర్మించి కొంతమంది ధనికులకు ఆనంద నిలయాలను తయారు చేయడమే అభివృద్ధిగా చెప్పడం జరుగుతోంది. బలవంతంగా పేద, మధ్యతరగతి రైతుల భూములను లాక్కొని వారి జీవితాలను నిర్వాసితం చేసి అభివృద్ధి ఫలాలను అందుకోండి అని చెపుతోంది. విదేశీ మారక ద్రవ్యం కోసం దేశవ్యాప్తంగా లక్షలాది ఎకరాల విస్తీర్ణంలో విదేశీ భూభాగంను సృష్టించడమే అభివృద్ధిగా చెపుతోంది. ఇందుకు ప్రభుత్వం ఎంచుకున్న అభివృద్ధి నమూనా ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) నిర్మాణం.

ఈ సెజ్‌లు దేశవ్యాప్తంగా గ్రామీణ కుటుంబాలు, వ్యవసాయ, వ్యవసాయాధారిత కుటుంబాల ప్రజలు మూకుమ్మడి విస్తాపనలతో తల్లడిల్లుతున్నాయి. ఈ సెజ్ రేపిన సెగ పచ్చని పల్లె జీవితాలను ఛిద్రం చేస్తోంది. ఊసురోమంటున్న రైతులు ప్రాణాలను తీస్తోంది. ఈ సెజ్‌ల నిర్మాణం వెనుక ఈ శతాబ్దపు పెద్ద కుట్ర దాగి ఉంది. ఈ పేరున బహుళజాతి సంస్థల పెట్టుబడులు, దేశీయ పెట్టుబడిదారులు, రియల్ ఎస్టేట్ వ్యాపారులు, నూతన దళారులైన దెవలపర్లు దాగి ఉన్నారు. నాటి ఈస్టిండియా కంపెనీ పాలన తిరిగి సెజ్‌ల రూపంలో రాబోతోందని బుద్ధిజీవులు, ప్రజాస్వామికవాదులు హెచ్చరికలు చేస్తున్నప్పటికీ మన పాలకులు ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ పాలకులు సెజ్‌ల నిర్మాణంలో దేశంలోనే మొదటి స్థానాన్ని ఆక్రమించడం ఆందోళన, ఆశ్చర్యంను కలిగిస్తోంది.

తమ స్వంత భూములలో తమనే కూలీలుగా చేసి, ఎలాంటి హక్కులు, స్వేచ్ఛ లేకుండా చేసే ఈ విధానం అభివృద్ధిలో భాగమే సహజమేనని అంటున్నారు. అభివృద్ధి పేరుతో పేదవాళ్ల గుడిసెలు మాయమైపోతున్నాయి. అనేక సంవత్సరాలుగా తమ తాత ముత్తాతల నుండి పశువులను, వ్యవసాయంను నమ్ముకొని జీవనం గడుపుతున్న రైతు జీవితం కనుమరుగవుతోంది. ఇక వ్యవసాయ పొలాల్లో రైతు, పనిచేసే కూలీ కనిపించరు. వీరంతా తమ భూముల్లోనే నిర్మించబోయే, నిర్మించాలనుకునే, నిర్మిస్తున్న ఫ్యాక్టరీల గేట్లకు సెక్యూరిటీ గార్డులగానో లేక మలినాన్ని శుభ్రం చేసే స్వీపర్‌లుగానో అవతార మెత్తుతున్నారు. ఎటు చూసినా పచ్చగా ఆహ్లాదభరితంగా కనిపించే కోస్తా తీరం కోస్టల్ కారిడార్ పేరుతో పెట్రోల్, రసాయనాల ఫ్యాక్టరీలకు కేంద్రం కాబోతోంది. విశాలమైన జీడిమామిడి, సపోట, కొబ్బరితోటలు కనుమరుగై అభివృద్ధి పేరుతో వస్తు ఉత్పత్తి ఎగుమతి కేంద్రాలు పుట్టుకొస్తున్నాయి.

ఆరుగాలం కష్టపడే రైతు సెజ్‌ల వలన భూమికోల్పోయి, తన భూమిచుట్టూ ముళ్లకంచెను నిర్మించి, భవనాలు నిర్మిస్తుంటే ఆ నిర్మాణంకై తనే కూలీగా మారి ఇటుకలను అందిస్తూ జీవచ్ఛవంలా ఏమి చేయలేక కుమిలిపోతూ ఏడుస్తూ... ఏడుస్తూ గుండె బరువెక్కి చివరికి గుండె ఆగిపోతే తన చితికి ఆరడుగుల నేల దొరకని దైన్యస్థితి సెజ్ నిర్మాణ ప్రాంతాల్లో నెలకొంది. తాము కోల్పోయిన భూములకు సరియైన నష్టపరిహారం, పునరావాసం కల్పించండి అని అడిగితే జైలు గోడలేదిక్కవుతున్నాయి. 'మా భూములు లాక్కోవడం మూలంగానే తమ భర్తలు చనిపోయారని రైతుల భార్యలు, పిల్లలు ఆవేదనతో ఆందోళన చేస్తున్నా, ఈ ఆవేదనలు, ఆందోళనలు అభివృద్ధి రథచక్రాల కింద నలిగిపోతున్నాయి. కుటుంబ యజమాని చనిపోయి భారమంతా మహిళల పై పడటం మూలంగా అప్పులను తీర్చలేక, పనులు దొరక్క, పిల్లలను సాకలేక బాధ్యతలను నేరవేర్చలేని అయోమయ స్థితిలో ఉండటం విచారకరం. 'మా భూమి మాకు కావాలి, మాకు కంపెనీల కూలీ వద్దు' అని సెజ్ బాధిత స్త్రీలంతా ఆందోళనకు సిద్ధమవుతున్నారు. భూమినే నమ్ముకొని జీవిస్తున్నందుకే పుట్టెడు దుఃఖం, వేలకొలది అప్పులు బహుమతులుగా మిగిలిపోతున్నాయి. తమ భూముల్లోనే తాము వలస జీవుల్లాగా బతకాల్సిన పరిస్థితి నెలకొంది. అది సత్యవేడు కావచ్చు, కాకినాడ కావచ్చు, పోలేపల్లి కావచ్చు ప్రాంతాలు వేరైనా మహిళల బాధలు ఒకటే. సమాజంలో ఇప్పటికే అనేక అసమానతలతో హింసకు గురి అవుతున్న మహిళల జీవితాలపై రాజ్యం అభివృద్ధి పేరుతో భయ భ్రాంతులకు గురిచేస్తూ జీవితాలను అభద్రతాభావంలోకి నెట్టివేస్తోంది. నమ్ముకున్న భూమి కోసం మహిళలు అనుభవిస్తున్న బాధలను పరిశీలించాల్సి అవసరం ఉంది.

మన రాష్ట్రంలో మొదట చిత్తూరు జిల్లా సత్యవేడు, వరదయాపాళెం మండలాల పరిధిలో 'శ్రీ సిటీ కంపెనీ' భూసేకరణను ప్రారంభించింది. మొదటగా కొంతమంది రైతులు డబ్బు ఆశకు అమ్ముకోవడం జరిగింది.

ఈ మండలం పరిధిలో 12 వేల ఎకరాల భూమిని సేకరించారు. 12 గ్రామాలు ఖాళీ అవుతున్నాయి. బలవంతంగా పట్టా భూములకు మూడున్నర లక్షలు, పట్టాకాని భూమికి రెండున్నర లక్షల రూపాయలు ఇచ్చి తీసుకున్నారు. భూమిపై ఆధారపడి పెట్టుబడులకు అప్పులు ఇచ్చిన వాళ్లు ఇబ్బందులు పెట్టడంతో కొంతమంది బలవన్మరణాలు పొందటం, అనారోగ్యంతో చనిపోవడంతో మహిళలపై కుటుంబ భారం ఎక్కువయ్యింది. శాకమూరి పద్మావతమ్మ (70) వరదాయపాళెం మండలం మోపురుపల్లి గ్రామవాస్తవ్యురాలు. ఈమె కొడుకు నాలుగు సంవత్సరాల క్రితం అనారోగ్యంతో చనిపోవడం, సెజ్ వచ్చి వీరికున్న ఆరు ఎకరాల భూమి పోవడంతో బతకడం ఇబ్బందిగా మారింది. తను ఆవేదనతో ఇలా అంటోంది. 'కయ్యతో పొరకవాడినా మొగోడి మాదిర్తో సెద్దిం జెసినా, పియ్యిదినో, పిడకలేరో గుట్టుగా సంసారం జేసినం, ఆ కష్టమంతా నాశనం అయిపోయింది. అదేందో సెజ్ అంటా, వాళ్లకి దూము తగల...... మా భూములే కావాల్సిచ్చేనాయ్. ఫ్యాక్టరీలు కడతరంటా, ఇంటింటికి ఉజ్జోగలంటా, మాకొద్దు సామీ.... మామానాన మమ్మల్ని బతుకనియ్యండి అని కాళ్లావెళ్లబడి బతిమిలాడినం. భూమి పోతే ఏమి? ఇగంతా బంగారమే అని చెప్పినారు. కాయితాల్లో ఎందెందో రాసుకున్నారు. మాకు భూమి తల్లికి బంధం తెగిపోయింది. మడకగట్టి, అడుసు తొక్కా, నాట్లేసిన మా భూములు చూడబోము ఇప్పుడం'టూ గుండె బరువుతో తన ఆవేదనను తెలియజేసింది. పద్మావతమ్మ లాంటి మహిళలు అనేకమంది కుటుంబ భారాలను భరించలేక, నిస్సహాయ స్థితిలో ఆపన్నహస్తం కోసం ఎదురుచూస్తున్నారు. కానీ ఇప్పటికీ శ్రీసిటీ యజమాన్యం ఏయే కంపెనీలను ఏర్పాటు చేస్తున్నారో స్పష్టత లేదు.

సత్యవేడు తరువాత ఆంధ్రప్రాంతంలో కాకినాడ ప్రత్యేక ఆర్థిక మండలాల ఆందోళనలో ఎక్కువగా మహిళలు భాగస్వాములవుతున్నారు. తూర్పు గోదావరి జిల్లా అనగానే ఆహారధాన్యాల ఉత్పత్తిలో అగ్రగామిగా ఉంది. మొదట కాకినాడ సెజ్ 10,500 ఎకరాల విస్తీర్ణంలో ఏర్పాటు చేయాలనుకున్నారు. కానీ ప్రస్తుతం 12,500 ఎకరాల భూమిని సేకరిస్తున్నారు. కాకినాడ దగ్గర సహజవాయు నిక్షేపాలు బాగా ఉన్నాయి. కాబట్టి ఓ.ఎన్.జి.సి. వారికి శుద్ధి కర్మగారం (రిఫైనరీ) నెలకొల్పడానికి ఇవ్వాలని ప్రభుత్వం అనుకుంది. ఈ సెజ్ ఏర్పాటు వలన యు కొత్తపల్లి, తొండంగి మండలాల్లో సుమారు 16 గ్రామాలు ధ్వంసం అయిపోయినాయి. కాకినాడ సెజ్‌కు వ్యతిరేకంగా ఆందోళన చేస్తే తమ భర్తలను అరెస్ట్ చేసి జైలులో పెట్టారు. మా అనుమతి లేకుండా మా భూములను లాక్కొంటున్నారు. ఇదెక్కడి న్యాయం అంటూ ప్రశ్నించిన మహిళలు అని చూడకుండానే లాఠీలతోని సమాధానం చెప్పుతున్నా రంటున్నారు. 'మమ్మల్ని కబేళాలకు తరలించండి' అన్న స్త్రీల ఆర్తనాదాలు ప్రతి గ్రామంలో వినిపిస్తున్నాయి. అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకొని మార్చ్ 8న 'మహిళా ఆక్రందన దినంగా' ఇక్కడి మహిళలు ఆందోళన చేసారు. ప్రత్యేకంగా సెజ్ వ్యతిరేక మహిళా సంఘంను కూడా ఏర్పాటు చేసుకున్నారు. అంటే ఎస్.ఇ.జెడ్. గ్రామీణ జీవనం మీద ప్రభావంతోపాటు మహిళలపై ఎక్కువ ప్రభావాన్ని చూపుతోంది. కాకినాడ సెజ్ బాధిత మహిళల మనోభావాలను పరిశీలిస్తే చాలా విషయాలు అర్థమవుతాయి.

పాటి గంగానాగేశ్వరమ్మ (38) యు. కొత్తపల్లి మండలం, శ్రీరాంపురం గ్రామ నివాసి. తన ఆవేదనను ఈ విధంగా వెల్లిబుచ్చింది, 'మా భూములు పనికిరావని, నిస్సారమయినవని, పంటలు పండవని, రెవెన్యూ అధికారులు, ప్రైవేట్ వ్యాపారులు బెదిరించి లాక్కున్నారు. మా భర్తలను జైలుకు పంపారు. ప్రతి సంవత్సరం మూడు పంటలు పండుతున్నాయి. ఈ సెజ్ వస్తుందని గత రెండు సంవత్సరాల నుండి ఒక్కపూట తిండి మాత్రమే తింటున్నాం. మాకు ఓ పండుగా లేదు, సంతోషం లేదు. ఏ రాత్రి పోలీసోల్లు వచ్చి మా భర్తలను, పిల్లలను తీసుకుపోతారనే బెంగతో ఉన్నాం. మా బాధలను తీరుస్తాడని చంద్రబాబును ఓడించి వై.ఎస్.ను గెలిపిస్తే మా పంట పొలాలను లాక్కోమని ఆజ్ఞాపించాడు. మేం ఎలా బతకాలి? మాకు పంచభక్ష పరమాన్నం వద్దు. ఏ చెట్టు కాయో పండో తిని బతుకుతున్నాం. కానీ మా భూములని మాత్రం వదిలివెళ్లం. ఈ సెజ్ వచ్చాకే మాకు, మా భర్తలతో బెంగ మొదలయ్యింది. రొజుకొక గండంగా జీవచ్ఛవంలాగా బతుకుతున్నాం. మా పిల్లల్ని చదువుకు కూడా పంపించలేని స్థితిలో ఉన్నాం. ఎవరు సహాయం చేసినా వాళ్లకు చేతులెత్తి దండం పెడుతాం' అని అంటోంది. కాకినాడ సెజ్‌లో భూములు మొత్తం సారవంతమయిన భూములు. మాకు ఏ ఫ్యాక్టరీలో ఉద్యోగాలు అవసరం లేదు. మా పిల్లలు ఇప్పుడిప్పుడే చదువుకుంటున్నారు. కొంతమంది స్త్రీలు తమ భర్తలు వలస వెళ్లారని, వచ్చిన ఆ కొద్ది డబ్బులతో జల్సా చేయడం మూలంగా ఏ పని లేకపోవడం భారం అంతా మా పైననే పడుతుందని ఆవేదనతో వెల్లడిస్తున్నారు.

మన రాష్ట్రంలో మహిళల జీవితాలలో చీకట్లను, కడగండ్లను నింపి నిస్సహాయ స్థితిలో పడవేసిన సెజ్ మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల దగ్గరి పోలేపల్లి ఎస్.ఇ.జెడ్. దాదాపుగా నలభై కుటుంబాల యజమానులు గుండె బరువెక్కి, భూములు పోయాయనే ఆవేదనతో బలవన్మరణాలను పొందారు. మొదట 2003లో పోలేపల్లి వద్ద 969 ఎకరాల భూమిని ఏ.పి.ఐ.సి.సి. సేకరించింది. ఔషధ కంపెనీల కోసం ఈ భూమిని సేకరించింది. పోలేపల్లి సెజ్‌తో రాష్ట్రంలో రోజుకొక అమాయక రైతు బలవన్మరణాలను పొందుతున్నారు. ఇక్కడి మహిళలు ఆందోళన కరమయిన దుస్థితిలో ఉన్నారు. సిరులు పండించే రైతులు ఊపిరులు పోతున్నాయి. అందుకే న్యాయం కావాలని మహిళలు ఉద్యమిస్తున్నారు. పోలేపల్లి సెజ్‌లో ఒక్కొక్కరిది ఒక్కొక్కరకమయిన బాధ. అందరూ బాధితులే. అభివృద్ధి కోసమని భూమిని లాక్కొన్నారు. భూమికోసం పోలేపల్లి, గుండ్లగడ్డ తండావాసులు మూడు నెలల పాటు చెట్టుకిందనే వంటలు చేసుకోని పోరుచేసారు. స్త్రీలను పోలీస్‌వాళ్లు విచక్షణారహితంగా కొడుతూ, అసభ్యంగా తిడుతూ, ఎక్కడ పడితే అక్కడ చేతులు వేస్తూ అసభ్యంగా ప్రవర్తించారని పోలేపల్లి నివాసి చుక్కమ్మ ఆవేదనతో అంది. చుక్కమ్మ భర్త నర్సయ్యకు మూడున్నర ఎకరాల భూమి ఉండేది. భూమి లాక్కోవడంతో మనోవేదనతో ఆరు నెలలకే చనిపోయాడు. చుక్కమ్మకు నలుగురు మగపిల్లలు. అందులో ఒకరు పదవ తరగతి, ఒకరు ఇంటర్ చదువులు అయిపోయి అరబిందో కంపెనీలో కూలీలుగా మారిపోయారు. ఆర్.డి.ఓ., కలెక్టర్, పోలీస్ వాళ్లకు భయపడకుండా ఎదురు తిరిగినా చుక్కమ్మ తన భర్త ఫోటో

*సెజ్‌ల వలన సాగుభూమి, తాగునీరు, సాగునీరు, పర్యావరణాలను రైతులు నష్టపోతున్నారని, మొత్తంగా ఇదొక సామాజిక విధ్వంసం అని అంటున్నారు* **పి.వి. రమణ**

# ప్రజాజీవితాన్ని నాశనం చేస్తున్న సెజ్‌లు

దేశంలో ఎగుమతులకు ప్రోత్సాహం ఇవ్వటం, పారిశ్రామికీకరణ ద్వారా కోట్లాది ఉద్యోగ అవకాశాలు కల్పించడం లక్ష్యాలుగా పార్లమెంట్ లో 23 జూన్ 2005న ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టం (సెజ్) అమలులోకి తెచ్చింది మన ప్రభుత్వం. నిజానికి వ్యవసాయాన్ని దెబ్బ తీయడం, బడా పారిశ్రామికవేత్తలకు, బహుళజాతి కంపెనీలకు సేవ చేయటమనే సామ్రాజ్యవాద విధానలలో భాగమే ఈ సెజ్‌ల ఏర్పాటని ఆచరణలో మనకు అర్థం అయింది. 'సెజ్'ల చట్టం అమలులోకి వచ్చి కేవలం మూడు సంవత్సరాలు దాటకుండానే జరిగిన వనరుల విధ్వంసం, పర్యావరణ నాశనం, ఆహార అభద్రత లాంటి సమస్యల్ని చూస్తుంటే ప్రఖ్యాత చరిత్రకారుడు సుమిత్ సర్కార్ 'సెజ్‌ల పేరిట ఆధునిక చరిత్రలో అతి పెద్ద భూ ఆక్రమణకు దారితీయబోతోంది' అని చెప్పిన మాట అక్షరాల రుజువయింది. అలాగే ఆర్థిక శాస్త్రవేత్త అమిత్ బాధురి 'అభివృద్ధి తీవ్రవాదం'గా గుర్తించిన ఈ విధానాలు భవిష్యత్‌లో మరెంత ప్రమాదకరంగా పరిణమిస్తాయో గ్రహించవచ్చు.

గత జనవరి 4న కాంగ్రెస్ సీనియర్ నాయకుడు మాజీ కర్ణాటక ముఖ్యమంత్రి అయిన వీరప్ప మొయిలీ 'సెజ్‌ల కన్న ముందే ఎక్స్‌క్లూజివ్ ఎకనమిక్ జోన్ (ఇఇజెడ్) లు 1965లలో ప్రారంభమై, ఒక్క కాండ్లాలో తప్ప మిగిలినవన్నీ తమ లక్ష్యాన్ని సాధించలేకపోయాయి. సెజ్‌ల వల్ల సంపద అంతా కొద్ది మందికే చెందే పరిస్థితికి దారితీసే ప్రమాదం ఉంది. ప్రభుత్వ నిఘా లేకపోతే సెజ్‌లు పూర్తి రియల్ ఎస్టేట్‌లుగా

---

చూస్తూ కుమిలి కుమిలి ఏడుస్తోంది. కింద నుండి పై దాకా అధికారులు మొత్తం మా భూములను లాకోకవటంలో సూత్రధరులేనని అంటోంది. కంపెనీలో కూలీకి వెళితే అనేక అమానవీయమయిన మాటలతో దూషిస్తున్నారని చెప్పింది.

అంజమ్మది రెండుఎకరాల భూమి పోయింది. భర్త చనిపోవడంతో అప్పులు తీర్చడానికి ఊరోదిలి వేరే ఊరిలో కూలీ పని చేసుకొని అప్పు తీర్చుకుంటోంది. ఎల్లమ్మి వచ్చిన పైసలతో కొడుకు కోడల్ని సాదింది. ఈమె భర్త 2006లో చనిపోయాడు. పోయిన తన పొలం చూసి వస్తానని చెప్పి పొలంలో కూర్చోని కుమిలి కుమిలి అక్కడే కుప్పకూలిపోయాడు. ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకపోతే నిర్లక్ష్యం కారణంగా చనిపోయాడు. అంజమ్మ ఇప్పుడు కొడుకు, కోడలితో జీవచ్ఛవంలా ఉంది. భర్త ఫోటోను గుండెలకదుముకుంటూ ఏడుస్తోంది. 'భూమికోసం ధర్నా చేస్తే - చెట్టుకింద అన్నం తింటుంటే గిన్నెల్ని కాళ్లతో తన్ని తీసుకపోయి జీపుల ఎసింద్రు. అల్ల గిన్నెల గుడంగ మెతుకు ఉండదు' అని ఆక్రోశించింది.

పోలేపల్లి సెజ్ కుటుంబ సంబంధాలలో, మానవీయ బంధాలలో కూడా చిచ్చును రేపుతోంది. భూమి పోవడంతో ఇల్లరికం వచ్చిన అల్లుడు బిడ్డను వదిలివెళ్లాడని ఒక రైతు బాధపడితే, అల్లుడుకు భూమి లేదని బిడ్డను తండ్రి తిసుకుపోవడం లాంటి ఘటనలు కూడా ఇదే గ్రామంలో ఉన్నాయి.

సారవంతమయిన భూములుపోయి, నిస్సహాయ స్థితిలో, జీవిచ్ఛవంలా భర్తలు చనిపోవడంతో గుండె బరువుతో మహిళలు జీవిస్తున్నారు. ఏదో కొంత ఉపాధితో పిల్లలను బతికించుకుంటున్నారు. మనసు చంపుకొని ఫ్యాక్టరీల్లో కూలీకి వెళితే అక్కడి వెకిలి మాటలతో బనాయిస్తున్నారు. స్త్రీల పట్ల నీచంగా ప్రవర్తిస్తూ, కనీసం మూత్రానికి పోయినా దానికే పోయినవని సాక్ష్యం ఏంటి అని అనుమానిస్తున్నారని అంటున్నారు. ఉదయాన్నే ఇండ్లల్లో పనిచేసి తొమ్మిది గంటలకల్లా ఫ్యాక్టరీలకు చేరుకోవాలి. ఒక్క నిమిషం ఆలస్యం అయినా సెక్యూరిటీ గార్డ్‌లతో తరిమివేస్తారు. మధ్యాహ్నం సరిగ్గా భోజనం కూడా చేయలేని పరిస్థితి ఉంది. ఉద్యోగ భద్రత లేదు. ఎలాంటి హక్కుల్లేవు. బానిసల్లాగా చూడటంతో దిక్కుతోచని స్థితిలో ఇక్కడి ప్రజలు బతుకుతున్నారు.

ప్రత్యేక ఆర్థిక మండలాలు అభివృద్ధికి నిలయాలుగా మారుస్తామని, వస్తు ఉత్పత్తి ఎగుమతి చేయడానికే ఇవి ఎక్కువగా ఉపయోగపడతాయని చెప్తూనే కనీసం మర్యాదగా జీవించలేని పరిస్థితిని సృష్టిస్తున్నారు. అభివృద్ధి మంత్రం అమాయక పేదలకు అభయ హస్తానివ్వాలి కాని నిరాశ్రయులను చేయడం ఎంతవరకు సమంజసం. ఈ సెజ్‌లవలన మహిళలే ఎక్కువగా బాధపడే పరిస్థితి ఉంది. ఇందిరమ్మ రాజ్యం అంటూ ప్రభుత్వం చెప్తున్నా మహిళలకు సెజ్‌ల వలన రక్షణలేకుండా పోతోంది. అభివృద్ధి ఫలాలను అందుకునే స్థితిలో లేరు. అభివృద్ధికి ఆమడదూరంలోనే ఇంకా ఉంటున్నారు. ఈ సెజ్‌లు దేశ వ్యాప్తంగా రియల్‌ఎస్టేట్ వ్యాపారంగా మారాయి. ఏ కంపెనీలు ఏర్పడుతాయోననే స్పష్టత లేకుండా భూములను సేకరించడం మూలంగా రైతులు చనిపోయివారి భార్యా పిల్లల మనోవ్యథ ప్రభుత్వాలకు పట్టడం లేదు. ఈ ప్రజాస్వామిక దేశంలో దేశానికి అన్నంపెట్టే రైతు విలవిల్లాడి పోయి ఆత్మహత్య చేసుకుంటుంటే వారి శవాలమీద ఫ్యాక్టరీలను నిర్మించి, బహుళజాతి సంస్థలను ఆహ్వానించి భవనాలు లేపుతున్నారు. ఇవి వాస్తవానికి అభివృద్ధిని ప్రజలకు అందించగలిగేవేనా? ◆

మారిపోయి ప్రజల్ని తీరని కష్టాలకు గురిచేస్తాయి' అని హెచ్చరించటం, అలాగే జనవరి 22న ఆర్థికమంత్రి చిదంబరం, మంత్రుల గ్రూప్ సమావేశంలో 'సెజ్‌లకు నేను వ్యతిరేకం కాదు, కాని అజాగ్రత్తగా అమలు చేస్తే చాలా ప్రమాదం ఉంది. ఆర్థిక శాఖకు వీటిపై అనేక అభ్యంతరాలున్నాయి. భారతదేశంలో రైతుకు, భూమికి పవిత్రబంధం ఉంది. దాన్ని తొలగించాలనుకున్నప్పుడు చాల జాగ్రత్త అవసరం. దాన్ని తేలికగా తీసుకొంటే పొరపాటే. అదొక మైన్‌ఫీల్డ్' అని ఆనాడు అనటం ప్రమాదాన్ని గుర్తించనట్లే కనబడుతుంది గానీ, చట్టం అమలులో వేగం చూస్తుంటే ఆ అభిప్రాయాలకు విలువ ఇవ్వలేదని రుజువయిపోయింది. ఆర్థిక మంత్రిత్వశాఖ అంచనా ప్రకారమే 'సెజ్‌ల మొత్తం పెట్టుబడి 3,60,000 కోట్ల రూపాయలైతే, టాక్స్‌లు, డ్యూటీలు మినహాయింపుల వలన, ప్రభుత్వానికి 1,74,000 కోట్ల రూపాయల రెవెన్యూ నష్టం వస్తుందని' చెప్పినా లెక్కచెయ్యకుండా బడా పెట్టుబడిదార్లకు, బహుళజాతి కంపెనీలకు లాభాలు చేకూర్చటానికి పాలకులు ఎంత తొందరపడుతున్నారో మనకు తెలుస్తుంది.

### బహుళజాతి కంపెనీల చేతుల్లో రియల్ ఎస్టేట్ వ్యాపారం

సెజ్‌ల కోసం అధికంగా అన్ని సదుపాయాలు గల ప్రధాన నగరాల చుట్టూ ఉన్న భూముల కోసమే బహుళజాతి కంపెనీలు, పారిశ్రామికవేత్తలు, డిమాండ్ చేస్తున్నారంటే కేవలం రియల్ ఎస్టేట్ వ్యాపారం కోసమే.

'అసోచామ్' రిపోర్ట్ ప్రకారం 'నేటికి 130 సెజ్‌లకు కేటాయించిన భూమిలో యాభై శాతం పూర్తిగా రియల్ ఎస్టేట్ కోసమే', అక్టోబర్ 2006 నాటికి సెజ్‌ల అనుమతి పొందిన వాటిలో అరవై శాతం రియల్ ఎస్టేట్ కంపెనీల వారివే.

బహుళజాతి సంస్థ 'మెర్రిక్‌లించ్' అంచనా ప్రకారం 'భారతదేశంలో 2005లో 12 బిలియన్ డాలర్ల రియల్ ఎస్టేట్ వ్యాపార అవకాశాలుండగా, 2015 నాటికి 90 బిలియన్ డాలర్లకు పెరుగుతుంది', 'ఆసియాలోకల్లా భారతదేశంలో రియల్ ఎస్టేట్ వ్యాపారానికి ఎక్కువ అనుకూల పరిస్థితులున్నాయ'ని గోల్డెన్ ఫాక్స్ ఆసియా రియల్ ఎస్టేట్ అధిపతి మైఖేల్ స్మిత్ అన్నాడు. కేవలం విదేశీ రియల్ ఎస్టేట్ కంపెనీలు 2.7 బిలియన్ డాలర్లు భారత్‌లో రియల్ ఎస్టేట్ వ్యాపారంలో పెట్టుబడి పెట్టడానికి సిద్ధంగా ఉన్నాయి. ఇంకా జె.పి. మోర్గన్, 'నైట్‌ఫ్రాంక్' లాంటి బడా విదేశీ బహుళజాతి కంపెనీలు మరో నాలుగు బిలియన్ డాలర్లు పెట్టుబడికి సిద్ధమవుతున్నాయి. 'అసోచామ్' రిపోర్ట్ ప్రకారమే భారత్‌కు వచ్చే మొత్తం విదేశీ పెట్టుబడుల్లో (ఎఫ్.డి.ఐ.) 2003లో 2.7 బిలియన్ డాలర్లుంటే అందులో రియల్ ఎస్టేట్ శాతం 4.5 మాత్రమే. 2006 నాటికి 8 బిలియన్ డాలర్లు మొత్తం పెట్టుబడులలో 26 శాతానికి పెరిగిపోయింది.

భారత్‌లో అతిపెద్ద రియల్ ఎస్టేట్ కంపెనీ 'యూనిటెక్' గత సంవత్సరం చివరి భాగంలో 452 కోట్ల రూపాయల లాభం గడించింది. అంతకు ముందు సంవత్సరం కేవలం పదుమూడు కోట్ల రూపాయలు మాత్రమే. అంటే 31.90 శాతం లాభం పెరిగిందన్నమాట. దాంతో వారి షేర్ల విలువ విపరీతంగా పెరిగిపోయి మార్చ్ 2004 నాటి నుండి డిసెంబర్ 2006 మధ్య 324 కోట్ల రూపాయల నుండి 37,894 కోట్ల రూపాయలకు పెరిగింది. అంటే 11,561 శాతం అన్నమాట.

గుజరాత్‌లో మోడి ప్రభుత్వం అదోని గ్రూప్ కంపెనీకి ముంద్రాపోర్ట్ సెజ్ కోసం చదరపు గజం యాభై పైసలకు అమ్మింది. ఆ కంపెనీ దాన్ని చదరపు గజం 1200 రూపాయల చొప్పున అమ్ముకుంది. ఈ విధంగా ఇరవై వేల కోట్ల రూపాయల ఖరీదు చేసే భూమిని కేవలం ఎనిమిది కోట్ల రూపాయలకు పొందగలిగారు.

రియల్ ఎస్టేట్ డెవలప్‌మెంట్ సంస్థ 'పార్శ్వనాథ్' చైర్మన్ ప్రదీప్ జైన్ ప్రస్తుతం హైదరాబాద్, ఇండోర్, గుర్‌గాంవ్, డెహ్రాడూన్, నాందేడ్‌లలో సెజ్ పనులు ప్రారంభిస్తున్నారు. ప్రస్తుతం 7.6 కోట్ల చదరపు అడుగుల నుండి 20.9 కోట్ల చదరపు అడుగుల భూమి వారి స్వాధీనంలో ఉంది.

### పంటపొలాల ఆక్రమణ

ఇప్పటికే ప్రపంచీకరణ విధానాల ఫలితంగా వ్యవసాయ భూమి చాలా తగ్గిపోయింది. మొత్తం దేశంలో 46 శాతం వ్యవసాయ భూమి ఉండగా 1990-2003 మధ్య పదమూడు సంవత్సరాలలో 1.5 శాతం తగ్గిపోయింది. చూస్తే చాలా తక్కువశాతం కింద కనబడుతుంది, కాని ఆ భూమి 21 లక్షల హెక్టార్లు. ఇక సెజ్‌ల కోసం బంగారు పంటలు పండే పంట భూముల్ని బలవంతంగా స్వాధీనం చేసుకోవటంతో వ్యవసాయ భూమి మరింత కుంచించుకుపోయి దేశ ఆహార భద్రతకే పెద్ద ప్రమాదంగా మారింది.

అత్యధిక వ్యవసాయ భూమి కలిగి ఉన్న రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్‌లలో సెజ్‌లకోసం కేటాయించిన భూమిలో డెబ్బై శాతం ఈ రాష్ట్రాలదే. దేశ ఆహార అవసరాలు తీరుస్తున్న రాష్ట్రాలైన హర్యానా, పంజాబ్‌లలో కూడా వేలాది ఎకరాల పంట భూముల్ని సెజ్‌ల కోసం కేటాయిస్తున్నారు.

విశాఖ జిల్లా అచ్చుతాపురం, రాంబిల్లి మండలాల్లో మెగా కెమికల్ కాంప్లెక్స్‌ల కోసం పది వేల ఎకరాలు, నక్కపల్లిలో ఎనిమిది వేల ఎకరాలు కేటాయించారు. మహబూబ్‌నగర్ జిల్లాలో పోలేపల్లి, చిత్తూరు జిల్లాలో సత్యవేడు, వరదయ్యపాలెం, నెల్లూరు జిల్లా అక్కంపేట, మాంబట్టు, కంద్రీగ గ్రామాలలో వేలాది ఎకరాల భూమిని సెజ్‌లకు కేటాయించారు. వీటిలో అత్యధిక భాగం పంట భూములే.

కేరళలో 1980లో పది లక్షల హెక్టార్ల సాగు భూమి ఉంటే నేడు 3.5 లక్షల హెక్టార్లకు పడిపోయింది. హిమాచల్‌ప్రదేశ్‌లో 1991 నుండి 2001 వరకు పది సంవత్సరాల్లో 33 వేల ఎకరాల వ్యవసాయం తగ్గిపోయింది. దేశంలో బడా రియల్ ఎస్టేట్ కంపెనీలు ఎమ్మార్, ఎం.జి.ఎఫ్. ల చేతికి నాలుగు వేల హెక్టార్లు, డి.ఎల్.ఎఫ్. కంపెనీకి 3500 హెక్టార్లు ధారాదత్తం చేయబడింది.

హైదరాబాద్ చుట్టూ ఉన్న ఇరవై అయిదు మండలాల్లో తొంభై వేల హెక్టార్ల భూమి గత అయిదు సంవత్సరాలలో వ్యవసాయం నుండి ఇతర అవసరాలకు మార్పు చెందింది. పురాణాలలో హిరణ్యాక్షుడు భూమి అంతా చాపలాగ చుట్టినాడని కథలు విన్నాం గాని నేడు మన కళ్లెదుటే సామ్రాజ్యవాద అనుకూల శక్తుల చేతుల్లోకి మొత్తం భూమంతా

ప్రభుత్వమే ధారపోయడం వలన ఎంత సామాజిక విధ్వంసం జరగబోతుందో ఊహించగలం.

### నీటి కొరత ప్రమాదం

లక్షలాది ఎకరాల భూముల్ని సెజ్‌ల కోసం కేటాయించి, వాటి నీటి అవసరాలు తీర్చటమే ప్రధానంగా మారడంతో, దేశంలో వ్యవసాయానికి, అలాగే ప్రజల తాగునీటి అవసరాలకు తీరని కొరత ఏర్పడుతుంది.

వ్యవసాయ భూముల అవసరాలు తీరుస్తున్న భూమిలో ఉన్న నీటినే కాకుండా, అనేక నదులు, రిజర్వాయర్లు, సెజ్‌ల అవసరాల కోసం కేటాయించడంతో మరింత నీటి కొరత ఏర్పడే ప్రమాదం ముంచుకువస్తోంది.

మన రాష్ట్రంలో 'వైట్ ఫీల్డ్ పేపర్ మిల్స్' కోసం గోదావరి నదికి అయిదు కిలోమీటర్ల దూరంలో కేటాయించిన సెజ్ కోసం రోజుకు 100 మిలియన్ లీటర్ల నీటి వాడకానికి ప్రభుత్వం పర్మిషన్ ఇచ్చింది. గుజరాత్‌లో అదోని గ్రూప్ ఆధ్వర్యంలో నిర్మించిన ముంద్రా పోర్ట్ సెజ్ కోసం రోజుకు ఆరు మిలియన్ లీటర్ల నీటిని నర్మదా నది నుండి తీసుకోవటానికి అనుమతినిచ్చారు. ఇది ఇంకా పెరిగే అవకాశం ఉంది. హైదరాబాద్‌లో 'ఫాబ్ సిటీ సెజ్' కోసం ఏకంగా ఒక పైపు లైన్ వేసి దాని ద్వారా రోజుకు ఇరవై మిలియన్ లీటర్ల వరకు నీటిని సరఫరా చేసేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

విశాఖ ఏజెన్సీలో బాక్సైట్ తవ్వకాల వలన 19 నదులు, వాటిపై నిర్మితమైన 27 సాగు, తాగునీటి ప్రాజెక్టులకు నష్టం కలిగే పరిస్థితి దాపురించింది. విజయనగరం జిల్లా, ఎస్.కోట మండలంలోని బోడవార గ్రామంలో జిందాల్ కంపెనీ ఏర్పాటు చేయబోతున్న అల్యూమినా రిఫైనరీ కోసం, రైవాడ రిజర్వాయర్ నుంచి రోజుకు 33,600 క్యూబిక్ మీటర్ల నీటిని పైపులైను ద్వారా సరఫరా చేసేందుకు అంగీకరించారు. రైవాడ రిజర్వాయర్ నీటిని ఆరు వేల ఎకరాల వ్యవసాయ భూములకు ఇస్తామని గతంలో వాగ్దానాలు చేసి, ప్రస్తుతం సాగునీటి అవసరాలతో పాటు గతంలో విశాఖ నగర ప్రజల తాగునీటి అవసరాలు కూడా తీరుస్తున్న రైవాడ నుంచి జిందాల్ కంపెనీకి నీరు ఇస్తే, విశాఖ ప్రజలు మంచినీటి కోసం అలమటించే ప్రమాద పరిస్థితి ఎదుర్కోవాలి.

విశాఖ జిల్లాలో మాకవరపాలెంలోని రస్ అల్ ఖైమా అనే కంపెనీయే ఏర్పాటు చేయనున్న మరో అల్యూమినా రిఫైనరీకి నీరు సరఫరా జరిగితే ఆ ప్రాంతానికి సాగు, తాగునీటిని అందిస్తున్న గోస్తనీ నది అదృశ్యమయిపోయే ప్రమాదం ఉంది.

రాష్ట్రంలోని తొమ్మిది జిల్లాల్లో సముద్రతీర ప్రాంతంలో ఏర్పాటు చేయనున్న కోస్టల్ కారిడార్‌లో రసాయన పరిశ్రమలు, పోర్టులు, ఇతర పరిశ్రమలు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం జి.ఒ. 34 విడుదల చేసింది. ఈ పరిశ్రమల్లో దాదాపు డెబ్భై శాతం ప్రైవేట్ వారిదే. కేవలం నాలుగు జిల్లాలు – శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల్లో దీనికోసం 1.5 లక్షల ఎకరాల భూమిని సేకరిస్తారు. దీనికోసం ఏలేరు ఎడమ కాలవనుంచి రోజుకు 385 మిలియన్ లీటర్లు, సామర్లకోట కాలువ నుంచి 1848 ఫ్యూబిక్ లీటర్లు గోదావరి నుండి 100 మిలియన్ లీటర్ల నీటిని సరఫరా చేస్తారు.

ఈ విధంగా సెజ్‌ల అవసరాలే ప్రధానంగా అమలు చేయటం వలన భవిష్యత్‌లో భయంకరమైన సాగు, తాగు నీటి సమస్య ఏర్పడే ప్రమాదం కనపడుతోంది.

### సెజ్‌ల దోపిడీతో చిన్నాభిన్నమైన ప్రజల జీవితాలు

మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల సమీపంలో 'పోలేపల్లి' వద్ద రైతులు సాగు చేసుకొనే భూమిని ఔషధరంగ సెజ్ కు కేటాయించారు. భూములు కోల్పోయిన రైతుల్లో చాలామంది ఆత్మహత్యలు చేసుకొన్నారు. ఎదురు తిరిగిన వారిపై కేసులు పెట్టారు. పనుల్లేక, రైతులంతా కూలి పనులకోసం తిరుగుతూ మలమలమాడిపోతున్నారు.

చిత్తూరు జిల్లా సత్యవేడు, వరదయ్యపాలెం మండలాలలో పన్నెండు వేల ఎకరాల వ్యవసాయ భూమిని సెజ్‌ల కోసం కేటాయించారు. సర్వేలు జరిపి గ్రామానికి ఒకరు చొప్పున సెక్యూరిటీ గార్డును నియమించారు. రైతులెవ్వరు సర్వే జరిగిన భూముల్లో దిగి వ్యవసాయం చేయకుండా చూడాలి. చుట్టపక్కల గ్రామ పొలాల్లో పచ్చదనంతో ఎదుగుతుంటే సెజ్ ప్రాంతపు పొలాలు పాడుబడిపోయి ఉన్నాయి. వారిచ్చిన కొద్దిపాటి నష్టపరిహారం ఖర్చుయిపోయి రైతులు అప్పుల్లో కూరుకుపోయారు. పనులు దొరకక మలమల మాడుతున్నారు.

నెల్లూరు జిల్లా తడ మండలంలో అక్కంపేట, పెద్ద మాంబట్టు, చినమాంబట్టు, కండ్రిగ గ్రామాల్లో వెయ్యి ఎకరాలు చైనా కు చెందిన అపాచీ కంపెనీ సెజ్‌కు కేటాయించారు. పంటపొలాలు పాడుబడి పోవడంతో, పశువులు, గొర్రెల మేతకు గడ్డిలేక, వాటిని పెంచలేక అమ్మేసుకొంటున్నారు. రైతులు దీనంగా బతుకులు వెళ్లదీస్తున్నరు.

తొమ్మిది జిల్లాల సముద్రతీర ప్రాంతంలో ఏర్పాటు చేయనున్న కోస్టల్ కారిడార్ నిర్మాణం ప్రారంభమైతే తీరప్రాంత మత్స్యకారుల జీవితాలు నాశనమైపోతాయి. వీరంతా సముద్రం వేటపై బతుకుతున్న వారే. కేవలం విశాఖ జిల్లాలోనే తీరప్రాంతంపై ఆధారపడిన మత్స్యకారులు ఎనభై వేలు ఉన్నారు.

ఇంకా సెజ్‌ల భస్మాసుర హస్తం పడిన చోటల్లా రైతులు, పట్టణ ప్రాంత ప్రజలు, మత్స్యకారులు తీవ్ర సమస్యలకు గురవుతున్నారు. రైతులు కూలీలయిపోయారు. చేతివృత్తులు చేసుకొని బతికే వారికి జీవనాధారం పోయింది. పనులు దొరకటం లేదు. ఎంతో ఆత్మాభిమానం తో కష్టపడి బతికినవారికి ఏం చేయాలో తెలియని పరిస్థితులు ఏర్పడ్డాయి.

### సెజ్‌ల దోపిడీని ఎదుర్కొంటున్న ప్రజలు

రాజస్థాన్‌లో ఆల్వార్ జిల్లాలో ఆరు వేల హెక్టార్ల భూమిని ఓ మాక్సి సెజ్ కు కేటాయించడంతో ఆ ప్రాంత ప్రజలు జనాధికార యాత్ర పేరుతో నిరసన ప్రదర్శనలు జరిపి ఊరేగింపులలో 'అరె అరె దొంగలు వచ్చారు. సెజ్‌లు తెచ్చారు, తరమండివారిని' అంటూ నినాదాలు చేస్తున్నారు.

ముంబయి శివార్లలో రిలయన్స్ కంపెనీకి 35 వేల ఎకరాలు కేటాయించారు. అందులో అత్యధిక భాగం రియల్ ఎస్టేట్ కోసమే. అక్కడ 30 వేల మంది రైతులు నిరసన ప్రదర్శన జరిపి 'మేం విధర్భా

రైతుల్లాగా ఆత్మహత్యలు చేసుకోదల్చుకోలేదు. మేం రైతులం. భూమికోసం ప్రాణాలైనా అర్పిస్తాం. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని గడగడలాడించిన చరిత్ర మాకుంది' అని హెచ్చరిస్తున్నారు. రాయ్‌గడ్‌లో మత్స్యకారుల సంఘం ప్రెసిడెంట్ అరుణ్ శివకర్ 'ఈ భూమి మాకు తరతరాల నుండి రక్షణ కల్పిస్తోంది. అలాంటి దాన్ని అమ్మేయమంటున్నారు. అందుకు మేము ఒక కార్యక్రమాన్ని తీసుకొన్నాం. మేము 35 వేలమందిమి ఉన్నాం. ఒక్కొక్కరి దగ్గర ఒక్క రూపాయి వసూలు చేసి 35 వేల రూపాయలకు ఒక చెక్ తీసుకొని, కంపెనీ అధిపతులకు పంపిస్తూ, "మీరు మా తల్లిలాంటి భూమిని అమ్మమంటున్నారు. మేము మీ తల్లిగారినే కొనాలనుకుంటున్నాం. ఈ చెక్ తీసుకొని మీ తల్లి గారిని మాకు అమ్మండి' అని అడుగుతున్నామని, భూముల్ని ఎట్టి పరిస్థితుల్లోను వదలబోమని చెప్పారు.

కర్ణాటక రాష్ట్రంలో 36 గ్రామాలలో సెజ్‌ల కోసం 12 వేల ఎకరాలు కేటాయించారు. దీన్ని వ్యతిరేకిస్తూ నందగుడి రైతు హిత్‌కారిణి సమితి' ఆధ్వర్యంలో తీవ్రమైన నిరసన ప్రదర్శనలు జరిపారు. మంగుళుర్‌లో రెండు వేల ఎకరాల్లో ఏర్పాటైన సెజ్‌ను వ్యతిరేకిస్తూ నాలుగు గ్రామాల ప్రజలు 'కృషి భూమి సంరక్షణ వేదిక' ఆధ్వర్యంలో పోరాటం కొనసాగిస్తున్నారు.

పశ్చిమ బెంగాల్, నందిగ్రాంలో కెమికల్ ఫ్యాక్టరీ సెజ్ కోసం 22 వేల ఎకరాల పంట భూములను కేటాయించారు. ప్రజలు నిరసనలు తెలుపుతుంటే పోలీసులు కాల్పులు జరిపి 14 మందిని బలి తీసుకొన్నారు. అయినా బెదరకుండా ప్రాణాలైనా అర్పిస్తాం, మా భూమిని మాత్రం వదులుకోం – అని ఉద్యమించి ప్రభుత్వం సెజ్‌ను రద్దు చేసుకోనేటట్లు చేసారు. సెజ్‌ల వ్యతిరేక పోరాటంలో భారత ప్రజలందరికీ మార్గదర్శకం అయ్యారు.

తొమ్మిది లక్షల జనాభా ఉంటే, పది లక్షల ఉద్యోగాలు కల్పిస్తామని వాగ్దానాలు చేసి గోవాలో 15 సెజ్‌ల కోసం 1500 ఎకరాలు కేటాయించారు. అందులో ఫార్మా పార్క్ నిర్మాణ పనులు ప్రారంభమై దాదాపు అయిదు వందల కోట్ల రూపాయలు ఖర్చు చేసారు. సెజ్‌లను వ్యతిరేకిస్తూ ప్రజలందరూ ఐక్యంగా నిరసన ప్రదర్శనలు ధర్నాలు, పనులు ఆపటం, హెచ్చరికల తర్వాత కంపెనీల యంత్రాలు, సిబ్బంది వాహనాలు ధ్వంసం చేసారు. పర్యావరణవేత్తలు, ప్రజా సంఘాలు, 'గోవా బచావో ఆందోళన్'తో పాటు, ఎన్.సి.పి., బి.జె.పి., శివసేన లాంటి రాజకీయ పార్టీలను కూడా కలుపుకొనే 'సెజ్‌లు మాకొద్దు' అంటూ 'గోవా మూవ్‌మెంట్ ఎగెనెస్ట్ సెజ్'ల ఆధ్వర్యంలో ఉద్యమించారు. ప్రభుత్వం తన నిర్ణయాన్ని ఉపసంహరించుకొనేంతవరకు పర్యాటకులు గోవాలో అడుగుపెట్టకూడదని, అప్పటికే ఉన్న పర్యాటకులు డిసెంబర్ 28 లోపున గోవా వదిలిపోవాలని, లేకపోతే తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసి ఉంటుందంటూ హెచ్చరించారు. దానితో టూరిజం మీదే ప్రధానంగా ఆధారపడ్డ గోవా ప్రభుత్వం దిగివచ్చి డిసెంబర్ 31న 15 సెజ్‌లు రద్దు చేస్తున్నట్లు ప్రకటించవలసి వచ్చింది. ప్రజా ఉద్యమం ద్వారా మొత్తం సెజ్‌లను రద్దు చేయించిన ఘనత గోవా ప్రజలదే.

విశాఖజిల్లా మాకవరపాలెంలో జిందాల్ అల్యూమినా రిఫైనరీ కోసం 1300 ఎకరాలు కేటాయించారు. దీనికి వ్యతిరేకంగా గిరిజనులు, ప్రజలు తీవ్ర పోరాటం కొనసాగిస్తున్నారు. కొత్త అడ్డతీగల వద్ద సెప్టెంబర్ 30న యూనివర్సల్ టెక్నికల్ సర్వీసెస్ వారు సర్వేకోసం రాగా వారిపై గిరిజన మహిళలు దాడిచేసి, వారి యంత్రసామాగ్రిని, వాహనాల్ని ధ్వంసం చేసి తమ నిరసన తెలిపారు.

విజయనగరం జిల్లా, ఎస్.కోట మండలంలో బొడ్డవార గ్రామంలో జిందాల్ అల్యూమినా రిఫైనరీ కోసం 1048 ఎకరాలు కేటాయించారు. జాయింట్ కలెక్టర్ స్వయంగా హాజరయిన గ్రామసభలో గ్రామస్తులందరూ ఏకకంఠంతో తమ భూముల్ని అప్పచెప్పమని చెప్పారు. దానితో ఆయనే 98 శాతం ప్రజలు సెజ్‌ను వ్యతిరేకిస్తున్నారని ప్రకటించవలసి వచ్చింది. అంత జరిగినా, ఇంకా బలవంతాన భూముల్ని స్వాధీనం చేసుకోవటానికి ప్రయత్నాలు చేస్తున్నా ప్రజలు ఐక్యంగా ఎదుర్కొంటున్నారు.

ఒరిస్సా, కళింగనగర్ ఇండస్ట్రియల్ జోన్‌లో టాటాలకు స్టీల్ ప్లాంట్ కోసం 2500 ఎకరాలు కేటాయించారు. వారు పనులు ప్రారంభించినపుడు వేలాది గిరిజనులు 'బిస్తాపన్ బిరోధీ జనమంచ్' ఆధ్వర్యంలో ఉద్యమించగా పోలీసుల కాల్పుల్లో 2 జనవరి 2007న పన్నెండు మంది గిరిజనులు అమరులయ్యారు. అదే ప్రాంతంలో కొరియా కంపెనీ పోహాంగ్ స్టీల్ కంపెనీ (పోస్కో)కి ఇనుప ఖనిజాన్ని తవ్వి, తమ దేశానికి తీసుకువెళ్లటానికి పన్నెండు మిలియన్ టన్నుల సామర్థ్యంతో స్టీల్ ప్లాంట్ నిర్మాణానికి 52 వేల కోట్ల రూపాయల ప్రాజెక్ట్‌కు 4500 ఎకరాలు కేటాయించారు. ఆ ప్రాంత రైతులు, గిరిజనులు, పదమూడు మందిని కాదు, పదమూడు వేల మందిని చంపినా మా భూముల్ని వదలం అంటూ ఉద్యమం కొనసాగిస్తున్నారు. సంవత్సరం పైన కళింగనగర్ జాతీయ రహదారిని దిగ్బంధం చేసి, వాహనాల రాకపోకలు బంద్ చేసారు. దీనివలన ప్రైవేట్ కంపెనీలకు నాలుగు వేల కోట్ల రూపాయల నష్టం వాటిల్లింది. తమ ప్రాంతంలోకి అనుమతి లేకుండా వచ్చిన నలుగురు పోస్కో కంపెనీ అధికారుల్ని 'పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ్ సమితి' నిర్బంధించి, చివరకు జగజిత్‌సింగ్ పూర్ పరిపాలనా అధికార్లు నుంచి రాతపూర్వకంగా వారి ప్రాంతంలోకి అనుమతి లేకుండారాము అని తీసుకొన్న తర్వాతే వారిని వదిలారు.

ఒరిస్సా, కోరాపుట్ జిల్లాలలో దియోమాలి ప్రాంతంలో మైనింగ్ ప్రాజెక్ట్ కోసం ప్రైవేట్ కంపెనీకి భూమిని కేటాయించారు. దీన్ని వ్యతిరేకిస్తూ పది వేలమంది గిరిజనులు ఏప్రిల్ 19న సిమిలిగుడ బ్లాక్, అప్పరక్రాంతి గ్రామం వద్ద తమ సంప్రదాయ ఆయుధాలైన విల్లంబులు, బాణాలతో నిరసన ప్రారంభించారు. 'లోక్‌శక్తి అభిజాన్' ఆధ్వర్యంలో 'ఒక్క అంగుళం భూమి కూడా ప్రాజెక్ట్‌కు ఇవ్వం' అని పోరాటానికి సిద్ధమవుతున్నారు.

పై విషయాలు గమనిస్తే సామ్రాజ్యవాదులకు తలవంచి, మన పాలకులు సెజ్‌ల విధానం ద్వారా మన దేశ ప్రజల్ని మరింత బానిసత్వంలోకి తోసేయబోతున్నారని మనకు అర్థం అవుతోంది. బాధితులైన రైతులు, గిరిజనులు, మత్స్యకారులు, పట్టణ ప్రాంత ప్రజలు సెజ్‌లకు వ్యతిరేకంగా చేస్తున్న పోరాటాన్ని కార్మిక, ఉద్యోగ మిత్రులందరూ సమర్థించటంతో పాటు వాటిలో పాల్గొనవలసిన అవసరం ఎంతైనా ఉంది.

◆

*ప్రజా ప్రయోజనాల్ని కాలరాచి, ప్రభుత్వమే దళారీ అవతారమెత్తి సెజ్‌ల ముసుగులో చేస్తున్న రియల్ ఎస్టేట్ వ్యాపారం గురించి చెబుతున్నారు* **కొణతం దిలీప్**

# రాష్ట్రంలో రెండు సెజ్ ల కథ

ఒకటేమో రాష్ట్రవ్యాప్తంగా ప్రచారం పొందిన పోలేపల్లి సెజ్, మరొకటి ఎవరికీ తెలియని జార్జియా టెక్ విజ్ఞాన సిటీ సెజ్. బయటి నుండి చూస్తే ఈ రెండిటి మధ్యా పెద్దగా పోలికలు లేవు. అయితే రెండిట్లోనూ మనకు కొట్టొచ్చినట్టు కనపడేవి మాత్రం అవినీతి, అంతులేని దోపిడీ. ఈ రెండు సెజ్‌ల కథ తెలుసుకుంటే చాలు అసలు ప్రత్యేక ఆర్థిక మండళ్లు ఎవరి అభివృద్ధి కొరకు ప్రవేశపెట్టబడ్డాయో చాలా తేలికగా అర్థం అవుతుంది. ప్రభుత్వమే దళారీ అవతారమెత్తి సెజ్‌ల ముసుగులో చేస్తున్న అక్రమ రియల్ ఎస్టేట్ వ్యాపారపు అసలు రంగు ఈ రెండు సెజ్‌ల కథలు మనకు చెపుతాయి.

### పోలేపల్లి సెజ్ దుర్మార్గం

స్వతంత్ర భారతదేశ చరిత్రలోనే అతిపెద్ద భూకుంభకోణాల్లో ఒకటి పోలేపల్లి సెజ్ పేరిట జరుగుతున్న బాగోతం. గత కొంతకాలంగా ఈ సెజ్ బాధిత గ్రామం పత్రికల్లో పతాక శీర్షికలకెక్కుతోంది. మొన్న జరిగిన ఉపఎన్నికల్లో 14 మంది పోలేపల్లి సెజ్ బాధితులు పోటీచేశారు. దీంతో ఆ అంశం దేశవ్యాప్తంగా అందరి దృష్టిని ఆకర్షించింది. గత నాలుగేళ్లలో సెజ్ బాధిత రైతులు అనేకమంది బలవన్మరణం పాలవటం ఇక్కడి పరిస్థితి తీవ్రత తెలియజేస్తోంది. గత నాలుగేళ్లుగా రాజుకుంటూ వస్తున్న పోలేపల్లి రైతుల ఉద్యమం ఇప్పుడిప్పుడే తారాస్థాయికి చేరుకుంటోంది. అనేక ప్రజా సంఘాలు పోలేపల్లి సెజ్ వ్యతిరేక పోరాటానికి సంఘీభావం తెలుపుతున్నాయి. అనేకమంది మేధావులు, కవులు, కళాకారులు ఈ రైతుల ఆందోళనకు మద్దతు పలుకుతున్నారు. అయితే గమనించాల్సిన విషయం ఏమిటంటే తెలుగుదేశం మొదలుకొని బిజెపి వరకూ కాంగ్రెస్ మొదలుకొని తెరాస వరకూ అన్నీ ప్రధాన రాజకీయ పార్టీల నాయకులూ పోలేపల్లి ప్రజలకు అన్యాయమే చేశారు. ప్రజలను తప్పుదోవపట్టించి వారి పొట్టగొట్టారు.

ఈ కథ మొదలైంది 2003 చివరి నాళ్లలో. హైదరాబాద్‌కు అతి సమీపంలో ఉన్న జడ్చర్ల వద్ద ఒక 'ఇండస్ట్రియల్ గ్రోత్ కారిడార్' నెలకొల్పాలని అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకోసం పోలేపల్లి, ముదినేపల్లి, గుండ్లగడ్డ తాండా గ్రామాలకు చెందిన దాదాపు వెయ్యి ఎకరాల భూసేకరణ జరపడానికి నోటిఫికేషన్ కూడా జారీచేసింది. భూసేకరణ కోసం ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక మౌలిక వసతుల సంస్థ (ఎ.పి.ఐ.ఐ.సి) కేంద్ర ప్రభుత్వం నుండి దాదాపు ఏడు కోట్ల రూపాయల నిధులు కూడా పొందింది. 2004లో ఈ భూముల్లో కాన్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ (సి.ఐ.ఐ.) గ్రీన్ బిజినెస్ సెంటర్ వారి సహకారంతో ఒక 'గ్రీన్ ఇండస్ట్రియల్ పార్క్' నెలకొల్పుతామని ఎ.పి.ఐ.ఐ.సి. ప్రకటించింది.

నిరక్షరాస్యులైన రైతులను బెదిరించి, వారికి అబద్ధాలు చెప్పి, బలవంతంగా నామమాత్రపు నష్టపరిహారానికి స్థానిక ప్రభుత్వాధికారులు భూమిని సేకరించారు. లంచాలు పోగా రైతులకు ఎకరానికి పదహారు వేల రూపాయల నష్టపరిహారం దక్కింది. ఈ భూ సేకరణలో భూములు కోల్పోయిన రైతులంతా దళితులు, గిరిజనులే కావటం గమనార్హం. ఇలా సేకరించిన భూమిలో మూడు వందల ఎకరాలను కాంగ్రెస్ ప్రభుత్వం 2005లో ఫార్మా సెజ్ నెలకొల్పేందుకు కేటాయించింది. రైతుల వద్ద కారు చౌకగా కొట్టేసిన ఈ భూములనే ఇప్పుడు ఎ.పి.ఐ.ఐ.సి. సెజ్ యాజమాన్యం కలిసి వంద రెట్లు ఎక్కువ ధరలకు అమ్ముకుంటున్నారు. భూములు కోల్పోయిన రైతుల్లో అనేకులు ఇప్పుడు తమ భూముల్లోనే నిర్మాణం అవుతున్న సెజ్‌లో కూలీలుగా మారారు. రేపోమాపో నిర్మాణ పనులు పూర్తయితే వారికి ఆ మాత్రం ఆసరా కూడా దొరకదు.

తమ నోటికాడి కూడును లాగేసుకుని ఏర్పాటవుతున్న సెజ్‌కు వ్యతిరేకంగా ఉద్యమించిన రైతులపై ప్రభుత్వం తీవ్ర నిర్బంధం అమలు చేస్తోంది. వారిపై అక్రమ కేసులు బనాయించి వేధింపులకు గురిచేస్తోంది. ఇండస్ట్రియల్ గ్రోత్ కారిడార్ పేరిట కేంద్ర ప్రభుత్వ నిధులు పొంగి తద్వారా సేకరించిన భూములను ప్రత్యేక ఆర్థిక మండలాలకు కేటాయించడం నిబంధనలకు విరుద్ధమని ఈ ఏడాది కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదిక రాష్ట్ర ప్రభుత్వానికి అక్షింతలు వేసింది. వెయ్యి ఎకరాలు సేకరించిన ప్రభుత్వం నాలుగేళ్ల తరువాత కూడా అందులో మూడోవంతు కూడా వినియోగించుకోలేదు. ఇలా అవసరం లేకున్నా నోటిఫికేషన్ ఇచ్చి ప్రజల భూములు లాక్కొని వాటిని హెచ్చు ధరలకు అమ్ముకోవడం ప్రజాస్వామ్య ప్రభుత్వాలకు తగని పని. ప్రభుత్వం సేకరించి వినియోగించకుండా ఉన్న ఏడువందల పై చిలుకు ఎకరాల భూములను వెంటనే రైతులకు తిరిగి అప్పజెప్పాలని, ఇక్కడి నుండి ఫార్మా సెజ్‌ను వెంటనే ఎత్తివేయాలని, పోలేపల్లి సెజ్ వ్యవహారం బడుగుల పొట్టగొట్టి బడాబాబుల కడుపు నింపేందుకు రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నామేనని అర్థమవుతుంది. ప్రజలను బెదిరించి వారి

భూములను నామమాత్రపు ధరలకు బలవంతంగా లాక్కొని, తిరిగి వాటినే బడా పారిశ్రామికవేత్తల మద్దతుతో ఎక్కువ ధరలకు అమ్ముకునే స్థితికి మన ప్రభుత్వాలు దిగజారాయి. అరవై ఏళ్ల స్వతంత్రం మనల్ని ఇంత 'అభివృద్ధి' చేసింది. ఈ గడ్డపై ఎవరి 'అభివృద్ధి' కోసం ఎవరు త్యాగం చేస్తున్నారో కళ్లకు కట్టినట్టు చూపిస్తోంది పోలేపల్లి సెజ్.

### జార్జియా టెక్ భూ కుంభకోణం

రాష్ట్రంలో జరుగుతున్న సెజ్ బాగోతాల్లో విలక్షణమైనది జార్జియా టెక్ వారి విజ్ఞాన్ సిటీ సెజ్ వ్యవహారం. మొదలు యూనివర్సిటీ పెట్టుకుంటామని వచ్చిన సంస్థకు మనవాళ్లె సెజ్ పెట్టుకోమని సలహా ఇస్తారు. అటుపై యూనివర్సిటీకి దేశీయ 'భాగస్వాములను' వెతికి పెడతారు. చివరికి పద్నాలుగు ఎకరాల్లో పెట్టే యూనివర్సిటీకి 250 ఎకరాల విలువైన భూమిని పళ్లెంలో పెట్టి ప్రేమతో బహూకరిస్తారు. ఇదంతా రాష్ట్ర అభివృద్ధి కోసమేనని మనం నమ్మి తీరాల్సిందే. ప్రభుత్వ ప్రాజెక్ట్‌ల్లో అవినీతి జరగడం పాత కథ. ప్రభుత్వ పెద్దలే ప్రైవేట్ కంపెనీలకు కొత్త కొత్త ప్రాజెక్ట్‌ల ఆలోచనలు సూచించి మరీ సొమ్ము చేసుకోవడం కొత్త పోకడ. జార్జియా టెక్ సెజ్ రానున్న రోజుల్లో ఈ రంగంలో జరిగే మరిన్ని మార్పులకు సూచిక. ఇప్పటిదాక సెజ్ అంటే అదేదో ఎగుమతుల పరిశ్రమలకు సంబంధించిన వ్యవహారం అనుకునే వారు. ఇప్పుడు ఒక విశ్వవిద్యాలయానికి సెజ్ కేటాయించడం ద్వారా విద్యను కూడా 'ఎగుమతి చేయగల సరుకు'గానే మన ప్రభుత్వాలు భావిస్తున్నాయని మనకు అర్థమవుతోంది. విశ్వవిద్యాలయం లాభాపేక్షలేని సంస్థ అనే నెపంతో తక్కువ ధరలకు వందల ఎకరాల భూములను కేటాయిస్తుంది మన ప్రభుత్వం. అయితే పద్నాలుగు ఎకరాల్లో వచ్చే విశ్వవిద్యాలయానికి లాభాపేక్ష లేకపోవచ్చు. కానీ పక్కనే 2436 ఎకరాల్లో వస్తున్న సెజ్‌కు లాభాపేక్ష లేకుండా పోదుకదా.

అమెరికాలో పేరొందిన యూనివర్సిటీ అయిన జార్జియా టెక్ యూనివర్సిటీ హైదరాబాద్‌లో ఒక శాఖను నెలకొల్పాలనుకుంది. ఇందుకోసం ఇటీవలనే మన రాష్ట్ర ప్రభుత్వం హైదరాబాద్ శివార్లలో శ్రీశైలం హైవే పై 250 ఎకరాల భూమిని కూడా కేటాయించింది. అయితే యాభై ఎకరాలు చాలు అన్న జార్జియా టెక్‌కు మొదలు ఇరవై ఎకరాలు ఇచ్చి, ఆ తరువాత దాన్ని డెబ్బై ఎకరాలకు పెంచి, చివరికి 250 ఎకరాలు ఇవ్వడమే ఒక వింత అయితే ఎకరానికి బహిరంగ మార్కెట్లో కోటి రూపాయలు పలుకుతున్న భూమిని కేవలం లక్షన్నర రూపాయలకే కేటాయించాలని సాక్షాత్తూ ముఖ్యమంత్రి సిఫారసు చేయడం, ఆఘమేఘాల మీద రెవెన్యూ శాఖ సదరు యూనివర్సిటీకి ఆ భూమిని కేటాయించడం అనుమానాలకు తావిస్తోంది. జార్జియా టెక్ యూనివర్సిటీకి భూమి కేటాయించడం వెనుక భారీ కుంభకోణమే నడిచినట్టు అనుమానాలు కలుగుతున్నాయి. ఈ కథ యావత్తూ ముఖ్యమంత్రికి తెలిసే జరిగినట్టూ కీలక ఆధారాలు ఉన్నాయి. అసలు ఈ భూమి కేటాయింపు వ్యవహారం మొదటి నుంచీ పరిశీలిస్తే అనేక దిగ్భ్రాంతికరమైన నిజాలు బయటపడతాయి. 225 కోట్ల రూపాయల భూమిని కేవలం మూడు కోట్ల డెబ్బై అయిదు లక్షలకు కేటాయించి ప్రభుత్వంలోని పెద్దలు ఆ యూనివర్సిటీపై తమకున్న ప్రేమను చాటుకున్నారు. అభివృద్ధి అనే ముసుగు వెనుక ప్రభుత్వ ఆస్తులు బడాబాబుల చేతిలోకి ఎంత అలవోకగా కారుచౌకగా నడిచివెళ్తున్నాయో తెలుసుకోవడానికి జార్జియా టెక్ యూనివర్సిటీ ఉదంతం ఒక చక్కని ఉదాహరణ కాగలదు.

హైదరాబాద్‌లో శాఖను పెట్టాలనే ఉద్దేశ్యంతో వచ్చిన విదేశీ యూనివర్సిటీ సంస్థకు ప్రపంచంలోనే ఎక్కడా లేని విధంగా ఈ ఎస్.ఇ.జెడ్. స్థాపించి అందులో యూనివర్సిటీ పెట్టుకోమని సలహా ఇచ్చారు ప్రభుత్వంలోని పెద్దలు. అంతే కాదు కారుచౌక రేటుకు 250 ఎకరాలు కూడా కేటాయించేశారు. లాభాపేక్ష లేకుండా ఉండాల్సిన విద్యాసంస్థలను ఎస్.ఇ.జెడ్. పేరిట పక్కా వ్యాపారంగా మార్చేసే కొత్త దోపిడీ దారిని కనిపెట్టారు కొందరు దళారులు, ప్రభుత్వ పెద్దలు.

పరిశ్రమలను ప్రోత్సాహించాలనే ఉద్దేశ్యంతో సెజ్ చట్టం తెచ్చామని కేంద్ర ప్రభుత్వం అనేకసార్లు చెప్పింది. అయితే సెజ్ చట్టం చివరికి కొత్త జమీందారీ వ్యవస్థ అవుతుందని, కొద్ది మంది బడా బాబులకు భూ దోపిడీ చేయడానికి ఇదొక ఉపకరణంలా మారుతోందని ప్రజలు ఈపాటికే దేశవ్యాప్తంగా ఆందోళన చేస్తున్నారు.

ఇప్పుడు ఏకంగా లాభాపేక్షలేని యూనివర్సిటీలకు కూడా సెజ్‌లు కేటాయించడం మొదలు పెట్టి విద్యను కూడా వ్యాపారం చేశారు. హైదరాబాద్‌లో క్యాంపస్ పెడుతామని వచ్చిన జార్జియా టెక్ యూనివర్సిటీ మొదలు భూమి ఉచితంగా కావాలని అడిగింది. అటు తరువాత తమది లాభాపేక్ష లేని సంస్థ కాబట్టి తమదగ్గర క్యాంపస్ పెట్టడానికి డబ్బులు లేవని, ఆసక్తిగల దాతల కోసం వెతుకుతున్నామని చెప్పింది. వెంటనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లోని కొందరు పెద్దలు ఇదొక బ్రహ్మాండమైన వ్యాపారావకాశంగా భావించారు. మీకు పెట్టుబడి పెట్టే వ్యాపార భాగస్వాములను వెతికి పెడ్తామని భరోసా ఇచ్చారు. ఒక విదేశీ కన్సల్టెంట్‌ను పట్టుకుని 'విజ్ఞాన్ సిటీ' అనే ఒక ఈస్ట్మన్ కలర్ స్వప్నం లాంటి ప్రాజెక్ట్‌ను రచించారు. ఒకవైపు యూనివర్సిటీ, ఇంకొక వైపు స్టార్ హోటళ్లు, వాణిజ్య సముదాయాలు, పరిశోధనాలయాలు, అపార్ట్‌మెంట్లు... ఇలా రెండు వందల యాభై ఎకరాలకు సరిపోయే కథను అల్లారు. పెద్దలు ఫైళ్లు చకచకా నడిపించారు. భూ కేటాయింపు నిర్ణయం జరిగిపోయాక సాక్షాత్తూ ముఖ్యమంత్రినే ఒప్పించి వందల కోట్ల రూపాయల భూమిని చిల్లర డబ్బులకు కొట్టేశారు.

విద్యావ్యాప్తి, ఉపాధి కల్పన సాకుతో కారుచౌకగా విలువైన భూమిని కొట్టేయడానికి ప్రైవేట్ సంస్థలు, ఉన్నతాధికారులు, రాజకీయ నాయకులు కలిసి ఆడుతున్న తాజా బాగోతం ఇది.

జార్జియా టెక్ భూమి కేటాయింపు కథలో మనకు అన్నిటి కన్నా ముందు కొట్టొచ్చినట్టు కనపడేది రోజులు గడుస్తున్నకొద్దీ యూనివర్సిటీపై ప్రభుత్వానికి ప్రేమ పెరిగిపోయి ఆ సంస్థకు కేటాయించే భూమి పరిమాణం పెరుగుతూ పోవడం. ఒకసారి ఆ వింత చూడండి.

7 ఏప్రిల్ 2007 : జార్జియా టెక్ ప్రభుత్వానికి పంపిన ముసాయిదా ఎం.ఒ.యు.లో తమకు హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ వద్ద యాభై ఎకరాలు కావాలని కోరింది.

5 జూన్ 2007 : ముఖ్యమంత్రి ఆధ్వర్యంలో రాష్ట్ర క్యాబినెట్ జరిపిన సమీక్షా సమావేశంలో జార్జియా టెక్ యూనివర్సిటీకి

*సెజ్‌ల కోసం పంట భూములు గుంజుకొని, బిచ్చంగా రెండు రూపాయల బియ్యం ఇస్తున్న ప్రభుత్వ దుర్మార్గాన్ని, నిర్వాసితుల బాధల్ని వివరిస్తున్నారు* **గీతాంజలి**

# పోలేపల్లి ప్రజల పోరుబాట

**ఊ**ర్లల్లో మూఢనమ్మకాలు, దారిద్ర్యం, కరువు, వలసలు, ఆకలి కారణాలుగా మాస్ హిస్టీరియా (పూనకం) వస్తుంది. దాని వెనకాల ఉన్న పైన ఉదహరించిన సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలు,వాటి పరిష్కారాల జోలికి పోకుండా ప్రభుత్వం ఊర్లల్లోకి ఆ అమాయకమైన ప్రజల దగ్గరికి సైకియాట్రిస్ట్‌లను, మెజిషియన్స్‌ను, కౌన్సిలర్స్‌ను పంపిస్తుంది. వాళ్లు కౌన్సిలింగ్ జిమ్మిక్కులు చేసి బాణామతి, చేతబడి, పూనకాలు అన్ని కూడా మూఢనమ్మకాలనీ, కొన్నేమో మానసిక వత్తిడివల్ల వచ్చిన సమస్యలని వివరించి మళ్లీ పట్నాల్లోకి తమ కార్పొరేట్ ఫైవ్‌స్టార్ హాస్పిటల్స్‌లో వచ్చి పడిపోతారు. ప్రభుత్వం చేతులు దులుపుకుంటుంది.

అదే ప్రభుత్వం మహబూబ్‌నగర్ జిల్లా పోలేపల్లిలో నలభై ఒక్కమంది రైతులు గుండెపోటు వచ్చి మరణిస్తే దాన్ని కనీసం ఒక తీవ్ర అనారోగ్యం కిందికి కూడా పరిగణించకుండా కనీసం ఒక్క కార్డియాలజిస్ట్‌ను కూడా అక్కడికి కారణాలేంటో పరిశోధించమని పంపియ్యలేదు. పైగా అవన్నీ బూటకపు ఇంకా సహజ మరణాలని, ఒక్కొక్కరికి ఏవో వ్యాధులు అంతకుముందే ఉన్నాయని, కొంతమంది ఏక్సిడెంట్స్‌లో చనిపోయారని బుకాయిస్తూ బూటకపు ప్రకటనలు చేసింది. నిజానికి పోలేపల్లికి డజన్లకొద్ది కార్డియాలజిస్టులను పంపించాలి.

ఇంతకీ ఆ పోలేపల్లి రైతులు గుండెపోటెందుకు తెచ్చుకున్నారు? రక్షణ బాధ్యత ఇవ్వాల్సిన ప్రభుత్వమే సామ్రాజ్యవాద దేశాలకు దళారీగా, మార్కెటింగ్ ఏజెంట్‌గా మారి వాళ్ల భూముల్ని దౌర్జన్యంగా గుంజుకొంది కాబట్టి. తద్వారా రాజ్యం పట్ల వారి విశ్వాసాన్ని, తమ జీవనాధారాన్ని, ఊరిలో తమ స్థానికతను కోల్పోయి నిర్వాసితులుగా మార్చబడ్డారు కాబట్టి. పోలేపల్లిలోకి పోయే ముందు సెజ్‌ల నేపథ్యం కొద్దిగా అర్థం చేస్కోవాలి.

---

హైదరాబాద్‌లో ఇరవై ఎకరాలు, విశాఖపట్నంలో డెబ్భై ఎకరాలు ఇవ్వాలని తీర్మానించింది. జార్జియా టెక్ ఎప్పుడూ తమకు వైజాగ్‌లో భూమి కావాలని కోరలేదు.

8 జూన్ 2007 : ముఖ్యమంత్రి, మహబూబ్‌నగర్ జిల్లా కలెక్టర్ ఉషారాణి తదితరులు పాల్గొన్న సమావేశంలో కొత్తూర్ మండలం మామిడిపల్లిలోని సర్వే నెం. 292లో జార్జియా టెక్ యూనివర్సిటీకి డెబ్భై ఎకరాలు ఇవ్వాలని నిర్ణయించారు.

21 సెప్టెంబర్ 2007 : తమను ఎస్.ఇ.జెడ్. పెట్టుకోమని ప్రధానమంత్రి కార్యాలయం వాళ్లు, కేంద్ర వాణిజ్యశాఖ వర్గాలు సలహా ఇచ్చాయని కాబట్టి ఎస్.ఇ.జెడ్. పెట్టుకోవడానికి రెండు వందల యాభై ఎకరాలు కేటాయించాలని కోరుతూ జార్జియా టెక్ ఉన్నతాధికారులు ముఖ్యమంత్రికి ఒక లేఖ రాశారు.

12 నవంబర్ 2007 : మరొక లేఖలో తమకు కేటాయించే భూమి హైదరాబాద్ శివార్లలోని ముచ్చర్ల ఐ.టి. పార్క్‌లో ఇవ్వాలని జార్జియా టెక్ ప్రతినిధులు కోరారు.

23 డిసెంబర్ 2007 : యూనివర్సిటీకి ముచ్చర్ల ఐ.టి. పార్క్‌లో రెండు వందల యాభై ఎకరాలు కేటాయించాల్సిందిగా ముఖ్యమంత్రి రంగారెడ్డి జిల్లా కలెక్టర్‌ను ఆదేశించారు.

29 ఫిబ్రవరి 2008 : ప్రభుత్వ భూముల అమ్మకానికి ధరలు నిర్ణయించే సాధికారిక (ఎంపవర్డ్) కమిటీ ఎకరానికి 18 లక్షల రూపాయల చొప్పున జార్జియా టెక్‌కు ఇవ్వాలని సిఫారసు చేసింది.

15 మార్చ్ 2008 : బిట్స్ పిలాని వారికి హైదరాబాద్ శివార్లలో యూనివర్సిటీ పెట్టుకోవడానికి భూమి కేటాయించినప్పుడు లక్షన్నరకే ఎకరం ఇచ్చాం కనుక ఇప్పుడు కూడా లక్షన్నరకే ఇవ్వాలని ముఖ్యమంత్రి అధికారులను ఆదేశించారు. తమకు భూమి రేటులో రాయితీ ఇవ్వాలని జార్జియా టెక్ ఏనాడూ అడగకపోవడం ఇక్కడ గమనార్హం.

27 మార్చ్ 2008 : జార్జియా టెక్ యూనివర్సిటీకి ముచ్చర్ల ఐ.టి. పార్క్‌లో రెండు వందల యాభై ఎకరాల భూమి ఎకరం లక్షా యాభై వేలకు కేటాయిస్తూ రెవెన్యూ శాఖ జి.ఒ. 553 జారీ చేసింది.

పేదోళ్లను కొట్టి....

ముచ్చర్ల ఐ.టి. పార్క్‌లో ఇప్పుడు జార్జియా టెక్ యూనివర్సిటీకి ఇవ్వాలని ప్రభుత్వం నిర్ణయించిన స్థలం మొదలు నాలుగో తరగతి ఉద్యోగులకు, గవర్నమెంట్ డ్రైవర్లకు ఇళ్ల స్థలాల కొరకు కేటాయించాలనుకున్నారు. కానీ ఇప్పుడు మనసు మార్చుకుని ఈ విదేశీ యూనివర్సిటీకి ఇచ్చేశారు. మన బడుగుల ఆశలపై నీళ్లు చల్లి బడాబాబుల జేబులు నింపడానికే ఈ ప్రభుత్వం 'కృషి' చేస్తున్నదనడానికి ఇంతకంటే సాక్ష్యం ఏం కావాలి?

ఇక జార్జియా టెక్ విశ్వవిద్యాలయం కోసం రాష్ట్ర ప్రభుత్వం ఏకంగా ప్రైవేట్ విశ్వవిద్యాలయం స్థాపన అనుమతిస్తూ ఒక కొత్త చట్టమే తీసుకురావడం ఈ కథలో కొసమెరుపు. ◆

ప్రత్యేక ఆర్థిక మండలాల పేరిట దేశవ్యాప్తంగా అభివృద్ధి ముసుగులో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పేద ఎస్.సి., ఎస్.టి., బి.సి, మైనారిటీల భూముల్ని గుంజుకొని బహుళజాతి కంపెనీలకు కోట్ల రూపాయలకు అమ్ముకుంటోంది. ఇప్పటికే దేశవ్యాప్తంగా దాదాపు 3.5 లక్షల ఎకరాల సాగుభూమి దేశ విదేశీ కంపెనీల పరమైపోయింది. కొన్ని వేలమంది రైతులు నిర్వాసితులు అయిపోయారు. సాగులో ఉన్న పంటభూముల్ని, బోరుబావులు, నీటి వసతులు ఉన్న బహుళ పంటలు పండే రైతుల భూమిని ఒకే పంట పండే భూములని, బీడు భూములనే నెపంతో అసైన్డ్ పట్టా - డి ఫారమ్ భూముల్ని ఎకరానికి పద్దెనిమిది వేల రూపాయల ధర నిర్ణయించి తీసుకుపోతే ఆ ఇంత నష్టపరిహారం కూడ ఇవ్వమని బెదిరించి కుట్రపూరితంగా, బలవంతంగా గంజేస్కు ఇవ్వమని ఎదురు తిరుగుతున్న రైతుల్ని కొట్టి అన్యాయంగా జైళ్లలో పెడుతోంది ఈ ప్రభుత్వం.

దేశవ్యాప్తంగా ఆరువందల సెజ్‌ల అమలు వేగంగా జరుగుతోంది. పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర లాంటి రాష్ట్రాల్లో రైతుల భూములు గుంజుకొని పరిశ్రమల నిర్మాణం కూడా మొదలు పెట్టారు. ఆంధ్రప్రదేశ్ కాకినాడ, విశాఖపట్నం, నెల్లూరు, అనంతపురం, చిత్తూరు, మహబూబ్‌నగర్, మెదక్, రంగారెడ్డి లాంటి జిల్లాల్లో భూసేకరణ శరవేగంగా జరిగిపోతోంది. కమ్యూనిస్ట్ పార్టీ ముసుగు వేసుకున్న సి.పి.ఎం. ప్రభుత్వం సలీం కంపెనీ కోసం నందిగ్రాం లో భూసేకరణ పేరిట మరొక జలియన్‌వాలాబాగ్‌ను సృష్టించింది.

నక్సల్బరీ ఉద్యమం ఒక విలువైన మార్క్సిస్ట్-లెనినిస్ట్ విప్లవ పంథాని భారతదేశ పీడిత ప్రజలకు అందిస్తే, నందిగ్రాంలో ఒక ఫాసిస్ట్ పంథాలో సి.పి.ఎం. రివిజనిజం నిజరూపాన్ని బయటపెట్టింది. సి.పి.ఎం. పార్టీ బహుళజాతి కంపెనీలకు, సంపన్న దేశాలకు తాను తన దేశంలో ఎంత బలమైనదో ఈ మారణకాండ ద్వారా నిరూపించ దల్చుకుంది. భారతదేశంలోని మిగతా రాజకీయ పార్టీలకంటే మిన్నగా, ఎక్కువగా వారికి, వారి పెట్టుబడులకు, దోపిడీకి హత్యలు చేసైనా సరే ఎర్రతివాచీ పరుస్తామని ప్రకటించింది. అదే సి.పి.ఎం. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, మహారాష్ట్ర లాంటి రాష్ట్రాల్లో సెజ్‌లకు వ్యతిరేకంగా నినాదాలిస్తోంది. నిజానికి నందిగ్రాంలో ఒక గుజరాత్ జీనోసైడ్ లాంటిదే జరిగింది. భూమికోసం, భుక్తికోసం నిరంతరం శ్రమించే పేద, పీడిత రైతాంగం హత్యాకాండకు గురయ్యింది. సి.పి.ఎం. గూండాలు ఒక మిలిటరీ హంతక రూపాన్ని దాల్చి, దాడిని ఆపలేని నిస్సహాయతలో దేవుడే కాపాడాలన్న ఆశతో వేలకొద్దీ హిందూ, ముస్లిం ప్రజలు స్త్రీలు, పిల్లలు పూజా కార్యక్రమాల్లో ఉన్నప్పుడు దాడిచేసి పిట్టల్ని కాల్చినట్లు కాల్చేసారు. స్త్రీలను టార్గెట్ చేసి లైంగిక అత్యాచారాలు చేసారు. పసిపిల్లల్ని నిలువునా చీల్చి చంపి హాల్దీనదిలో విసిరేసారు. వందలమంది ఆచూకి ఇప్పటికీ లేదు. గుజరాత్‌లో కంటే కూడా సరికొత్త హింసా ప్రయోగాలు చేసారు. ఇండోనేషియా దేశానికి చెందిన సలీం గ్రూప్ సెజ్‌ల కోసం భూములు ఇవ్వకపోతే వేరే రాష్ట్రం వెతుక్కుంటామని బెదిరించిన దానికి పర్యావసానమే ఈ హత్యాకాండ. ఆ సి.పి.ఎం. ప్రభుత్వాన్ని ఈ రోజు నందిగ్రాం, సింగూరు ప్రజలు ఉప ఎన్నికల్లో ఘోరంగా ఓడించి తమ నిరసన తెలిపారు. అయినాకానీ బుద్ధదేవ్ భట్టాచార్య సెజ్‌లకోసం భూసేకరణను కొనసాగిస్తామనీ ఆపే ప్రసక్తే లేదని ప్రకటించారు.

మళ్ళా అవే కమ్యూనిస్టు పార్టీలు ఆంధ్రప్రదేశ్‌లో సెజ్‌లకు వ్యతిరేకంగా ఒక్క మాటా మాట్లాడకుండా, దళితుల కోసం భూసేకరణ ఉద్యమాన్ని ఎన్నికల ముందు మొదలుపెట్టాయి. సి.పి.ఎం. ఒక్కటేకాదు టి.డి.పి., కాంగ్రెస్, టి.ఆర్.ఎస్., బి.జె.పి. లాంటి పార్లమెంటరీ పార్టీలు అన్నీ కూడా సెజ్‌లకు తమ అనుకూల ధోరణినే ప్రకటిస్తున్నాయి. ప్రపంచీకరణ, సామ్రాజ్యవాద ధోరణులకు తగు అనుకూలతను ఎప్పటిలాగా కొనసాగిస్తుండడం ఒక సంప్రదాయం కూడ. ప్రపంచీకరణలో భాగంగా స్పెషల్ ఎక్స్‌పోర్ట్ జోన్స్ (ప్రత్యేక ఎగుమతుల మండలాలు) కాస్తా ప్రత్యేక ఆర్థిక మండలాల రూపం తీసుకొంది. చైనాలో ప్రభుత్వ ఆధీనంలో కొనసాగుతున్న సెజ్‌లు ఏడు మాత్రమే. ఆ దేశంలో చూపిస్తున్న పారిశ్రామికీకరణ, ఆర్థికాభివృద్ధిని చూసిన మురసోలి మారన్ మన దేశంలో వాటిని మొదలు పెట్టే పనికి నాంది పలికిన ఫలితమే ప్రస్తుత సెజ్‌ల ఉపద్రవం. భారతదేశంలో సెజ్‌ల పేరుతో జరుగుతున్న భూకబ్జా వెనక పాలకులు, బడాకంపెనీల రియల్ ఎస్టేట్ వ్యాపారం కుట్ర ఉంది. విదేశీ కంపెనీలకే భూమినిచ్చే పని అయితే వెనకబడ్డ ప్రాంతాల్లో సెజ్‌లు పెట్టాలి. కానీ, అన్నీ సెజ్‌లు అభివృద్ధి చెందిన పట్టణాల్లో అదీ నగరానికి 45-70 కిలోమీటర్ల దూరంలో మాత్రమే ఉండడానికి కారణం కేవలం రియల్ ఎస్టేట్ వ్యాపారం కోసం ఉద్దేశించి మాత్రమే. భూసేకరణ కేవలం పరిశ్రమలు, ఎగుమతుల కోసం మాత్రమే జరగడం లేదన్నది స్పష్టం.

సరిగ్గా హైదరాబాద్ నగరానికి 75 కిలోమీటర్ల దూరాన ఉన్న జడ్చర్ల మండలంలో నేషనల్ హైవేకి రెండు, మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న మాదిరెడ్డిపల్లె, పోలేపల్లి, గుండ్లగడ్డ తాండాల్లో 1240 ఎకరాల్లో అసైన్డ్, పట్టా భూముల్ని ఆక్రమించుకొని ఎనభై ఎకరాలు అరబిందో ఫార్మాస్యూటికల్స్ కంపెనీకి, డెబ్బై ఎకరాలు హెటిరో డ్రగ్స్‌కి ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ కార్పొరేషన్ (ఎ.పి.ఐ.ఐ.సి.) ద్వారా ఆక్రమించుకుని కంపెనీలకు అమ్మేసుకొంది. ఆ ప్రాంతాల్లో దాదాపు అరవై ఫార్మా సెజ్‌లకు అనుమతి ఇచ్చింది.

అఖరికి అక్కడ శ్మశానవాటికలను కూడా ఆక్రమించుకొని ఎ.పి.ఐ.ఐ.సి. స్తంభాలను నాటింది. మొన్న రుక్కి అనే లంబాడా స్త్రీ గుండ్లగడ్డ తాండాకు చెందిన వృద్ధురాలు - ఎ.పి.ఐ.ఐ.సి. ద్వారా ఆరు ఎకరాల భూమిని కోల్పోయిన నిర్వాసితురాలు కుమిలిపోయి, గుండె ఆగి చనిపోతే శవాన్ని పాతిపెట్టడానికి శ్మశానం లేక ఒక రోజంతా గుడిసెలోనే శవాన్ని పెట్టుకున్నారు. సరిగ్గా ఉప ఎన్నికల ముందరి సందర్భంలో దీన్ని అవకాశంగా తీసుకున్న కాంగ్రెస్ అభ్యర్థి ప్రైవేట్ భూమిని శ్మశానానికి గెలిపిస్తారన్న ఆశతో ఇచ్చాడు.

పోలేపల్లిలో మూడు వందల యాభై మంది దళితుల భూమి పోయిం తర్వాత ఏమయ్యింది? పోలేపల్లి ఎలా ఉంది? ఆ రైతులు ఏమయ్యారు? ఒక సునామీ తర్వాత, లేదా భూకంపం తర్వాత ప్రజలు భూమినీ, ఇంటినీ, బంధువుల్ని, అయినవాళ్లనీ కోల్పోయిన తర్వాత తీవ్రమైన మానసిక ఒత్తిడిని, ఒక విభ్రాంతికి లోనవుతారు. దాన్నే పోస్ట్ ట్రామాటిక్ స్ట్రెస్ డిసార్డర్ (పి.టి.ఎస్.డి.) అంటారు. పోలేపల్లి రైతు ఇప్పుడు సరిగ్గా అదే స్థితిలో ఉన్నారు. 2003 నుంచీ అప్పటి టి.డి.పి. ప్రభుత్వం గ్రీన్‌పార్క్‌ల పేరుతో మొదలుపెట్టిన భూసేకరణ, కాంగ్రెస్ ప్రభుత్వం 2004 నుంచీ సెజ్‌ల కోసం, 2005లో పార్లమెంట్‌లో కేవలం

రెండు రోజులలో ఆమోదముద్ర వేసుకొన్న సెజ్ చట్టం వచ్చిన తర్వాత క్రూరమైన పద్ధతుల్లో సెజ్‌ల కోసం భూసేకరణ మొదలుపెట్టింది.

పోలేపల్లి ప్రజలు అక్కడి టి.ఆర్.ఎస్. కార్యకర్త, గ్రామ ఉపసర్పంచ్ తమ్ముడు ఉపేందర్ రెడ్డి నాయకత్వంలో అనేకసార్లు కలెక్టరేట్ ముందు అరబిందో, హెటిరో ఫార్మా సెజ్‌ల ముందు ధర్నాలు, రాస్తారోకోలు, అసెంబ్లీని ముట్టడించే ప్రయత్నాలు చేసి లాఠీదెబ్బలు తిని జైళ్లల్లో నిర్బంధింపబడ్డారు. స్త్రీలను జైళ్లలో, ఎక్కడంటే అక్కడ ముట్టుకొని పోలీసులు అసభ్యంగా ప్రవర్తించారు. దాదాపు ఈ పోరు మూడు సంవత్సరాలుగా నిరవధికంగా నడిచింది. ఈ క్రమంలో ఫ్యాక్టరీల వలన భూమి కోల్పోయిన నిర్వాసితులు నౌఖరీల్లో చేరారు.

ఆరుగాలాలు పండించే పంట భూముల్ని లాక్కొని – రైతుల్ని బిచ్చగాళ్లుగా, దినసరి కూలీలుగా మార్చిన ప్రభుత్వం ఉదారంగా రెండు రూపాయల కిలో బియ్యాన్ని వారి మొఖాన కొడ్తూ అభివృద్ధి పథకం అని ఊదరగొడుతోంది. 'మకళ్లాలల్ల వడ్లగింజల్ని గుంజుకొని మాకు బియ్యం గింజలు బిచ్చమేస్తాంది గీ బాడ్కవు సర్కారు. థూ!' అని ఛీత్కరిస్తున్నారు పోలేపల్లి ప్రజలు.

భూమిని కబ్జా చేసేందుకు రైతులకు, వాళ్ల పిల్లలకు ఉద్యోగాలు, రెండు వందల గజాల జాగాను వాదా చేసింది ప్రభుత్వం. అదీ దగా, పచ్చిమోసం. ఎందుకంటే సెజ్‌లో ఉద్యోగం ఇచ్చే అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి ఉండదు. కేవలం ఒక ప్రత్యేక విదేశీ భూభాగం కిందకి వచ్చే సెజ్‌ల యాజమాన్యానికే ఆ అధికారం ఉంటుంది. ప్రభుత్వం తనది కాని, తనకులేని అధికారాన్ని ఉన్నదిగా చూపించి రైతుల్ని భ్రమలకు, ఆశలకు లోనుచేసి మోసం చేసింది. దీన్ని మానవ హక్కుల కమిషన్ ఖండించి, కలెక్టర్‌కు నిర్వాసితుల పరిస్థితి ఏంటన్న నోటీస్ కూడా పంపింది. జైల్‌నుంచి విడుదల అయిన ఉపేందర్ రెడ్డి బ్రెయిన్ క్యాన్సర్‌తో కోమాలోకి వెళ్ళి చనిపోయినాడు. అదీ, మహిళా ఎస్.ఐ. నెడితే ఆయన తలకు దెబ్బ కూడా తగిలింది. విచిత్రంగా టి.ఆర్.ఎస్. అభ్యర్థి లక్ష్మారెడ్డి అరబిందో సెజ్ రావడానికి కారకుడైతే, టి.ఆర్.ఎస్. కార్యకర్త దానికి వ్యతిరేకంగా పోరాటం చేసాడు.

వచ్చిన 18 వేల రూపాయిల్లో (ఎకరానికి) అదికూడా ప్రభుత్వం రైతుకు ఇచ్చిన అసైన్డ్ భూమిని అభివృద్ధి చేసి సాగుయోగ్యంగా చేసినందుకు డెవెలప్‌మెంట్ ఛార్జెస్ కింద ఇచ్చిన సొమ్ము ఆర్.ఒ., ఎం.ఆర్.ఒ., కలెక్టర్, సర్పంచ్, పటేల్–పట్వారీ, పోలీస్ యంత్రాంగాలకు లంచాలుగా పోయాక మిగిలిన కొద్ది డబ్బు రైతు మొత్తం జీవితానికి భూమి ఇచ్చినంతగా శాశ్వత జీవనాధారంగా ఎలా మిగులుతుంది? రైతులేకాదు, రైతును నమ్ముకున్న రైతుకూలీలు, కౌలుదార్లు, ఎరువులు అమ్ముకునే వాళ్లు, చాకలి, మంగలి, గొర్రెలు మేపేవాళ్లు, యాదవులు, పశువులు కాసేవాళ్లు – ఇలా గ్రామంలో అంటే అన్ని కులాల వాళ్ళు, వృత్తుల వాళ్లు నష్టపోయి వలసలు వెళ్లిపోయారు. ప్రభుత్వానికి రైతుల భూములేకాదు, వాళ్ల నివాస స్థలాలు కావాలి. పోలేపల్లి గ్రామంలో పవన్ పార్మాస్యూటికల్ కంపెనీ వెదజల్లే కాలుష్యంతో బర్రెలు, గొర్రెలు చనిపోయాయి. ఆసిడ్‌తో ఇద్దరు పిల్లల కండ్లు పోయాయని గ్రామస్తులు చెబుతున్నారు. పోలేపల్లి గ్రామానికి ప్రాణధార వంటి ఉప నది పెదవాగు కూడా కాలుష్యమై చేపలు చచ్చి తేలుతున్నాయి. ఈ కంపెనీ ఇప్పుడు అరబిందో సెజ్‌లో కలిసిపోయింది. ఇప్పుడు ఈ మూడు కంపెనీలు వెదజల్లే కాలుష్యంతో పోలేపల్లి ప్రజలు ఆరోగ్యం ఏమైపోవాలి? ఇత్తడి బిందెల్లో నీరు నింపిన కొద్ది సేపటికి బిందెలోపటి గోడలు నీలిరంగులో మారేంతగా నీరు కాలుష్యమైతున్నదని అక్కడి ప్రజలు చెబుతున్నారు.

ఇప్పుడు ఈ రెండు ఫ్యాక్టరీల్లో కార్మికులుగా మారిన రైతులు అదే కష్టాన్ని తమ స్వంత భూముల్లో పడితే సంవత్సరానికి సరిపడే కంటే కూడా ఎక్కువ పంటను పండిస్తామని చెబుతున్నారు. ఆరుకాలాలు తమ స్వంత పొలాల్లో ఆముదాలు, కొర్రలు, వరి, కందులు, మినుములు, పత్తి లాంటి ఆయా కాలాల పంటలు పండించుకునే తమ భూముల్లోనే వెలసిన ఫ్యాక్టరీల్లో దినసరి కూలీలుగా మార్చేసిందీ ప్రభుత్వం.

ఒకప్పుడు భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు చేసి రైతులు సాధించుకొన్న హక్కులు, పెంచుకొన్న కూలీ రేట్లు అన్ని కోల్పోయి ఇప్పుడు ఈ నయా ఆధునిక భూస్వాముల కాళ్లమీద పడి 'ఒక్కపూట పనిప్పియ్యి బాంచెన్' అన్న కాడికే మళ్లీ పరిస్థితిని తీసుకువస్తున్నారు మన పాలకులు, విధానకర్తలు. తమ భూములకే హోమ్‌గార్డ్స్‌గా కాపలాకాస్తూ గుండెల్లో లావాలు మోస్తున్నారు పోలేపల్లి, ముదిరెడ్డిపల్లె యువకులు. ఏపుగా కోతకొచ్చిన పంటల్ని, చెలకల్లో మేస్తున్న పశువుల్ని పెట్రోలు పోసి కాల్చి భూమిని దోచుకున్న ప్రభుత్వం అదీ రైతు అభివృద్ధి ప్రణాళికలో భాగమేనని చెబుతోంది.

సెజ్‌ల తర్వాత పోలేపల్లిలో కుటుంబాలూ – సామాజిక సంబంధాల్లో వచ్చిన మార్పులు చూస్తే – రాజ్యహింస భూ నిర్వాసితులు మీద, తద్వారా స్త్రీలపైన పితృస్వామిక హింసతో పాటు అదనంగా పెరిగిన కుటుంబ హింస, సామాజిక హింసా దోపిడీలు ఎలా రూపం తీసుకుంటాయో అన్నది స్పష్టంగా కనపడుతోంది. గుండ్లగడ్డ తాండా పోలేపల్లిలో సెజ్‌ల తర్వాత దాదాపు నలభై ఒక్కమంది రైతులు తీవ్రమైన మానసిక ఒత్తిడికి లోనై తర్వాత గుండెపోటు వచ్చి చనిపోయారు. కొంతమంది అవమానం భరించలేక ఆత్మహత్యలు చేసుకొన్నారు.

వాళ్ల పిల్లలు చాలామంది అదృశ్యమైపోయారు. చాలామంది భర్తలు చనిపోయిన స్త్రీలు పిల్లలతో సహా బతుకుదెరువుకై నగరాలకు వలసలు పోయారు. చాలామంది అల్లుళ్లు భార్యల్ని కట్నంగా ఇచ్చిన భూమి పోయిందని పుట్టిళ్లల్లో వదిలేసారు. కుదిరిన ఆడపిల్లల పెళ్లిళ్లు ఆగిపోయాయి. మగపిల్లలు చదువులు ఆపి మేస్త్రీలుగా, ఫ్యాక్టరీల్లో కూలీలుగా, హోటల్స్‌లో సర్వర్స్‌గా కుదిరారు. అప్పులు తీర్చడానికి స్త్రీలు–పురుషులు ఇతర ప్రాంతాలకు భవన నిర్మాణ కూలీలుగా వలసలు పోయారు. చాలామంది అరబిందో–హెటిరో ఫార్మా సెజ్‌లలో దినసరి కూలీలుగా మారారు. ఫ్యాక్టరీ నిర్మాణ పనులు అయిపోయిన తర్వాత వాళ్ల గతి అధోగతే.

కంపెనీలలో ఇంక వీళ్ల అవసరం ఉండదు. ఐ.టి. ప్రొఫెషనల్స్, ఫార్మాసిస్ట్స్, డాక్టర్స్ – లాంటి వాళ్లే కావాలి. పోలేపల్లిలో పదవ తరగతి పాస్ కాని యువతనే ఎక్కువ. వాళ్లకు కూలీపని లేదా హోమ్‌గార్డ్స్ పని ఇస్తారు. అది అణిగిమణిగి ఉంటేనే. అది కాంట్రాక్ట్ పద్ధతిలో. ఆ మినహాయింపు సెజ్ చట్టానికి ఉంది.

కొడుకులు లేని వృద్ధస్త్రీలు–పురుషులు జడ్చర్ల టవున్‌లో బస్‌స్టాపుల్లో, హోటళ్ల ముందు బిచ్చమడుక్కుంటున్నారు. కట్నం ఇంకా తెమ్మని స్త్రీలపైన భర్తల, అత్తమామల హింస ఇంకా ఎక్కువైంది. సర్కారు బళ్లకు వెళ్లే చిన్నారి పిల్లలు టవున్లలో బాలకార్మికులుగా మారిపోయారు. ఇది పాలకులు సెజ్‌ల ద్వారా సాధించిన గ్రామీణ అభివృద్ధి.

## నాగభైరవ కోటేశ్వరరావు



ప్రముఖ కవి, సాహితీవేత్త 'కవన విజయం' సాహితీ రూపకం సృష్టికర్త డా. నాగభైరవ కోటేశ్వరరావు (77) జూన్ 14 మధ్యాహ్నం హైదరాబాద్‌లో మరణించారు. కొంతకాలంగా ఆయన అనారోగ్యంతో బాధపడుతున్నారు. ఆయన 1931లో ప్రకాశం జిల్లా కొరిశపాడు మండలం, రావినూతలలో జన్మించారు. 1971లో ప్రకాశం జిల్లా రచయితల సంఘ వ్యవస్థాపక కార్యదర్శిగా వ్యవహరించారు. కవిగా పద్యాన్ని పండించడమే కాక, వచన కవితకు వన్నె తెచ్చారు. 1953లో ఉపాధ్యాయుడుగా జీవితాన్ని ప్రారంభించారు. ఉపాధ్యాయుడుగా, గొప్ప దార్శనికుడుగా, సంఘసంస్కర్తగా, దేశభక్తునిగా, శాస్త్రవేత్తగా సేవలందించారు. రంగాజమ్మ, కన్నీటిగాథ, గుండ్లకమ్మ చెప్పిన కథ, నది చెప్పని కథ, మానవతా సంగీతం, తూర్పువాకిళ్లు, వెలుతురు స్నానం, పతాక శీర్షిక, దగ్ధగీతం తదితర రచనలు నాగభైరవకు ఎనలేని కీర్తిని తీసుకువచ్చాయి. ఆధునిక సాహిత్యంలో వివిధ కవిత్వ ఉద్యమాల తీరుతెన్నులు వివరించే 'కవన విజయం' సాహితీ రూపకం ఆయన చేసిన గొప్ప సాహిత్యకృషికి దర్పణం. సుమారు నాలుగు వందల ప్రదర్శనలు పొందిన ఈ రూపకం కవులు, సాహితీవేత్తలు, పత్రికల ప్రశంసలు అందుకుంది. సాహిత్య రంగానికి నాగభైరవ చేసిన కృషిని గుర్తించి తెలుగు యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్‌తో సత్కరించింది. కేంద్ర సాహిత్య అకాడమీ, దూరదర్శన్, ఫిలిం సెన్సార్ బోర్డ్, అధికార భాషాసంఘం, ఎ.పి. టెక్స్ట్ బుక్స్ కమిటీల సభ్యునిగా సేవలందించారు. గుళ్లాపల్లిలో నాగభైరవ ఎడ్యుకేషన్ స్థాపించి గ్రామీణ విద్యారంగం అభివృద్ధికి విశిష్ట సేవలందించారు. రాష్ట్రంలోని ఎన్నో సాహితీ సంస్థలు నాగభైరవను అనేక అవార్డ్‌లు, పురస్కారలతో ఘనంగా సన్మానించాయి. మూడు దశాబ్దాలు అధ్యాపకునిగా పనిచేసి వేలాదిమంది శిష్యులను కవులు, రచయితలు, ఉపాధ్యాయులుగా తీర్చిదిద్దారు. ◆

ఇక ఫార్మా ఫ్యాక్టరీల్లో కార్మికులుగా పనిచేస్తున్న పోలేపల్లి రైతాంగం పరిస్థితి ఘోరాతిఘోరంగా ఉంది. వీళ్లకి మనరాష్ట్ర కార్మిక చట్టాలు ఏవీ వర్తించవు. సెజ్ చట్టాలే వర్తిస్తాయి. సెజ్ చట్టం తన కంపెనీలో పనిచేస్తున్న ఏ ఒక్క కార్మికునికి ఏ ఒక్క హక్కుని గుర్తించదు, గౌరవించదు, ఆమోదించదు. ఆఖరికి కార్మికుడు పని చేసే క్రమంలో కంపెనీలో చనిపోయినా సరే, కార్మికురాలిపై లైంగిక అత్యాచారం జరిగినా సరే, రాష్ట్ర ప్రభుత్వ పోలీసులు ఆ నయా విదేశీ సంస్థానాల్లో పర్మిషన్ తీసుకొని వాళ్ల అనుమతిస్తేనే లోపలికి వెళ్లాల్సి ఉంటుంది. అంత కౄరంగా ఉన్నాయి సెజ్ చట్టాలు. పోలేపల్లి ఫార్మా సెజ్‌లలో కార్మికులకు వర్క్ పర్మిట్ కార్డ్ – వీళ్ల భూమి పోయింది, వీళ్లకు కూలీ ఇవ్వండి అని కలెక్టర్ దగ్గర్నించి తీసుకురావాలి. ఉదయం తొమ్మిదికల్లా నాలుగు కిలోమీటర్లు నడిచి కంపెనీకి రావాలి. ఒక్క నిముషం లేటైనా హోంగార్డ్స్‌తో గెంటిస్తారు. పనిముట్లు వాళ్లే తెచ్చుకోవాలి. తాగటానికి నీళ్లు కార్మికులే తెచ్చుకోవాలి. గుంటూరు-ఒరిస్సా-కేరళ నుంచి కూలీలను కాంట్రాక్ట్ పద్ధతిలో తీసుకువచ్చి స్థానిక స్త్రీలకు, కార్మికులకు పోటీగా తెచ్చి వాళ్లలో అభద్రతను నింపుతారు. ఎందుకు వాళ్లను తెచ్చుకొన్నారు అంటే చేస్తే చెయ్యండి, లేకపోతే లేదంటారు. పోలీసులను పిలుస్తామంటారు. ఎదిరించిన వారిని భయ పెట్టడానికి మనిషంత ఎత్తు కుక్కల్ని కాపలా పెట్టారు. చాలాసార్లు కార్మికులను బూతు మాటలు తిట్టడం, వలస కార్మికుల్ని బూటు కాళ్లతో తన్నడం చేస్తుంటారు. ముక్తావర్ అనే ఒరిస్సా కార్మికుడు యాజమాన్యం కొడితే రక్తాలు కారిన గాయాలను ప్రెస్ వాళ్లకు చూపించాడు.

కూలీ చేయించుకొని జీతం కూడా ఎగ్గొడుతున్నారు. పైసలు ఇవ్వటానికి రోజులు రోజు తిప్పించుకుంటారు. పనివేళలు 8-12 గంటలు. అదనపు జీతం కూడా ఇవ్వరు. వారానికి 4-5 రోజుల పని మాత్రమే ఉంటుంది. స్త్రీలను బూతు మాటలు, తిట్లతో లైంగిక వేధింపులకు గురిచేస్తారు.

ఈ కార్మికులకు ఐక్యమై పోరాటం చేసే, ప్రశ్నించి హక్కుల్ని సాధించుకునే వెసులుబాటు కూడా లేదు. ఇష్టంలేని వారిని వెంటనే పని లోంచి తీసేసే అధికారం సెజ్‌ల చట్టంలో ఉంది. పోలేపల్లి ఫార్మా సెజ్‌లలో ఇక బానిసల రాజ్యం కొనసాగుతోంది. పని భద్రత లేక నిత్యం అభద్రతలో అక్కడి రైతు కార్మికులు మానసిక ఒత్తిడికి లోనవుతున్నారు. అయితే వారు ఫ్యాక్టరీల్లో పనిచేస్తూనే ఉన్నా రైతుల నుంచి కార్మికులుగా – కూలీలుగా – బానిసలుగా మారినా పోరుబాట వీడలేదు. తమకు మద్దతు ఇస్తున్న ప్రజాసంఘాలతో కల్సి ప్రజాస్వామిక పోరాటాన్ని చేస్తూనే, రాజకీయ పోరాట పంథాని ఎంచుకుని ఉప ఎన్నికల్లో భూ నిర్వాసితులైన తప్పెట మొగులయ్య, ఎట్టి శ్రీనివాసులు, బుచ్చంగాలి శీనయ్య, దేపల్లి యాదయ్య, కందూరు నరసయ్య, ఎట్టి చినఎంకయ్య, ఊసేని సత్తెమ్మ, మాల జంగిలమ్మ అసెంబ్లీ స్థానాలకు పోటీ చేసి తమ భూముల్ని దోచుకున్న రాజకీయ పార్టీలతో తలపడి ఎనిమిది వేల ఓట్లు సాధించారు. ఇది తమను బిచ్చగాళ్లుగా మల్చిన రాజకీయ నాయకులపైన తమ నిరసన అని – ఓట్లు చీల్చి ప్రధాన రాజకీయ పార్టీలను ఓడించడమే తమ ధ్యేయమనీ, తమకు జరిగిన అన్యాయాన్ని లోకానికి తెలపడమే ఈ ఎన్నికల్లో పాల్గొనే వ్యూహం వెనకాల ఉద్దేశ్యాలనీ వారు చెప్పారు. పెరిగిన ఆత్మవిశ్వాసంతో, గుంజుకున్న భూమికి – భూమే నష్టపరిహారంగా కాదు జీవనాధారంగా ఇవ్వాలని డిమాండ్ చేసారు.

మళ్లీ మళ్లీ ఎం.ఆర్.ఒ. ఆఫీస్ ముందు, కలెక్టర్ ముందు సెజ్ చట్టాన్ని ఎత్తేయేలనీ, అక్కడి ఫార్మా సెజ్‌లను కూలగొట్టాలనీ అడపాదడపా ధర్నాలు చేస్తూనే ఉన్నారు. సెజ్‌లు తమ జీవితాన్ని ఎంత పెను విషాదంలో ముంచాయో ప్రపంచానికి చెబుతూనే ఉన్నారు. భూ విస్తీరణ చట్టాన్ని కూడా ఎత్తేసి దేవాదాయ, వక్ఫ్ భూములు అంటే దేవుడి భూములు, శ్మశాన దిబ్బెలు కూడా కబ్జా చేస్తూ దాన్నొక రాష్ట్ర ఆదాయ మార్గంగా చూపిస్తున్నారు– ఈ భూ బేహారులు. ◆

**ఆంధ్రప్రదేశ్‌లో ఆమోదం పొందిన ప్రత్యేక ఆర్థిక మండలాలు (సెజ్)**

| క్ర.సం. | సెజ్ పేరు | జిల్లా |
|---|---|---|
| 1. | దివీస్ లాబరేటరీస్ లిమిటెడ్ | విశాఖపట్నం |
| 2. | విప్రో లిమిటెడ్ | రంగారెడ్డి, |
| 3. | అపాచీ సెజ్ డెవలప్‌మెంట్ ఇండియా ప్రై. లి. | నెల్లూరు |
| 4. | ఎల్. అండ్ టి. ఫోనిక్స్ ఇన్ఫో పార్క్స్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 5. | హైదరాబాద్ జెమ్స్ సెజ్ లిమిటెడ్ | రంగారెడ్డి |
| 6. | సత్యం కంప్యూటర్స్ సర్వీసెస్ లిమిటెడ్ | రంగారెడ్డి |
| 7. | సత్యం కంప్యూటర్స్ సర్వీసెస్ లిమిటెడ్ | హైదరాబాద్ |
| 8. | సన్‌డ్యూ ప్రాపర్టీస్ ప్రై. లి. | హైదరాబాద్ |
| 9. | సి.ఎం.సి. లిమిటెడ్ | రంగారెడ్డి |
| 10. | సంఘీ సెజ్ ప్రైవేట్ లిమిటెడ్ | రంగారెడ్డి |
| 11. | వైట్‌ఫీల్డ్ పేపర్ మిల్స్ లిమిటెడ్ | పశ్చిమ గోదావరి |
| 12. | ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ కార్పొరేషన్ లిమిటెడ్ (ఎ.పి.ఐ.ఐ.సి.ఎల్.) | విశాఖపట్నం |
| 13. | హెటిరో ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ప్రై.లి. | విశాఖపట్నం |
| 14. | ఫ్యాబ్ సిటి ఎస్.పి.వి. (ఇండియా) లి. | రంగారెడ్డి |
| 15. | ఎ.పి.ఐ.ఐ.సి. | కృష్ణా |
| 16. | బ్రాండిక్స్ ఇండియా అపారెల్ సిటీ ప్రై.లి. | విశాఖపట్నం |
| 17. | ల్యాంకో హిల్స్ టెక్నోలజీ పార్క్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 18. | ఇందు టెక్‌జోన్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 19. | ఎమ్మార్ హిల్స్ టౌన్‌షిప్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 20. | బ్రాహ్మణీ ఇన్‌ఫ్రాటెక్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 21. | ఎ.పి.ఐ.ఐ.సి. | విశాఖపట్నం |
| 22. | ఎ.పి.ఐ.ఐ.సి. | విశాఖపట్నం |
| 23. | మేటాస్ ఎంటర్‌ప్రైజెస్ సెజ్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 24. | కాకినాడ సెజ్ ప్రై.లి. | తూర్పు గోదావరి |
| 25. | ఎ.పి.ఐ.ఐ.సి. | రంగారెడ్డి |
| 26. | డి.ఎల్.ఎఫ్. కమర్షియల్ డెవలపర్స్ లి. | రంగారెడ్డి |
| 27. | రామ్‌కీ ఫార్మా సిటీ (ఇండియా) ప్రై.లి. | విశాఖపట్నం |
| 28. | టాప్‌నాట్చ్ ఇన్‌ఫ్రాస్ట్కచ్చర్ లి. | హైదరాబాద్ |
| 29. | దివ్యశ్రీ ఎన్.ఎస్.ఎల్. ఇన్‌ఫ్రాస్టక్చర్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 30. | జె.టి. హోల్డింగ్స్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 31. | రుద్రదేవ్ ఇన్ఫోపార్క్ ప్రై.లి. (ఆర్.ఐ.పి.ఎల్.) | రంగారెడ్డి |
| 32. | సత్యం కంప్యూటర్స్ సర్వీసెస్ లిమిటెడ్ | విశాఖపట్నం |
| 33. | స్టార్‌గేజ్ ప్రాపర్టీస్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 34. | సెరీన్ ప్రాపర్టీస్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 35. | మహావీర్ స్కైస్కేపర్స్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 36. | నియోజెన్ ప్రాపర్టీస్ ప్రై.లి. | అనంతపురం |
| 37. | ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అండ్ కమ్యూనికేషన్ (ఐ.టి. అండ్ సి.) డిపార్ట్‌మెంట్ - హైదరాబాద్ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ (హుడా) | రంగారెడ్డి |
| 38. | ఎ.పి.ఐ.ఐ.సి. | మహబూబ్‌నగర్ |
| 39. | మేటాస్ వెంచర్స్ సెజ్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 40. | మేటాస్ హిల్ కౌంటీ సెజ్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 41. | ఎ.పి.ఐ.ఐ.సి. | మెదక్ |
| 42. | ఎ.పి.ఐ.ఐ.సి. | రంగారెడ్డి |
| 43. | లహరి ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్ | రంగారెడ్డి |
| 44. | వి.ఆర్. ఎంటర్‌ప్రైజెస్ | వరంగల్ |
| 45. | నవయుగ లీగల్ ఎస్టేట్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 46. | శ్రీ సిటీ ప్రై.లి. | చిత్తూరు |
| 47. | వి.జి.టి.ఎం. అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ | గుంటూరు |
| 48. | ఎం.ఎ.ఎస్. ఫ్యాబ్రిక్ పార్క్ (ఇండియా) ప్రై.లి. | నెల్లూరు |
| 49. | విప్రో లిమిటెడ్ | రంగారెడ్డి |
| 50. | ఎ.పి.ఐ.ఐ.సి. | వరంగల్ |
| 51. | ఎ.పి.ఐ.ఐ.సి. | తూర్పు గోదావరి |
| 52. | ఎ.పి.ఐ.ఐ.సి. | తూర్పు గోదావరి |
| 53. | ఎ.పి.ఐ.ఐ.సి. | చిత్తూరు |
| 54. | ఎ.పి.ఐ.ఐ.సి. | కడప |
| 55. | అపాచి ఇన్వెస్ట్‌మెంట్స్ హోల్డింగ్స్ ప్రై.లి. | హైదరాబాద్ |
| 56. | కె. రహెజా ఐ.టి. పార్క్ (హైదరాబాద్) ప్రై.లి. | రంగారెడ్డి |
| 57. | ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అండ్ కమ్యూనికేషన్స్ డిపార్ట్‌మెంట్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ఎ.పి.ఐ.ఐ.సి. | విశాఖపట్నం |
| 58. | ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ & కమ్యూనికేషన్స్ డిపార్ట్‌మెంట్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ఎ.పి.ఐ.ఐ.సి. | కృష్ణా |
| 59. | సి.ఎం.సి. లిమిటెడ్ | హైదరాబాద్ |
| 60. | భవన సాయి అసోసియేట్స్ | |
| 61. | జెన్‌పాక్ట్ ఇండియా | రంగారెడ్డి |
| 62. | వైట్ సిటీ ప్రాజెక్ట్స్ ఇంటర్నేషనల్ ప్రై.లి. | గుంటూరు |
| 63. | సత్యవేడు రిజర్వ్ ఇన్ఫ్రాసిటీ ప్రై.లి. | నెల్లూరు |
| 64. | ప్యారీ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కంపెనీ ప్రై.లి. | తూర్పు గోదావరి |
| 65. | జి.ఎం.ఆర్. హైదరాబాద్ ఇంటర్నేషనల్ విమానాశ్రయం | హైదరాబాద్ |
| 66. | పార్శ్వనాథ్ సెజ్ లిమిటెడ్ | హైదరాబాద్ |
| 67. | ఇన్ఫోసిస్ టెక్నాలజీస్ లిమిటెడ్ | రంగారెడ్డి |
| 68. | టాటా కన్సల్టెన్సీ సర్వీసెస్ | రంగారెడ్డి |
| 69. | కాగ్నిజెంట్ టెక్నాలజీ సొల్యూషన్స్ ఇండియా ప్రై.లి. | రంగారెడ్డి |
| 70. | ఇండియన్ ఫార్మర్స్ ఫర్టిలైజర్ కో-ఆపరేషన్ లి. | నెల్లూరు |
| 71. | అనంత్ టెక్నాలజీస్ లిమిటెడ్ | రంగారెడ్డి |
| 72. | రస్సాయ్ ప్రాపర్టీస్ అండ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | అనంతపూర్ |
| 73. | డా. రెడ్డీస్ ల్యాబరేటరీస్ లిమిటెడ్ | మెదక్ |
| 74. | దేవ్ భూమి రియల్టర్స్ ప్రై.లి. | రంగారెడ్డి |
| 75. | వైవొ బయోటెక్ లిమిటెడ్ | మెదక్ |
| 76. | రాగమయూరి బిల్డర్స్ ప్రై.లి. | కర్నూలు |
| 77. | సౌత్ కోస్టల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ డెవలప్‌మెంట్ కంపెనీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ ప్రై.లి. (ఎస్.సి.ఐ.డి.సి.ఎ.పి.) | ప్రకాశం-నెల్లూరు |

(మూలం : సెజ్‌ల గురించి కేంద్ర ప్రభుత్వ వాణిజ్య మంత్రిత్వశాఖ వెబ్‌సైట్)

*సెజ్‌లనూ తూర్పు ఇండియా కంపెనీని పోల్చి చూపుతూ, సెజ్ విధానం వల్ల హైదరాబాద్‌లో జరుగుతున్న పరిణామాలను కళ్లకు కడుతున్నారు* **డా. ఘంటా చక్రపాణి**

# మహాసెజ్‌గా మారనున్న హైదరాబాద్

చరిత్ర పునరావృతమవుతుందన్న సత్యాన్ని ఎన్నో సంఘటనలు, సందర్భాల తరువాత ఆవిష్కరించి ఉంటారు. ప్రతిరోజూ సూర్యుడు తూర్పున ఉదయించడం, పడమట అస్తమించడం గమనించి భూమి గుండ్రంగా ఉంటుందని, పదే పదే అదే కక్ష్యలో తిరుగుతుందనీ అర్థం చేసుకొన్నట్లే చరిత్ర గమనంలో కూడా గతించిన సందర్భాలు మళ్లీ మళ్లీ ఎదురవడం చూసి పునరావృతమవుతుందన్న నిర్ధారణకొచ్చి ఉంటారు. అలాంటి సందర్భమే ఇప్పుడు మళ్లీ వచ్చింది. అయితే ఇప్పుడు వందరెట్ల వేగంతో, విసురుగా, విధ్వంసంగా, విచ్ఛిన్నంగా వచ్చిపడింది. సరిగ్గా నాలుగు వందల సంవత్సరాల కిందట ఈ దేశంలోకి ప్రవేశించిన బహుళజాతి పెట్టుబడి బహుముఖాలుగా విస్తరించి ఇప్పుడు మారుమూల పల్లెల్ని, పంటపొలాల్ని ముట్టడిస్తోంది. అప్పుడు ఈస్టిండియా కంపెనీ రూపంలో దేశంలో ప్రవేశించిన కంపెనీ వ్యవస్థ ఇప్పుడు ప్రత్యేక ఆర్థిక మండలాల పేరుతో వాడవాడలా విస్తరిస్తోంది. గ్రామాలను, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను, వ్యవసాయాన్ని కుప్పకూల్చి ఇప్పుడు కొత్త వ్యాపార, వాణిజ్య, ఆధునిక నగర సంస్కృతిని నలుమూలల్లో వ్యాపింపజేస్తోంది. ఈ నయా సామ్రాజ్యవాద విస్తరణ పట్ల దేశవ్యాప్తంగా ఆందోళన వ్యక్తమవుతోంది. ఇప్పటిదాకా ప్రపంచీకరణను తలకెత్తుకుని తిరిగిన వాళ్లు కూడా ఇది ప్రమాదకరమైన ధోరణి అని, ఇదిట్లాగే కొనసాగితే దేశానికి ముప్పు తప్పదని అంటున్నారు.

### 1608

భారతదేశంలోకి ఈస్టిండియా కంపెనీ ప్రవేశించిన సంవత్సరం. సరిగ్గా ఇప్పటికి నాలుగు వందల సంవత్సరాల క్రితం ఈ దేశంలోకి విదేశీ పెట్టుబడి వచ్చిచేరింది. 1608 ఆగస్ట్ 24న ఈస్టిండియా కంపెనీకి చెందిన తొలి నౌక దేశానికి పశ్చిమ తీరంలో ఉన్న సూరత్ రేవులో లంగరేసి ఆగింది. వర్తక వ్యాపారాలు, ఎగుమతి దిగుమతులే ప్రధానమని చెప్పి దేశంలో దిగిన కంపెనీ క్రమక్రమంగా దేశపాలనా వ్యవహారాలను ప్రభావితం చేసే శక్తిగా ఎదిగింది. మొదటి వంద సంవత్సరాలు వాడవాడలా విస్తరించిన 'ఈ' కంపెనీ ఆ కాలంలోనే కోటానుకోట్ల రూపాయల ఆదాయం ఆర్జించింది. ఆనాటి కాలంలోనే 'రాయల్ డిక్రేట్'గా మారి అప్పటి ప్రభువుల మెప్పుపొంది పన్నులు, సుంకాల రాయితీలు పొందగలిగింది. అభివృద్ధి పేరుతో, పారిశ్రామికీకరణ పేరుతో, ఉపాధి పేరుతో, మౌలిక సదుపాయాల కల్పన పేరుతో ఏటా పదిలక్షల ఎకరాల చొప్పున భూములు, పంట పొలాలు, అడవులు ఆక్రమించుకొంటూ యావత్ భారతదేశాన్ని తన అధీనంలోకి తెచ్చుకోగలిగింది. మొత్తంగా 1780 నాటికి అంటే దాదాపు 170 సంవత్సరాల్లో ప్రత్యక్షంగా పరిపాలనలో జోక్యం చేసుకొంటూ తన అధీనంలో ఉన్న ప్రాంతాల్లో పన్నులు, సుంకాలు వసూలు చేసే వ్యవస్థగా అవతరించింది. ఇదే దేశంలో వలసపాలనకు, సామ్రాజ్యవాదానికి, దోపిడీకి, దాస్యానికీ దారి తీసింది. ఇలా దాదాపు రెండు వందల సంవత్సరాలు లూటీచేసిన కంపెనీ ఈ ఉపఖండం మొత్తాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదం చెరలోకి నెట్టివేసింది.

ఈస్టిండియా కంపెనీకి ప్రపంచంలో పెట్టుబడిదారీ వ్యవస్థకు బీజాలు నాటిన తొలి బహుళజాతి కంపెనీగా పేరుంది. కేవలం 125 మంది షేర్ హోల్డర్లు, 75 వేల పౌండ్ల పెట్టుబడితో వ్యాపారం మొదలు పెట్టిన ఈ కంపెనీ 'మదర్ ఆఫ్ మల్టినేషనల్ కంపెనీస్'గా వినుతికెక్కింది.

రెండు శతాబ్దాల్లో భారత దేశపు సకల సంపదలు కొల్లగొట్టి దేశాన్ని గుల్లచేసిన ఈస్టిండియా కంపెనీ తన సంపద కోసం వేల ఏళ్లపాటు సుసంపన్నంగా వర్ధిల్లిన భారతీయ ఆర్థిక వ్యవస్థను నేలమట్టం చేసింది. వ్యవసాయం, వృత్తులు, కళలు, మారకం, మార్కెట్ ఇట్లా మొత్తంగా దేశపు స్వపరిపాలనను, స్వయం సమృద్ధిని సమూలంగా కుప్పకూల్చి దేశ సార్వభౌమాధికారాన్ని బ్రిటిష్ సింహాసనానికి దాసోహం చేసింది. ఇట్లా ఈ దేశం మీద గుత్తాధిపత్యాన్ని స్థిరపరచుకోవడానికి ఈస్టిండియా కంపెనీ లాంటి 'ఆదిశక్తి'కి కనీసం రెండు వందల సంవత్సరాలు పట్టింది. ఆ ఒక్క కంపెనీకి వ్యతిరేకంగా నిలబడదానికి, ఆ కంపెనీ వ్యాపార సామ్రాజ్యానికి, సామ్రాజ్యవాదానికి ఎదురొడ్డి పోరాడి గెలవడానికి ఆ తరువాత మరో వందేళ్లు పట్టింది.

ఇప్పుడు దేశంలో ఆ కంపెనీ లేదు. కానీ ఆ కంపెనీని పోలిన, ఆ కంపెనీకంటే వందల రెట్లు బలమైన కంపెనీలు ఇవాళ దేశంలోకి వేలాదిగా వచ్చి చేరాయి. ఇంకా వస్తూనే ఉన్నాయి. నాలుగు వందల ఏళ్ల క్రితం ఈ కంపెనీకి చెందిన ఒకే ఒక్క నౌక నిలబడిన చోట ఇవాళ అనేక నౌకలు లైన్లో ఉన్నాయి. నౌకాశ్రయాలున్న సూరత్, బరోడా, ముంబాయ్, కొచ్చిన్, చెన్నై, విశాఖపట్నం, కోలకతా ఇట్లా దేశం నలువైపులా భూమి, వనరులు, వస్తు సంపద ఈ కంపెనీల చేతుల్లోకి చేరిపోయింది. ఉన్నవి చాలవన్నట్టు ఇప్పుడు తీరప్రాంతాల్లోని ప్రధాన పల్లెలన్నిటినీ పోర్టులుగా మారుస్తున్నారు. కోస్తా తీరమంతా కారిడార్లుగా విస్తరిస్తున్నారు. ఈ కారిడార్లలోకి రమ్మని, పెట్టుబడులు పెట్టమని ప్రజా ప్రభుత్వాలు ఇవాళ ఈ బహుళజాతి సంతతికి సాగిలబడి స్వాగతాలు పలుకుతున్నాయి.

ఆర్థిక సంస్కరణలు – అనువైన వాతావరణం పేరుతో ఇప్పటికే చట్టాలన్నీ 'సరళీకరణ' చేసిన ప్రభుత్వాలు ఇప్పుడు ఈ దేశాన్ని ఖండ ఖండాలుగా విభజించి కొత్తగా వస్తోన్న కంపెనీలకు, పారిశ్రామిక వేత్తలకు, బహుళజాతి వ్యాపార కూటములకు అప్పగిస్తున్నాయి. ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్‌ల) పేరుతో ఇప్పుడు విస్తరిస్తోన్న ఈ కొత్త సామ్రాజ్యాలు దేశాన్ని కొల్లగొట్టేందుకు సిద్ధమవుతున్నాయి. అందుకోసం ప్రభుత్వం స్వయంగా సెజ్ చట్టం 2005లో అన్ని చర్యలు తీసుకున్నది. ఈ చట్టం ఆమోదం పొందిన ఈ రెండేళ్లలో ఇప్పటికి దాదాపు ఐదు వందల కంపెనీలకు సెజ్‌లు ఏర్పాటు చేసుకోవడానికి కేంద్ర ప్రభుత్వం అన్ని రకాల అనుమతులు ఇచ్చింది. ఈస్టిండియా కంపెనీని తలదన్నే రీతిలో వస్తోన్న ఈ ప్రత్యేక మండలాలు లక్షలాది మంది మదుపరులు, కోట్లాదిమంది వినియోగదారులను కొల్లగొట్టే కొత్త సామ్రాజ్యవాద పెట్టుబడిని దేశంలో విస్తరించబోతున్నాయి.

ఈస్టిండియా కంపెనీ కనీసం ఓ వందేళ్ల పాటయినా దేశ చట్టాలకు, నియమాలకు లోబడి వ్యాపారం చేసుకొన్నది. చేస్తున్నది మిరియాలు, పత్తి, పొగాకు, తేయాకు, కాఫీ లాంటి చిల్లర వ్యాపారమే అయినా మార్కెట్ సూత్రాలను అనుసరించి నడుచుకున్నది. పరిశ్రమలు స్థాపించి, దేశ వర్తక వాణిజ్య అభివృద్ధిలో ప్రధానమైన శక్తిగా ఎదిగేంత వరకు అణిగిమణిగే ఉన్నది. కానీ సెజ్ చట్టం ఇప్పుడు కంపెనీలకు గుత్తాధిపత్యాన్ని అప్పగిస్తున్నది. సెజ్‌ల వల్ల విదేశీ పెట్టుబడులు వస్తాయని, ఉద్యోగాలు దొరుకుతాయని, అభివృద్ధి చెందుతామని చెప్పటం కేవలం ఆశలు కల్పించేందుకే తప్ప సెజ్‌లనేవి స్వతంత్ర జాగీర్లుగా అవతరించబోతున్నాయని పాలకులుకు తెలియంది కాదు.

### జమీందార్ల జాగీర్లు

'సెజ్' అంటే పరిశ్రమ కాదు. ఉత్పత్తి చేసి ఉపాధి కల్పించే వ్యవస్థ అంతకంటే కాదు. సెజ్ అనేది పరిపాలనా వ్యవహారాలు, ఆర్థిక లావాదేవీలు, నియంత్రణ విషయంలో సర్వ స్వతంత్రంగా ఉండే ఒక ప్రదేశం. అంటే ఈ దేశంలో అమలయ్యే చట్టాలుగానీ, శాసనాలుగానీ, పన్నుల వ్యవస్థగానీ, సుంకాలు గానీ అమలు కాకుండా ఎలాంటి అనుమతులు, పరిమితులు లేకుండా ఎగుమతి దిగుమతుల్ని చేసుకోవడానికి వీలున్న 'విముక్త' ప్రాంతం. సెజ్ యజమానిని 'డెవలపర్' అంటున్నారు. అంటే భూమి సేకరించి అభివృద్ధి చేసే వాడన్నమాట. అతను ఆ సెజ్ భూభాగానికంతటికీ యజమాని. ఆ భూమి, ప్రాంతం మీద అతనికి సర్వహక్కులు ఉంటాయి. అది అతని సొంత జాగీరు. అందులో రకరకాల వాణిజ్య వ్యాపార లావాదేవీలకు అవసరమైన వసతులన్నీ అతను కల్పిస్తాడు. ఆ భూభాగంలో అతను ఏం చేస్తాడు, ఎలాంటి వ్యాపారం, పరిశ్రమ ప్రారంభిస్తాడు, అక్కడ ఏ రకమైన కార్యకలాపాలు సాగుతాయి అన్న విషయం ప్రభుత్వానికి వివరించ వలసిన అవసరం లేదు. ఆ భూభాగంలో స్థానిక ప్రభుత్వ సంస్థలైన గ్రామ పంచాయితీ గానీ, మున్సిపాలిటీగానీ జోక్యం చేసుకునే వీలులేదు. వేలాది ఎకరాలు సేకరించి సొంతం చేసుకోవడానికి ఇప్పటి వారికున్న ఏ భూపరిమితి చట్టం కూడా సెజ్‌లకు వర్తించదు. అంటే సెజ్ ఏర్పాటు చేయాలనుకున్న వ్యక్తి ఎన్నీ వేల ఎకరాల భూమినయినా సొంతం చేసుకోవచ్చు. ఆ భూమిలో ఆ ప్రాంతానికి, ఆ పరిసరాలకు సంబంధం లేని, ఉపయోగపడని ఏ రకమైన ఉత్పత్తినైనా చేసుకోవచ్చు. ఎవరైనా సరే భూమి చూపించి, సెజ్ ఏర్పాటు చేయడానికి ముందుకు వస్తే నలభై ఐదు రోజుల్లో ప్రభుత్వం అన్ని అనుమతులు ఏకకాలంలో ఇచ్చివేసి ఆ ప్రాంతాన్ని 'సెజ్'గా నోటిఫై చేస్తుంది.

'సెజ్'లలో పరిపాలనా వ్యవహారాలన్నీ 'డెవలప్‌మెంట్ కమిషనర్' చూసుకుంటాడు. సెజ్‌కు సంబంధించినంత వరకు ఈ డెవలప్‌మెంట్ కమిషనర్ సర్వాధికారి. అతనే చట్టం, అతనే న్యాయం, అతనే సమస్తం. ఆ సెజ్‌లో నెలకొల్పుతున్న పరిశ్రమలు, ఆ పరిశ్రమల్లో పనిచేస్తున్న కార్మికుల వ్యవహారాలు, ఆ పరిశ్రమలు లేదా కంపెనీల లావాదేవీలు, ఆయా కంపెనీలకు కావాల్సిన వసతి సౌకర్యాలు ఇట్లా అన్ని పర్యవేక్షించే 'కేర్ టేకర్' ఆయన. సాధారణంగా ఒక పరిశ్రమగానీ, కంపెనీ గానీ లేక వ్యాపారం గానీ ప్రారంభించాలంటే కనీసం పది పన్నెండు సంస్థల నుంచి పర్మిషన్లు పొందాలి. మున్సిపాలిటీ లేదా పంచాయతీ మొదలు ఎగుమతులు, దిగుమతులకు సంబంధించిన కస్టమ్స్ సుంకాల దాకా అనేక పన్నులు చెల్లించాలి. ఉద్యోగాల నియామకం, భద్రత, వారి భవిష్య నిధి పట్ల నిబంధనలు అమలుచేస్తూ ఆ కంపెనీ కార్మిక సంక్షేమ మంత్రిత్వ శాఖకు జవాబుదారుగా ఉండాలి. అంటే కంపెనీ ప్రభుత్వ ప్రత్యక్ష, పరోక్ష పర్యవేక్షణలో పనిచేయాలి. కానీ సెజ్‌ల చట్టం వీటన్నిటి నుంచీ సెజ్‌లో నెలకొల్పే పరిశ్రమలు, వ్యాపారాలకు మినహాయింపు నిచ్చింది. చట్టంలోని 49వ సెక్షన్, సెజ్ డెవలప్‌మెంట్ కమిషనర్‌కే ఈ అన్ని అధికారాలు అప్పగిస్తూ అతన్ని స్వతంత్ర పర్యవేక్షకుడిగా పేర్కొంటూ దేశంలో అమలవుతున్న ఏ పారిశ్రామిక, కార్మిక చట్టం కూడా సెజ్‌లో అమలు కావాల్సిన అవసరం లేదంటూ పేర్కొంటున్నది. అందుకు అనుగుణంగా చట్టాలను మార్చుకునే అవకాశాన్ని కూడా ఈ చట్టం కల్పిస్తున్నది.

అందుకే ఈ చట్టం నిరంకుశమైందన్న వాదనలు వినిపిస్తున్నాయి. ఇప్పటివరకు ప్రభుత్వ అజమాయిషీకి, వివిధ శాఖల పర్యవేక్షణకు, నియంత్రణకు ఉన్న అన్ని ప్రజాస్వామిక అవకాశాలను ఈ చట్టం తొలగించి వేస్తున్నది. అంతే కాకుండా రెవెన్యూ, పరిపాలన, నిర్వహణ, ఆర్థిక, న్యాయ, కార్మిక సంక్షేమ, పర్యావరణ అంశాలతో పాటు విదేశీ వాణిజ్య వ్యవహారాలన్నీ ఒకే అధికారి చేతుల్లో పెట్టడం అంటే సెజ్ ప్రాంతాన్ని ఒక స్వయం ప్రతిపత్తి గలిగిన ప్రత్యేక రాజ్యంగా ప్రకటించడమే అవుతుందన్న విమర్శలు వస్తున్నాయి. ఇది రాజ్యాంగం కల్పించిన అనేక అభివృద్ధి అవకాశాలకు అవరోధంగా ఉందని, జాతీయవాద స్ఫూర్తికి విరుద్ధమనీ అంటున్నారు.

అయితే ప్రభుత్వం ఈ వాదనలేవీ వింటున్నట్టు లేదు. కేవలం సెజ్‌ల వల్ల పెట్టుబడులు, విదేశీ వర్తకం అభివృద్ధి చెందుతుందని ఇది దేశ ఆర్థిక వ్యవస్థకు ప్రాణవాయువని ప్రచారం చేస్తోంది. అంతే కాకుండా దేశంలో పెరిగిపోతున్న నిరుద్యోగానికి ఇదొక్కటే పరిష్కారమని నమ్మ బలుకుతోంది. ఈ సెజ్‌ల వల్ల దేశంలో లక్షలాది ఉద్యోగాలు రాబోతున్నాయనీ ప్రచారం చేస్తోంది.

లక్షలాది కొత్త ఉద్యోగాలు కల్పిస్తామని ప్రభుత్వం చేస్తోన్న వాదనలో ఎంత మాత్రం వాస్తవం లేదన్నది అర్థమవుతూనే ఉంది. అవసరానికి మించిన సంఖ్యలో సెజ్‌లకు అనుమతులు ఇచ్చినా ఆశించిన మేర పెట్టుబడులు రాలేకపోతున్నాయి. ఇక ఉద్యోగాల సంగతి సరే

సరి. అసలు ఈ సెజ్‌ల వల్ల ఎన్ని ఉద్యోగాలు వస్తాయన్న విషయంలోనే ప్రభుత్వాలకు స్పష్టత లేదు. సెజ్‌ల వల్ల దేశవ్యాప్తంగా కనీసం ముప్పై లక్షల కొత్త ఉద్యోగాలు రావచ్చునని ఇప్పటి సెజ్‌ల రూపశిల్పి కేంద్ర వాణిజ్య శాఖమంత్రి కమల్‌నాథ్ అంచనా వేస్తుంటే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. వై.ఎస్. రాజశేఖరరెడ్డి మాత్రం మన రాష్ట్రంలో ఏర్పాటు కానున్న సెజ్‌లలోనే వచ్చే నాలుగేళ్ల కాలంలో కనీసం ఇరవై ఏడు లక్షల కొత్త ఉద్యోగాలు వస్తాయని పదే పదే చెపుతున్నారు. నిజానికి ఈ సెజ్‌లలో పరిశ్రమలో వ్యాపారాలో ప్రారంభించేందుకు ఎవరైనా వస్తారా, వస్తే ఎలాంటి పరిశ్రమలు వస్తాయి, ఎలాంటి ఉద్యోగాలు ఉంటాయి అనే విషయం ఎవరికీ తెలియదు. ప్రభుత్వం ప్రకటించిన చట్టం లక్ష్యాల్లో ఉద్యోగాల కల్పన ఒకటి అని పేర్కొన్నప్పటికీ కచ్చితంగా ఉద్యోగాలు కల్పించే లేబర్ ఇంటెన్సివ్ పరిశ్రమలే పెట్టాలన్న క్లాజు ఏమీలేదు. అందుకే ఏ రకమైన పరిశ్రమలు వస్తాయో తెలియని సెజ్ డెవలపర్లు మల్టీ ప్రొడక్ట్ సెజ్‌లని, ఐటి, ఐటి ఆధారిత పరిశ్రమలని ఊహాజనితమైన లక్ష్యాలతో సెజ్‌ల అనుమతి పొందుతున్నారు. నిజానికి ఇప్పటి వరకు ఏర్పాటైన సెజ్‌లు అన్ని కలిపి కూడా పది లక్షల ఉద్యోగాలు కూడా కల్పించలేక పోతున్నాయి. అసలు ఈ సెజ్‌ల ఏర్పాటు వెనుక ప్రధాన లక్ష్యం ఉద్యోగాలో, విదేశీ పెట్టుబడులో, ఎగుమతులో కాదని కేవలం దేశంలోని ప్రధానమైన ప్రాంతాల్లో ఉన్న విలువైన భూములు కాజేసి, రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసుకోవడంతో పాటు ఈ కంపెనీలు తమ ఎస్టేట్లు నిర్మించుకోవడమేనని ఇప్పటిదాకా జరుగుతోన్న తతంగం చూస్తే అర్థమవుతోంది. సెజ్ విధానం ప్రకటించిన వెంటనే దేశంలోని ప్రధాన పెట్టుబడిదారీ సంస్థలన్నీ తమ తమ వ్యాపారాలన్నిటినీ సెజ్ పరిధిలోకి తెచ్చుకొని పన్నుల మినహాయింపు ద్వారా కోట్లాది రూపాయలు కూడబెట్టుకున్నాయి. సెజ్ నిబంధనలు చూపి లక్షలాది ఎకరాల భూములు సంపాదించుకొన్నాయి. తమ కంపెనీలకు అనుబంధంగా రియల్ ఎస్టేట్, ఇన్ఫ్రాస్ట్రక్చర్ డెవలప్‌మెంట్ కంపెనీలు ఏర్పాటు చేసుకుని వేల కోట్ల రూపాయల వ్యాపారం మొదలుపెట్టాయి. ఇట్లా ఈ కంపెనీలు, వాటి యజమానులు కోట్లకు పడగలెత్తుతుంటే రైతులు, కూలీలు, గ్రామీణ పేదలు మాత్రం ఉపాధి కోల్పోయి వీధిన పడుతున్నారు.

## ఎవరికి లాభం - ఎవరికి నష్టం?

సెజ్‌లు పెట్టుబడిదారీ కంపెనీలను ప్రోత్సహిస్తూ పేదరైతుల పొట్టలు కొడుతున్నాయి. దేశం మొత్తం మీద ఇప్పుడు వస్తోన్న సెజ్‌ల వల్ల దాదాపు ఏడు లక్షల ఎకరాల భూములు ఈ కంపెనీల ఆధీనంలోకి పోనున్నాయి. మరోవైపు కనీసం లక్షన్నర కుటుంబాలు వ్యవసాయం నుంచి తప్పుకోవాల్సి వస్తోంది. మరో లక్ష కుటుంబాలు వ్యవసాయపు పనుల నుంచి వైదొలగవలసి వస్తోంది. ఒక్కొక్క కుటుంబానికి సగటున ఐదుగురు సభ్యులుంటారనుకున్నా కనీసం పన్నెండున్నర లక్షల మంది ప్రత్యక్షంగా జీవనాధారం కోల్పోతున్నారు. ఇంకా పరోక్షంగా వ్యవసాయం, భూమి, ఆ భూమిపై ఉన్న చెట్లు, చేమలు, చెరువులు, కుంటల పై ఆధార పడిన వృత్తులు, కులాలు, కుటుంబాలను లెక్కలోకి తీసుకుంటే ఈ సెజ్‌ల ప్రభావం కనీసం ఇరవై నుంచి ఇరవై ఐదు లక్షల మందికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ నష్టం కలిగిస్తున్నాయి. బతుకుదెరువు లేకుండా చేస్తున్నాయి. భవిష్యత్తులో ఎలాంటి ఉద్యోగాలు వస్తాయి, ఎవరికి ఉపాధి దొరుకుతుందో తెలియని ఈ సెజ్‌ల మూలంగా ఇప్పుడు మాత్రం భారీ విధ్వంసం జరుగుతోంది.

సెజ్‌లు గ్రామీణ సమాజాన్ని విచ్ఛిన్నం చేసి ఆర్థిక వ్యవస్థను కుప్పకూల్చే వ్యవస్థలుగా మారుతున్నాయని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. సెజ్‌లు వ్యవసాయ భూములను సేకరించి ఎస్టేట్లుగా మార్చడం వల్ల దేశంలో దాదాపు ఏటా పదిలక్షల టన్నుల ఆహార ధాన్యాల లోటు ఏర్పడబోతోందని ఒక అంచనా. అలాగే వ్యవసాయం పై ప్రత్యక్షంగా ఆధారపడ్డ కుటుంబాలు పనికి దూరం కావడం వల్ల ఏడాదికి కనీసం 212 కోట్ల రూపాయల ఆదాయం కోల్పోయి బికారులౌతారని ఢిల్లీకి చెందిన సిటిజన్స్ కలెక్టివ్ లెక్కగట్టింది. ఇక పరోక్షంగా కూడా భూమి, వ్యవసాయాధార వృత్తుల మీద ఆధారపడ్డ గొర్రెలు, పశువుల కాపర్లు, పశు పోషకులు, వడ్రంగి, కమ్మరి, తెనుగు, బెస్తవంటి కులాల ఆదాయ నష్టాన్ని కూడా లెక్కగడితే వీటివల్ల జరిగే నష్టం ఏటా ఏడు వందల కోట్లకు పైమాటే ఉండొచ్చు. ఇది గ్రామీణ సమాజం కోల్పోతున్న ఆదాయం సంగతి. మరోవైపు సెజ్‌ల పేరుతో ఉన్న వ్యాపారాలను మరింత విస్తరించుకుంటున్న కంపెనీలు, కొత్తగా వ్యాపారం మొదలుపెట్టిన కంపెనీల పన్నుల మినహాయింపుల వల్ల వచ్చే నష్టం దాదాపు లక్ష అరవై వేల కోట్ల పైనేనని రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నివేదికలు పేర్కొంటున్నాయి. ఇప్పుడున్న సెజ్‌లు నిర్వహిస్తోన్న వ్యాపారాలపై ఇస్తోన్న పన్నులు, సుంకాల రాయితీలను లెక్కగట్టిన ఆర్థిక శాఖ 2007-2010 మధ్య కాలంలోనే ప్రభుత్వం కోల్పోనున్న ఆదాయాన్ని ఈ మేరకు అంచనా వేసింది. ఈమేరకు సెజ్‌లు ప్రజలకు రావాల్సిన ఈ సొమ్మును తమ లాభాల ఖాతాలలో జమ చేసుకుంటున్నాయి.

ప్రజలకు ప్రత్యక్షంగా నష్టం కలిగిస్తూ పెట్టుబడిదారులకు లాభాలు కుమ్మరిస్తోన్న ఈ సెజ్‌లను ప్రభుత్వం ఎందుకు ప్రోత్సహిస్తున్నట్టు, ఈ విధానం వల్ల అంతిమంగా ఎవరికి మేలు కలుగుతుంది అన్న విషయాలు చర్చలోకి వస్తున్నాయి. ఇది పూర్తిగా రాజకీయ పార్టీలు, ప్రభుత్వంలో ఉన్న పక్షాలు తమ స్వప్రయోజనాల కోసం విస్తరిస్తోన్న వ్యాపారమని ఇటీవలి విశ్లేషణలను బట్టి అర్థం అవుతోంది. దేశంలోని బడా పారిశ్రామిక సంస్థలు, విదేశీ వాణిజ్య కంపెనీలతో, బహుళజాతి శక్తులతో కలిసి ఈ విధానాన్ని తమకు అనుగుణంగా మార్చుకుంటున్నాయి. ప్రపంచబ్యాంక్ ఈ విధానం వెనుక ప్రధాన సూత్రధారిగా ఉండి పెట్టుబడిదారీ దేశాల, వాటి కంపెనీల ప్రయోజనం కోసం పేద, అభివృద్ధి చెందుతున్న దేశాలను ఈ ఊబిలోకి నెడుతున్నాయి. సెజ్‌ల వల్ల రెండు ప్రయోజనాలను ప్రపంచబ్యాంక్ ఆశిస్తోంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఎక్కువ నిరుద్యోగం ఉండడం వల్ల, తక్కువ జీతానికే పనిచేసే శ్రామికుల సంఖ్య ఎక్కువ. అభివృద్ధి చెందిన దేశాలకు అవసరమైన వస్తూత్పత్తి కేంద్రాలను ఈ పేద, ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న దేశాలల్లోకి తరలించడం వల్ల తక్కువ ఖర్చుతో ప్రపంచానికి కావాల్సిన వినియోగ వస్తువులు ఉత్పత్తి చేసుకోవచ్చు. ఇకపోతే ఈ దేశాల్లో ఉన్న సహజ వనరులను తమకు కావాల్సిన సరుకుల ఉత్పత్తికి వాడుకోవచ్చు. దీంతో అభివృద్ధి చెందిన, సంపన్న దేశాల్లోని ప్రజల అవసరాలకు కావాల్సిన సరుకులు కొరత లేకుండా, తక్కువ ధరల్లో అందుబాటులోకి వస్తాయి. ఉద్యోగాలు కల్పించలేని పేదదేశాల ప్రభుత్వాల బలహీనత ఈ

బహుళజాతి శక్తులకు బాగా ఉపయోగపడుతోంది. సరళీకరణ విధానాలు అమలై ఒకటి రెండు దశాబ్దాలు దాటుతున్నా ఆశించినమేరకు ఉద్యోగాలు దొరక్కపోగా, నిరుద్యోగం విపరీతంగా పెరిగిపోతోంది. దీనివల్ల ఉపాధి కల్పనపై ప్రభుత్వాలు ఎక్కువగా డబ్బుపెట్టాల్సి వస్తోంది. ప్రభుత్వాల దగ్గరి వనరులు అందుకు సరిపోక ఉక్కిరిబిక్కిరి అవుతున్న తరుణంలో ఈ సెజ్ పాచిక వచ్చిపడింది. ప్రైవేట్ కంపెనీలకు మౌలిక వసతులు కల్పిస్తే సరిపోతుందన్న ఆలోచనలతో ఇప్పటి దాకా కేవలం మార్కెట్లను మాత్రమే సరళతరం చేసిన దేశాలు ఇప్పుడు వనరులు, ముఖ్యంగా భూమిపై శాశ్వత హక్కులను ఈ కంపెనీలకు అప్పగిస్తున్నాయి. కేవలం భూమి మీద అధికారం మాత్రమే కాక భారత ప్రభుత్వం రూపొందించిన సెజ్ పాలసీ గ్రామాలు ధ్వంసం చేసి, వ్యవసాయాన్ని కుప్పకూల్చి కొత్త పారిశ్రామిక కేంద్రాలు, ప్రైవేట్ నగరాలు, పట్టణాలు ఏర్పాటు చేసే కొత్త ప్రక్రియకు సెజ్ చట్టం ద్వారా వీలు కల్పిస్తుంది. ఇది ముంబాయిలో రిలయన్స్ కంపెనీతో మొదలయ్యింది. ముంబాయిలో రిలయన్స్ సెజ్ నవీ ముంబయ్ పేరుతో ఒక నయా సామ్రాజ్యాన్ని నిర్మిస్తోంది. దాని విస్తీర్ణం ఇప్పుడున్న పాత ముంబయ్‌తో సమానం. ఈ నగరం మీద సర్వహక్కులు, సార్వభౌమాధికారం పూర్తిగా రిలయన్స్ కంపెనీకే ఉంటుంది. అంటే అది అంబానీ రాజ్యం కాబోతోంది. అట్లాంటి రాజ్యాలు మరో కొద్ది రోజుల్లో ఈ దేశంలో కనీసం ఐదు వందల దాకా ఆవిర్భవించ బోతున్నాయి. అందులో హైదరాబాద్ కూడా ఒకటి కాబోతోందన్న సూచనలు కనిపిస్తున్నాయి.

## హైదరాబాద్ కథ

ఈస్టిండియా కంపెనీ రాకకంటే పది పదిహేనేళ్ల ముందు కులికుతుబ్ షా హైదరాబాద్ నగరాన్ని నిర్మించాడు. గడిచిన చరిత్రలో తొలి నాలుగు వందల సంవత్సరాల్లో ఈ నగరం ప్రపంచంలోనే అత్యంత విలక్షణమైన నగరంగా వినుతికెక్కింది. భిన్న మతాలు, భిన్న సంస్కృతులు, జాతులు, తెగలు, భాషలకు చెందిన ప్రజలకిది ప్రధాన కేంద్రం అయ్యింది. భారత దేశపు నడిబొడ్డున ఉన్న ప్రాచీన పర్షియన్ సంస్కృతికి, వాస్తుకళకి హైదరాబాద్ పెట్టిన పేరుగా నిలిచింది. ఉర్దూ, తెలుగు, మరాఠీ, కన్నడాలతో పాటు గుజరాతీ, బెంగాలీ, హిందీ, తమిళ, మలయాళ భాషలు మాట్లాడే ప్రజలతో ఉత్తర, దక్షిణ భారతీయ సంస్కృతికి వారధిగా నిలిచింది. 1790 తరువాత ఈస్టిండియా కంపెనీకి తొత్తులుగా మారిన నైజాం పాలకులు వారినుంచి సైనిక, రాజకీయ సహకారం పొంది గ్రామాలను జాగీర్దార్లకు వదిలేసి ప్రజలను ఆర్థిక దోపిడీలోకి నెట్టి అందమైన నగరాన్ని నిర్మించడమే కాకుండా ప్రపంచంలోనే అత్యంత సంపన్నులుగా ఎదిగారు. హైదరాబాద్ సంస్కృతి, సాంప్రదాయాలు ఎంతో మంది కవులు, కళాకారులు, చరిత్రకారులను ముగ్దుల్ని చేశాయి. ఇప్పుడు ఆ హైదరాబాద్ పూర్తిగా అంతరించిపోతోంది. సమైక్య రాష్ట్రం ఏర్పాటుతో మొదలైన ముప్పు 1983లో తెలుగుదేశం పార్టీ అధికారంలోకి రావడంతో తీవ్రమైన ఇండో - పర్షియన్ సాంస్కృతిక భాగాల్ని సమూలంగా చెరిపేసి ఆంధ్ర ప్రాంత వలసదారులకు కేంద్రంగా మార్చివేసాయి. తెలుగుదేశం పార్టీ పాలన 2004 నాటికి నాలుగు వందల ఏళ్ల చారిత్రక సాక్షీ భూతంగా నిలిచిన చార్మినార్ మరుగున పడిపోయి హైదరాబాద్‌కు హైటెక్ సిటీ ప్రతీకగా మారిపోయింది.

రాజశేఖరరెడ్డి నాయకత్వంలో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ పార్టీ మరో అడుగు ముందుకు వేసి హైదరాబాద్ నామరూపాలు లేకుండా చేస్తున్నదని ఈ నాలుగేళ్ల పాలన పర్యవసానాలు పరిశీలిస్తే అర్థమవుతుంది. నిజానికి హైదరాబాద్ నగరానికి, నగరం చుట్టూరా కోడిపిల్లల్లా ఒదిగిన తెలంగాణ జిల్లాలకు 1982-2004 మధ్య జరిగిన నష్టం కంటే 2004 తరువాత జరుగుతున్న నష్టమే ఎక్కువ. మొదటి దశలో హైదరాబాద్ పై జరిగింది కేవలం సాంస్కృతిక దురాక్రమణే అనుకోవచ్చు. కానీ రెండో దశలో హైదరాబాద్ భౌగోళికంగా, భౌతికంగా కూడా పరాయి వాళ్ల చేతుల్లోకి పడిపోయింది.

ఇదంతా ఒక పథకం ప్రకారం జరిగినట్టు గమనించవచ్చు. భూమి పుత్రుడిగా, రైతు బిడ్డగా ప్రజల్లోకి వచ్చిన రాజశేఖరరెడ్డి భూమిని కేంద్రంగా చేసుకుని హైదరాబాద్ పునర్‌నిర్మాణానికి పూనుకున్నట్టుగా కనిపిస్తుంది. ఈ సూచనలు మావోయిస్టు పార్టీ - జనశక్తి నక్సలైట్లతో చర్చలు మొదలుపెట్టినప్పుడే కనిపించాయి. అడవుల్లోంచి నక్సలైట్లను చర్చలకు తీసుకువచ్చిన ప్రభుత్వం రెండు రోజుల్లోనే చర్చలకు చేతులెత్తి మళ్లీ ఆయుధాలు ఎక్కుపెట్టింది. హైదరాబాద్ చుట్టూ ఆంధ్రా సంపన్న వర్గాలు పరిశ్రమల పేరుతో ఆక్రమించిన ఇరవై ఏడు వేల ఎకరాల భూమికి సంబంధించి నక్సలైట్లు చర్చను లేవదీశారు. నగరంలో దాదాపు నలభై మూడు కంపెనీలు ఈ భూములు కబ్జా చేసినట్లు ఒక జాబితాను కూడా వాళ్లు ప్రభుత్వానికి ఇచ్చారు. ఆ రోజు విశాఖపట్నంలో ఉన్న ముఖ్యమంత్రి 'భూముల సంగతి వాళ్లకేం తెలుసు' అని ప్రశ్నించి చర్చలు అక్కర్లేదన్న సంకేతాన్ని పంపించారు. ఆ మరుసటి రోజే చర్చలు విఫలమైనట్టు ప్రభుత్వం ప్రకటించి తలుపులు మూసివేసింది. ఆ వెంటనే ఊపిరి సలపనీయకుండా పల్లెల్లో, అడవుల్లో దాడులు చేసి భూముల కోసం పోరాడుతున్న పేదలకు అండగా నిలిచి, అక్రమాలను ఎదిరించే వాళ్ల ఆనవాళ్లు లేకుండా చేయాలని ప్రయత్నించింది. ఉద్యమంలో కీలకమైన వ్యక్తులను వెంటాడి, వేటాడింది. ఆ తరువాత భూమి గురించి ఇంకెవ్వరూ మాట్లాడరని నిర్ధారించుకున్న తరువాత నగరం చుట్టూ 162 కిలోమీటర్ల మేర అవసరం లేకపోయినా ఔటర్ రింగ్‌రోడ్డు పేరుతో పల్లెల్ని చిన్నా చితకా పట్టణాల్ని కలుపుతూ ఓ సరిహద్దు రేఖ గీసింది.

హైదరాబాద్ ఔటర్ రింగ్‌రోడ్డు చుట్టు పక్కల గడిచిన నాలుగేళ్లలో జరిగిన లావాదేవీలు పరిశీలిస్తే భూములన్నీ తెలంగాణ పేద రైతాంగం చేతుల్లోంచి రాయలసీమ పెత్తందార్ల కబంధ హస్తాల్లోకి ఎలా చేరాయో అర్థమవుతుంది. అనేక మంది మంత్రులు, శాసనసభ్యులు, వారి పిల్లలు పెట్టుబడిదార్లు కలిసి వేలాది ఎకరాలు సొంతం చేసుకోగలిగారు. రింగ్ రోడ్డు ఇప్పటికీ ఇంకా మొదటి దశ కూడా పూర్తికాలేదు గానీ ఆ భూముల్లో కాలనీలు, కంపెనీలు వెలిశాయి. రింగ్‌రోడ్డు పొడవునా మళ్లీ నగరమంత విస్తీర్ణం ఉన్న భూములన్నీ వలసవాదుల చేతుల్లోకి చేరిపోయాయి. ఆ భూముల్లో రియల్ ఎస్టేట్ వ్యాపారం వేలకోట్ల రూపాయలకు చేరుకొంది. అధికారంలో కంటే వ్యాపారంలోనే ఎక్కువ లాభం ఉందని గ్రహించిన ఈ నాయకులు మరింత భూమిని అందుబాటులోకి తేవడం కోసం భూగరిష్ఠ పరిమితి చట్టాన్ని రద్దు చేశారు. దాంతో నగరంలో ఉన్న భూములు, చుట్టూ ఉన్న పొలాలు, పంట భూములను హస్తగతం చేసుకోవడం సులభతరమైపోయింది. దానికి సెజ్ చట్టం బాగా తోడ్పడింది. తమ బంధువులు, భాగస్వాములతో వ్యాపారాలు ప్రారంభించిన నేతలు సెజ్‌ల పేరుతో దరఖాస్తులు చేసుకొని

నగరం చుట్టూ ఉన్న ప్రభుత్వ, బంజరు భూములను ఆక్రమించు కోవడంతో పాటు, రైతులనుంచి అతి తక్కువ ధరలకు వేలాది ఎకరాల భూములు సేకరించుకోగలిగారు. సత్యం, ఇందు, లాంకో వంటి కంపెనీలు ప్రారంభించిన సెజ్‌లు, రియల్ ఎస్టేట్ వ్యాపారాలు ఈ కోవకే చెందుతాయి.

బినామీ పేర్లతో అధికారంలో ఉన్న వాళ్లే సెజ్‌లకు దరఖాస్తులు చేయడం, తమ పలుకుబడిని ఉపయోగించి, అనుమతులు ఇప్పించడం మొదలైంది. జియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియాను ఆనుకుని ఉన్న హౌసింగ్ బోర్డ్ భూముల్ని ఓ కంపెనీ తమకు కేటాయించుకుంది. అక్కడ ఇందూ అరణ్య పేరుతో ఓ విలాసవంతమైన నగరం నిర్మాణంలో ఉంది. అంతకు ముందు కూకట్‌పల్లి హౌసింగ్ బోర్డ్ కాలనీకి, హైటెక్ సిటీకి మధ్య ఉన్న ప్రభుత్వ భూమిని పొంది, అపార్ట్‌మెంట్లు, బంగ్లాలు నిర్మించి అమ్ముకున్న ఈ కంపెనీకే ప్రభుత్వం మామిడిపల్లి సమీపంలో పహాడీషరీఫ్‌లో వందలాది ఎకరాల కొండలు, అడవులు సేకరించి సెజ్‌గా మార్చివేసింది. 'పాయింట్ ఇందూ' టెక్నో సెజ్ పేరుతో ఇప్పుడు పహాడీషరీఫ్ పర్వతశ్రేణుల చుట్టూ ఈ కంపెనీ ఓ పెద్ద ప్రహరీగోడ నిర్మించింది. ఇంకా ఆ సెజ్‌లో ఏ ఉత్పత్తులు చేస్తారో తెలియదు గానీ భూమి మాత్రం చేతులు మారింది. ఇట్లా నగరం చుట్టుపక్కల ఉన్న భూములన్నీ చిన్నరైతుల నుంచి, పెద్ద పెద్ద భూస్వాముల చేతుల్లోకి చేరిపోయాయి.

ఈ భూములు, వాటి విలువను ముందుగానే లెక్కగట్టుకున్న నేతలు హడావుడిగా హైదరాబాద్‌లో అత్యంత విలాసవంతమైన విమానాశ్రయాన్ని నిర్మించేశారు. అటువంటి వ్యాపారాన్ని ఒక విధానంగా అమలు చేయడం, రాష్ట్రంలో నాలుగేళ్లుగా జరుగుతున్న ఈ తతంగం వల్ల ఇప్పుడు హైదరాబాద్ చుట్టూ ఉన్న భూములన్నీ తెలంగాణేతర పారిశ్రామిక, వ్యాపార వేత్తల చేతుల్లోకి చేరిపోయాయి. సత్యం కంపెనీ కొంపల్లి, బహదూర్‌పల్లి, బాచుపల్లి ప్రాంతాల్లో వేలాది ఎకరాలు ఈ పద్ధతిలో సేకరించినట్టు ఆరోపణలున్నాయి. సత్యం కంపెనీ మేటాస్ పేరుతో (అక్షరాలు తిరగేసి) ప్రారంభించిన కొత్త కంపెనీ ప్రధాన వ్యాపారం భూమి, మౌలిక వసతుల కల్పన. అట్లాగే 2000 సంవత్సరం తరువాత కొండలు, గుట్టలు, చెలుకలు సంపాదించడానికి వాటిపై లాంకో హిల్స్ పేరుతో మేటాస్ హిల్ కౌంటీ పేరుతో, సత్యం సోదర సంస్థ నిర్మించిన భూతల స్వర్గానికి ధీటుగా అపార్ట్‌మెంట్స్, విల్లాలు, హోటళ్లు నిర్మిస్తోంది. అదే క్రమంలో ఇందూ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్స్ అనే కంపెనీ నేరుగా ప్రభుత్వ భూములు, ప్రభుత్వ సంస్థలకు చెందిన భూముల్నే కాజేసి కాలనీలు నిర్మిస్తోంది. అవసరం కంటే ఐదురెట్లు ఎక్కువ స్థలాన్ని సేకరించి ఒక ప్రైవేట్ కంపెనీచేత దేశంలో కెల్ల విశాలమైన విమాశ్రయాన్ని శంషాబాద్‌లో ఏర్పాటు చేయడం వెనుక కూడా ఈ రియల్ ఎస్టేట్ వ్యాపార ప్రయోజనాలు స్పష్టంగా కనిపిస్తాయి. శంషాబాద్ నుంచి రాయలసీమ జిల్లాలకు వెళ్లే బెంగుళూరు జాతీయ రహదారిని ఆనుకుని జడ్చర్ల దాకా భూములన్నీ ఇప్పుడు రాయలసీమ వాసులే కొనేసుకున్నారని రికార్డులే చెపుతున్నాయి. ఆ ప్రయోజనాలకు అనుగుణంగానే జడ్చర్ల దగ్గర పోలేపల్లిలో పదివేల ఎకరాల భూమిని ఫార్మాస్యూటికల్ సెజ్‌గా ప్రకటించడం వెనక కూడా పాలకవర్గాల వ్యాపార ప్రయోజనాలున్నట్టుగా విమర్శలు వస్తున్నాయి.

అయితే ఈ నాలుగేళ్ల ఆక్రమణకు హైదరాబాద్ నగరం, రంగారెడ్డి జిల్లా విమానాశ్రయాన్ని ఆనుకున్న ఉన్న భూములు సరిపోలేదు. మరోపక్క తెలంగాణ వాదం కూడా పదునెక్కింది. ఈ నేపథ్యంలో హైదరాబాద్ కేంద్రంగా ఒక ప్రత్యేక రాష్ట్రం రూపొందే ప్రయత్నం కూడా పాలక వర్గాల నుంచి జరిగింది. ఆ ఆలోచనలకు అనుగుణంగానే గ్రేటర్ హైదరాబాద్ రూపొందింది.

హైదరాబాద్ ఈ నాలుగేళ్లలో మారుతున్న సందర్భంలో కూడా మళ్లీ చరిత్ర పునరావృతమవుతున్న దృశ్యమే సాక్షాత్కరిస్తోంది. హైదరాబాద్ నవాబు ప్రపంచంలోకెల్లా ధనవంతుడే కాదు అంతకు మించిన భూస్వామి కూడా. 'అత్రాఫ్ బల్దా' పేరుతో లక్షలాది ఎకరాల భూమి నిజాం సొంత ఆస్తిగా ఉండేది. నగరం చుట్టు పక్కలే కాకుండా జాగీర్లు, జమీందార్ల పరిధిలోకిరాని కొన్ని భూములు కూడా నిజాం సొంత ఆస్తుల్లో భాగంగా ఉండేవి. అయితే ఆ భూముల్లో కొంతభాగం దళితులకు, తనని నమ్ముకున్న సేవకులకు, దాసీలకు, తన కొలువులో పనిచేసి విరమించుకున్న ఉద్యోగులకు ఇనాంలుగా ఇచ్చే అలవాటు కూడా ఆయనకు ఉండేది. అంతే కాకుండా ఆ భూముల్లోనే ప్రభుత్వ రంగ కంపెనీలైన ఆల్విన్ లాంటివి, హౌజింగ్ బోర్డ్ లాంటివి ఏర్పాటుచేసి తన ప్రజలకు ఉద్యోగాలు, గృహవసతి కల్పించాలన్న సంకల్పాన్ని కూడా ఆయన అప్పుడప్పుడు చాటుకొనే వాడు. అయితే నైజాం వారసుల్లా నగరాన్ని, నగరం నాలుగు దిక్కులా ఉన్న వేలాది ఎకరాలను కాజేసిన వారికి ఇంకా ఆక్రమించుకోవడానికి భూములు లేకుండా పోయాయి. మరోవైపు ఔటర్ రింగ్ రోడ్డుకు అటూ, ఇటూ కలిపి నగరం కేంద్రంగా ఒక సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేసుకుంటే బాగుంటుందన్న ఆలోచనా వచ్చి ఉంటుంది. ఆ ఆలోచనలోంచి పుట్టిందే గ్రేటర్ హైదరాబాద్.

ప్రభుత్వంలో ఉన్న పెద్దలు రెండు ప్రయోజనాలను ఆశించి గ్రేటర్ హైదరాబాద్ సృష్టించినట్టు అర్థమవుతోంది. అందులో ఒకటి తక్షణం మరికొన్ని వేల ఎకరాల భూమిని స్వాధీనం చేసుకోవడం అయితే రెండోది తెలంగాణ డిమాండ్‌ను తేలికపరచడం. గత మార్చిలో తెలంగాణ రాష్ట్ర సమితి ప్రత్యేక రాష్ట్ర వాదనకు పదును పెట్టింది. కాంగ్రెస్ పార్టీ నాయకత్వం పై ఒత్తిడి తెచ్చేందుకు ఆ పార్టీ ఎం.పి.లు, ఎం.ఎల్.ఎ లు మార్చ్ 6న పదవులకు రాజీనామా చేశారు. అందుకు రెండు నెలల క్రితమే రాజీనామా విషయం ప్రకటిస్తూ ప్రభుత్వానికి మార్చ్ 6 'డెడ్‌లైన్' విధించారు. నిజంగానే అధిష్టానం తలొగ్గి తెలంగాణ ఇచ్చేస్తుందో ఏమోనని భయపడ్డ కాంగ్రెస్ పాలకులు ఒక వేళ తెలంగాణ ఏర్పడ్డప్పటికీ ఈ ప్రాంతానికి ప్రయోజనం ఉండకుండా హైదరాబాద్‌ను ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేసేందుకు ప్రయత్నాలు ప్రారంభించి మార్చ్ 17న గ్రేటర్ హైదరాబాద్‌ను ప్రకటించి గతంలో ఉన్న హైదరాబాద్ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ పరిధి విస్తరించి పేరు కూడా హైదరాబాద్ మెట్రో డెవలప్‌మెంట్ అథారిటీగా మార్చి వేశారు. ఆ మరుసటి వారంలో (తెలంగాణ రాష్ట్ర సమితి సభ్యులు రాజీనామా చేసిన తరువాత) ఈ మేరకు చట్టాన్ని తీసుకువచ్చారు. ఈ మెట్రో డెవలప్‌మెంట్ అథారిటీకి రాష్ట్ర ముఖ్యమంత్రి డా. వై.ఎస్. రాజశేఖరరెడ్డి చైర్మన్‌గా ఉంటారు. హైదరాబాద్ నగర పరిధి ఈ చట్టం మూలంగా అనూహ్యంగా మూడింతలు పెరిగింది. హుడాగా ఉన్నప్పుడు 2197 చదరపు కిలోమీటర్లున్న నగర వైశాల్యం 6852 చదరపు కిలోమీటర్లకు

భూమి మీద ఉన్న నిర్జీవ మూలకాల నుంచి భౌతిక, రసాయనిక ప్రక్రియల ద్వారా కొన్ని భౌగోళిక పరిస్థితుల్లో తయారైన పదార్థమే ప్రాణులకు మూలాధారమని చెబుతున్నారు **కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# జీవపదార్థం ఎలా ఏర్పడింది?

**'జీ**వం, ప్రాణం' మొదలైనవన్నీ చాలా ప్రత్యేకమైన విషయాలుగానూ, సులువుగా అర్థంకాని అంశాలుగానూ అనిపించే రోజులు పోయాయి. ఒకవంక జీవప్రక్రియలకు ఆధారమైన సేంద్రియ (ఆర్గానిక్) రసాయనాల గురించి అవగాహన పెరుగుతూ ఉంటే, మరొకవంక ఇటువంటి పదార్థాలు అంతరిక్షంలో ఎక్కడైనా తారసిల్లే అవకాశం ఉందని స్పష్టమౌతోంది. అందుచేత జీవపదార్థం గురించి ఈనాటి విజ్ఞానం ఏం చెపుతోందో మనం తెలుసుకుంటే మన అపోహలు చాలావరకూ తగ్గే అవకాశం ఉంటుంది.

మనకు కనబడుతున్న విశ్వం ఆవిర్భావం 1500 కోట్ల సంవత్సరాల కిందట జరిగిందని శాస్త్రవేత్తల అంచనా. విశ్వంలోని 'ఆదిమ' పదార్థం ప్రధానంగా హైడ్రోజన్ వాయువు రూపంలో ఉండేది. గురుత్వాకర్షణ వల్ల అది పోగుపడిన చోట్లలో నక్షత్రాలు పుట్టుకొచ్చాయి. నక్షత్రాల్లో జరిగిన అణు సంయోగ ప్రక్రియల వల్ల హీలియం, కార్బన్, నైట్రోజన్, ఆక్సిజన్ అణువులు రూపొందాయి. వీటిలో హీలియం తప్ప తక్కినవి జీవరాశి ఆవిర్భావానికి అవసరమైన మూల పదార్థాలు. కొన్ని నక్షత్రాలు పేలిపోగా ఈ పదార్థాలు అంతరిక్షంలోకి వెదజల్లబడ్డాయి.

---

విస్తరించింది. తెలంగాణలోని 54 మండలాలకు నగర పరిధి విస్తరించి హైదరాబాద్, రంగారెడ్డితోపాటు మెదక్, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాల్లోని పలు ప్రాంతాలను ఇందులో కలిపారు. దీంతో హైదరాబాద్ విస్తీర్ణం మంబయ్ నగర విస్తీర్ణం కంటె పెద్దది అయిపోయింది.

మెదక్ జిల్లాలోని తూప్రాన్, కడప రోడ్డులో షాద్‌నగర్, వరంగల్ రోడ్డులో భువనగిరి, విజయవాడ రోడ్డులో చౌటుప్పల్, శ్రీశైలం రోడ్డులో దాసర్లపల్లి, నాగార్జున సాగర్ రోడ్డులో బీచుపల్లి, వికారాబాద్ దగ్గర కిష్టాపూర్, కరీంనగర్ రోడ్డులో సింగరాయపల్లి వరకు ఇప్పుడు నగరంలో భాగమైపోయింది. అంతేకాదు సంగారెడ్డి, శంకర్‌పల్లి, భువనగిరి, షాద్‌నగర్ పట్టణాల్లో గ్రేటర్ హైదరాబాద్ కార్యాలయాలు కూడా ఏర్పాటు చేశారు. మొత్తం 23 శాసనసభ స్థానాలు, మూడు పార్లమెంట్ స్థానాలు కలిపి 85 లక్షల జనాభాతో హైదరాబాద్ ఒక ప్రత్యేక రాష్ట్రానికి కావాల్సిన అన్ని హంగులూ సమకూర్చుకోగలిగింది. ఈ నేపథ్యంలో కాంగ్రెస్ కీలక నేతల్లో కొందరు గ్రేటర్ హైదరాబాద్ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలని, మరికొందరు కేంద్రపాలిత ప్రాంతంగా ఉండాలని కూని రాగాలు తీశారు. ఇట్లా హైదరాబాద్ నగరం తెలంగాణ పల్లెల్ని పట్టణాల్ని మింగేసి ఇప్పుడు మహానగరంగా విస్తరించింది. ఈ నేపథ్యంలో హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాపోగా మెదక్‌లో పది మండలాలు, మహబూబ్‌నగర్ జిల్లాలో రెండు, నల్లగొండలో నాలుగు మండలాలు ఆయా మండలాల్లోని 450 గ్రామాలు, ఆ గ్రామాల్లోని లక్షలాది ఎకరాల భూములు ఇప్పుడు నగరంలో కలిసిపోయాయి.

నిజాం నవాబు కింది జాగీర్దార్లలా కొత్త వ్యాపారవర్గం ఇప్పటికే సెజ్‌ల పేరుతో ఈ భూములను కబ్జా చేసే పని ప్రారంభించింది. రింగ్ రోడ్డుకు అటూ ఇటూ వేలాది ఎకరాలు ఆక్రమించుకున్న పాలకవర్గాలు ఈ నయా భూస్వాముల్ని పెంచి పోషించేందుకు సెజ్ చట్టాన్ని ఒక అవకాశంగా వాడుకొంటున్నాయి. గ్రేటర్ హైదరాబాద్‌నే కాకుండా మహానగరం పరిధిలో మరో డెబ్భై దాకా ఇటువంటి స్వతంత్ర రాజ్యాలను ఏర్పాటు చేసే పనిలో ప్రభుత్వం ఇప్పుడు తలమునకలై ఉంది. రాష్ట్రంలో ప్రారంభం కానున్న వంద సెజ్‌లలో దాదాపు డెబ్భై ఈ మహానగరం పరిధిలోనే ఏర్పాటు కాబోతున్నాయి. వీటిలో 90 శాతం ఐ.టి. / ఐ.టి.ఇ.ఎస్. సెజ్ లే కావడం మరో విశేషం. అయితే కేవలం సెజ్‌ల పేరుతో సేకరించిన భూములే కాదు, సెజ్‌ల లోపల, సెజ్‌ల బయట కూడా వేలాది ఎకరాల్లో కొత్త టౌన్‌షిప్‌లు, ఇండస్ట్రియల్ సిటీలు, ఇన్‌ఫ్రా సిటీలు వెలుస్తున్నాయి. విదేశాల్లో ఉన్న లక్షలాది మంది ప్రవాసాంధ్రులు కోటి నుంచి ఐదు కోట్ల వ్యయం చేసే ఇళ్లను, ఆధునిక కాలనీలను, కౌంటీలను కొనేసుకుంటున్నారు. ఇప్పుడు నగరం చుట్టూ సెజ్‌ల పేరుతో వెలుస్తోన్న ఈ డెబ్భై ఎస్టేట్లు పూర్తయితే నగర జనాభా రెండు కోట్లకు చేరవచ్చని అంచనా. అంటే ఇప్పుడున్న హైదరాబాద్ మినహా మొత్తం తెలంగాణ జనాభా కంటే ఎక్కువ.

ప్రభుత్వం ఈ లెక్కలన్నీ వేసుకునే హైదరాబాద్‌ని ఒక 'మహాసెజ్'గా మలిచింది. దేశంలో ఎక్కడాలేని విధంగా అత్యధిక సెజ్‌లు మన నగరం చుట్టూ కొత్త గఢీలను నిర్మిస్తున్నాయి. నవాబుగారి నగరం చుట్టూ అప్పుడు వెలసిన జాగీర్దార్ల గఢీల్లాగే ఇప్పుడు సెజ్‌లు కూడా కొత్త జాగీర్లు కాబోతున్నాయి.

ఇప్పుడు దేశంలో విస్తరిస్తున్నది పెట్టుబడిదారీ బహుళజాతి వ్యాపారం అని బుద్ధిజీవులు బాధపడుతున్నారు. కానీ మన రాష్ట్రంలో, మన మహానగరం చుట్టూ విస్తరిస్తోన్న వ్యాపార సంస్కృతిలో పెట్టుబడి – ఫ్యూడలిజం కలగలిసి ఉన్నాయి. ఇక మరో తెలంగాణ సాయుధ పోరాటం వస్తే తప్ప ఈ నేలకు, నేలను నమ్ముకున్న శ్రమజీవులకు విముక్తిలేదు. ◆

ఇవి రసాయినికంగా పరస్పరం కలవడం వల్ల నీటి ఆవిరి, కార్బన్ డయాక్సైడ్, రకరకాల హైడ్రోకార్బన్‌లూ తయారయాయి. కొత్త నక్షత్రాలు పుట్టుకొచ్చిన వాయుమేఘాల్లో ఈ పదార్థాలుండడంతో మన సౌరకుటుంబం వంటి వాటిలో ఇవన్నీ గ్రహాలూ, ఉపగ్రహాలూ, గ్రహశకలాలూ, తోకచుక్కలూ, ఉల్కల రూపంలో కనబడతాయి. భూమివంటి గ్రహాలు సూర్యుడి నుంచి తగుమాత్రం దూరాన ఉండడం వల్ల అక్కడ జీవరాశి పుట్టడానికి అనువైన పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఇది ఎలా జరిగిందో తెలియాలంటే భూమి రూపొందిన మొదటి వందకోట్ల సంవత్సరాలలో జరిగిన మార్పులు ఊహించుకోవాలి. అప్పట్లో అగ్నిపర్వతాలూ, జీవరాశి లేని మహాసముద్రాలూ, తుపానులు చెలరేగే వాతావరణమూ ఉండేవి. దట్టమైన మేఘాలలోకి అగ్నిపర్వతాలు సెగలూ, పొగలూ కలుస్తూ ఉండేవి. మెరుపులూ, పిడుగులతో విద్యుత్తు వాతావరణంలో ప్రసారం అయేది. వీటన్నిటికీ సూర్యరశ్మి తోడై నిరంతరం రసాయనిక ప్రక్రియలు జరుగుతూ ఉండేవి. నేలనుంచీ, వాతావరణం నుంచీ తొక్కచుక్కలూ, ఉల్కాపాతాలవల్లనూ సముద్ర జలాల్లోకి సేంద్రియ పదార్థాలు చేరుతూ ఉండేవి. ఆ విధంగా తయారైన కార్బన్ డయాక్సైడ్, మెథేన్, హైడ్రొజన్ సయనైడ్ వంటి పదార్థాల వల్ల రకరకాల చక్కెరలూ, అమినో ఆసిడ్లూ, న్యూక్లియోటైడ్లూ రూపొందాయి. జీవపదార్థానికి ఆధారభూతాలైన ప్రోటీన్లూ, డిఎన్ఎ, ఆర్ఎన్ఎ వంటి వాటి నిర్మాణానికి ఇవన్నీ చాలా అవసరం. మెలికలు తిరిగిన తాటి నిచ్చెనల్లా ఉండే డిఎన్ఎ, ఆర్ఎన్ఎ కణాలు మొదట్లో ఖండాలుగా ఏర్పడినా త్వరలోనే సరైన రూపాన్ని సంతరించుకుని, జీవపరిణామాన్ని శాసించగలిగిన స్థితికి చేరుకున్నాయి. కేవలం వీటి కారణంగానే కాక, భూమిమీద సముద్రాల్లోనూ, అగ్నిపర్వతాల్లోనూ జరిగిన రసాయనిక మార్పుల వల్ల కూడా తొలి సజీవ పదార్థాలు సన్నని పోగులుగా ఏర్పడసాగాయి. వీటి ముఖ్య లక్షణం తమకు కాపీలను తామే తయారుచేసుకుని వృద్ధి చెందటం.

ఆ ప్రతిపాదనలకు వైజ్ఞానిక ఆధారల కోసం చాలా ప్రయత్నాలు జరిగాయి. 1930లలో సోవియట్ రష్యాలో ఒపారిన్, ఇంగ్లండ్‌లో జె.బి.ఎస్. హాల్డేన్ జీవకణాల ఆవిర్భావం గురించి చెపుతూ వాతావరణంలో ఆక్సిజన్ లేని పరిస్థితుల్లోనే అవి రూపొందడం సాధ్యమని ప్రతిపాదించారు. అప్పట్లో వాతావరణంలో ఉన్నవల్లా మెథేన్, అమోనియా, హైడ్రొజన్‌లు మాత్రమే. రసాయనిక ప్రక్రియల దృష్ట్యా ఇది చాలా ముఖ్యమైన విషయం. మనకు తెలిసిన నేటి ప్రపంచంలో ఆక్సిజన్ లేకుండా ఏ జంతువూ బతకలేదు. అలాంటి 'ప్రాణవాయువు' తొలిదశలోని జీవరసాయనిక ప్రక్రియలకు అడ్డు తగిలి జీవరాశి ఆవిర్భావానికే ముప్పు తెచ్చి ఉండేదంటే ఆశ్చర్యంగానే అనిపిస్తుంది. దీనికి కారణం ఏమిటంటే ఆక్సిజన్ ఇతర పదార్థాల నుంచి హైడ్రొజన్‌ను సంగ్రహిస్తుంది. అదే కనక జరిగితే చిన్న చిన్న రసాయనిక పదార్థాల నుంచి సంక్లిష్టమైన జీవరసాయనిక పదార్థాలు తయారు కాలేవు. అలా జరగాలంటే 'విషపూరిత' వాతావరణమే ఉండాలి. ఈనాడు ఉన్నట్టుగా వాతావరణంలో 21 శాతం ఆక్సిజన్ అప్పుడు ఉండి ఉంటే అడుగులోనే హంసపాదు అయి ఉండేది అని సూత్రీకరించారు. ఆ సూత్రం ఆధారంగా తరవాతి రోజుల్లో కొన్ని ప్రయోగాలు జరిగాయి.

1950 ప్రాంతాల్లో అమెరికాలో యూరే వంటి శాస్త్రవేత్తలు ఒక గాజు ఫ్లాస్కులో ఆదిమయుగపు సముద్ర జలాలని తయారుచేశారు. దాన్ని వేడి చెయ్యగా ఆవిరి సుడులు తిరగసాగింది. ఈ మరుగుతున్న నీటికి ఎగువన మెథేన్, అమోనియా, హైడ్రొజన్‌లతో కూడిన 'వాతావరణపు పొర'ను సృష్టించారు. అందులోకి మెరుపుల్లాగా విద్యుత్తును ప్రసారం చేశారు. గాజుకప్పులో చెలరేగిన ఈ తుపాను వల్ల వాయువుల కలయిక జరిగింది. తద్వారా తయారైన రసాయనిక పదార్థాలు 'సముద్ర' జలంలో కరగగా ఎన్నో అమినో ఆసిడ్లు రూపొందాయి. ఉదాహరణకు ఫార్మాల్డిహైడ్, హైడ్రొజన్ సయనైడ్‌ల ద్వారా గ్లైసిన్ తయారైంది. ఆ తరవాత కొన్నేళ్లకు ఆస్ట్రేలియాలో పడిన ఒక ఉల్క మీద సుమారుగా ఇదే నిష్పత్తిలో ప్రోటీన్లు కనబడడంతో ఈ ప్రతిపాదనకు బలం చేకూరినట్టయింది. పైన చెప్పినటువంటి ప్రయోగాలు తరవాత చాలా జరిగాయి. వాటివల్ల కేవలం అమోనియా, హైడ్రొజన్ సయనైడ్‌ల ద్వారా అమినో ఆసిడ్లు తయారవగలవని తేలింది. డిఎన్ఎలోని ఒక భాగమైన అడినీన్ ఈ ప్రక్రియల్లో పుష్కలంగా తయారవుతున్నట్టు గమనించారు. ఈ పదార్థం వల్ల ఎటిపి (అడినోసీన్ ట్రై ఫాస్ఫేట్) కణాలు కూడా తయారవుతాయి. ఇది చాలా ముఖ్య విషయం. ఎందుకంటే ఈ కణాలే మన శరీరాల్లో జరిగే జీవరసాయనిక ప్రక్రియలకు శక్తినిస్తాయి. డిఎన్ఎలో ఉండే ఇతర పదార్థాలు సయనొజన్, సయనో అసిటలీన్ అనేవి కలవడం ద్వారా తయారవగలవని తేలింది. ఇందులో విశేషం ఏమింటంటే ఇవి రెండూ అమోనియా, హైడ్రొజన్ సయనైడ్‌లను పోలినవి. ఇవన్నీ కార్బన్, నైట్రొజన్, హైడ్రొజన్ అణువులు రకరకాల నిష్పత్తులలో కలవగా ఏర్పడినవి. వీటిని ఏ కెమికల్ ప్రయోగశాలలోనైనా తయారు చెయ్యవచ్చు. ఇవి నిర్జీవ రసాయనాలే అయినప్పటికీ వీటివల్లనే జీవరసాయనాలు తయారయేది.

స్థూలంగా చెప్పాలంటే భూమి మీదున్న నిర్జీవ మూలకాల నుంచి భౌతిక, రసాయనిక ప్రక్రియల ద్వారా కొన్ని భౌగోళిక పరిస్థితుల్లో తయారైన పదార్థాలే 'ప్రాణం' ఉన్న జీవరసాయన కణాలు రూపొందడానికి కారణం అయాయి. ప్రాణం ఉన్నవాటికీ, లేనివాటికీ మధ్యస్థంగా ఉండే ప్రోటీన్లూ, వైరస్‌ల గురించి మనకు తెలుసు. ఎన్నాళ్లయినా నిర్జీవంగా పడి ఉన్నట్టనిపించే ఈ కణాలు అనువైన చోటికి చేర్చగానే పునరుత్పత్తి చెంది, ప్రాణమున్న జీవాల్లాగే ప్రవర్తిస్తాయి. భూగ్రహం చల్లబడి, సముద్రజలాలు ఏర్పడి, అందులో కరిగిన రకరకాల లవణాల మధ్య కొన్ని వందల కోట్ల సంవత్సరాల పాటు నిరంతరంగా జరిగిన వివిధ రసాయనిక ప్రక్రియలే 'తలవని తలంపుగా' జీవ రసాయనిక పదార్థాల తయారీకి దారితీసి ఉంటాయని ఆధునిక విజ్ఞానం నమ్ముతోంది. ఆ స్థాయినుంచి ఈనాడు కనబడుతున్న జంతుప్రపంచంలో ఇంతటి వైవిధ్యం ఎలా సాధ్యమైందో అనేదానికి కూడా వివరణలు ఇవ్వడం సాధ్యమే. క్రమంగానూ, అంచెలంచెలుగానూ, అకస్మాత్తుగానూ జరిగిన అనేక మార్పుల కారణంగా ఇవన్నీ జరిగాయి.

భూమి మీద వందల కోట్ల సంవత్సరాల క్రితం సముద్రజలాల్లో రకరకాల లవణాలూ, రసాయనిక పదార్థాలూ కలవగా ఒక 'సూప్' తయారైంది. వాటిమధ్య జరిగిన ప్రక్రియల్లో కొన్ని జీవరసాయనిక పదార్థాలు తలవని తలంపుగా రూపొందాయి. వీటివల్ల ప్రోటీన్లూ, డిఎన్ఎ, ఆర్ఎన్ఎ వంటివి తయారయేందుకు అవకాశాలు కలిగాయి.

అప్పట్లో వాతావరణంలో ఆక్సిజన్ ఉండకపోవడం వల్లనే జీవరాశి ఆవిర్భావం సాధ్యమైందని అంచనా.

తమను తాము పునరుత్పత్తి చేసుకోగలిగిన ఈ తొలి జీవకణాలతో త్వరలోనే సముద్రజలాలు నిండి ఉండాలి. గొలుసుకట్టులా కొనసాగే ఈ కణాల తయారీకి దారితీసిన ప్రక్రియల్లో కొన్ని రసాయనిక పదార్థాలు ఉత్ప్రేరకాలుగా పనిచేసి ఉండాలి. సౌరకుటుంబంలో ఒక్క భూమి మీద మాత్రమే అపారమైన జలరాశి ద్రవరూపంలో ఉన్నది కనక వీటిలో రకరకాల పదార్థాల సమ్మేళనం వీలయింది. గాలిలోనూ, నేలమీదా ఉన్న పొడి వాతావరణంలో ఈ పద్ధతిలో జీవరాశి పుట్టడం దాదాపు అసాధ్యమే. ఏ విధంగా చూసినా భౌతిక పరిస్థితులు అనుకూలించటం వల్లనే ప్రాణులు పుట్టగలిగాయి. అసలు జీవకణాలకూ, నిర్జీవ పదార్థాలకీ తేడా ఏమిటో చెప్పడం అంత సులువుకాదు. వితండవాదం అనిపిస్తుంది కాని ఆక్సిజన్‌ను 'పీల్చుకుని', పెట్రోల్ 'తాగి', అటూ ఇటూ తిరగగలిగే మోటర్‌కారుతో పోలిస్తే ఆక్సిజన్ లేకుండా బతికే కొన్ని రకాల బాక్టీరియా, వాతావరణం ప్రతికూలమైనప్పుడల్లా నెలల తరబడి బిగదీసుకుని పడుండే సూక్ష్మజీవాలూ ఏమంత 'జీవకళ' ఉన్నవిగా తోచవు. స్ఫటికాలు ప్రాణం లేకపోయినా తమకు కాపీలను తామే తయారుచేసుకుని 'పెరుగుతాయి' ఆదిమ సముద్రజలాల అడుగున బురదలో ఉండిన లవణాలకూ, స్ఫటికాలకూ ఉండే సక్రమమైన కణనిర్మాణం జీవకణాలు పోగులుగా ఏర్పడడానికి 'అచ్చు'గా ఉపయోగపడి ఉండచ్చు. జీవపదార్థం అంటే కొన్ని అణువులు ఒక పద్ధతిలో గొలుసుగా ఏర్పడడం వల్ల తయారైనదే కనక బేటరీతో నడిచే పరికరంలాగా జీవకణాలు పునరుత్పత్తి మొదలుపెట్టి ఉంటాయి.

తొలినాటి జీవకణాలను యూరేవంటి పరిశోధకులు తమ ప్రయోగాల్లో కొన్ని దశాబ్దాలుగా తయారుచేసి చూపారు. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే అటువంటి జీవపదార్థం అంతరిక్షంలో కూడా ఉన్నట్టు తెలియవస్తోంది. కార్బన్‌తో కూడుకున్న కొన్ని ఉల్కల శకలాలను బట్టి చూస్తే అడినీన్, గ్వానీన్, అమినో ఆసిడ్లూ, నీరూ, అమోనియా, ఫార్మాల్డిహైడ్ (అల్ట్రా వయొలెట్ కిరణాలు పడితే ఇది సెల్యులోస్‌గా మారుతుంది), హైడ్రొజన్ సయనైడ్, సయనో అసిటలీన్ మొదలైనవి అంతరిక్షంలో నక్షత్రాలు పుట్టుకొచ్చే ధూళి మేఘాల్లో ఉన్నట్టు రుజువైంది. మరికొందరు ఆధునిక శాస్త్రవేత్తలు మొదట సముద్రజలం అంతా ఆర్‌ఎన్ఏ కణాల మయంగా ఉండేదని భావిస్తున్నారు. ఆకారంలో డిఎన్ఏ ను పోలి ఉండే ఆర్‌ఎన్ఏ (రైబో న్యూక్లియక్ ఆసిడ్) జీవకణాల్లో తయారయే ప్రోటీన్లు రూపొందడానికి తోడ్పడుతుంది. ఏదైనా వైరస్ బయటినుంచి శరీరంలోకి ప్రవేశించినప్పుడు జీవకణాల్లోకి తన ఆర్‌ఎన్ఏను ప్రవేశపెడుతుంది. ఇక ఆ కణాలన్నీ దానికి తల ఒగ్గి, కొత్త కణాలను ఆ మోడల్‌లో తయారుచెయ్యినారంభిస్తాయి. కొన్ని రకాల ఆర్‌ఎన్ఏ చిన్న గొలుసు ముక్కలాగా డిఎన్ఏ పొడుగునా కదులుతూ, అవసరమైనప్పుడు రిపేర్లు కూడా చేస్తూ ఉంటుంది. తొలి జీవకణాలు రూపొందే దశలో ఆర్‌ఎన్ఏ నిర్వహించిన పాత్ర పెద్దదని శాస్త్రవేత్తల ఊహ. తొలిదశలో భూమిని కమ్మిన వాతావరణంలో హైడ్రొజన్, మెథేన్, అమోనియా మొదలైన వాయువులు అనుకున్నంత పరిమాణంలో ఉండి ఉండకపోవచ్చని కొందరు శాస్త్రవేత్తల అభిప్రాయం. వీరి ఊహ ప్రకారం జీవరాశి ఆవిర్భావానికి దారితీసిన పదార్థాలు అంతరిక్షం నుంచి ధూళీ, ఉల్కలూ, తోకచుక్కల రూపంలో భూమి మీదికి వచ్చి పడుంటాయి.

మొదటి యాభై కోట్ల సంవత్సరాల్లో ఇలా 'దివినుండి భువికి' చాలా పదార్థం దిగుమతి అయిందనడంలో సందేహం లేదు. వీటిలో కొన్ని వంద కిలోమీటర్ల పరిమాణం కలిగి బ్రహ్మాండమైన శిలలు. వాటివల్ల వర్ణనాతీతమైన ఉత్పాతం కలగడమే కాదు, టన్నుల కొద్దీ పదార్థం కూడా భూమి మీదికి చేరి ఉంటుంది. దాని ద్వారా సముద్రాల్లో 'సూప్' తయారైందో లేదో ననేది మాత్రం కచ్చితంగా తెలియని విషయం.

ఈ నాటికీ సగటున సంవత్సరానికి లక్ష టన్నుల పదార్థం ఆకాశం నుంచి వచ్చి పడుతోందట. అప్పట్లో ఈ సంఘటనల వల్ల వాతావరణం లోనూ, భూమి ఉపరితలం మీద ఎంతటి పెనుమార్పులు కలిగినా సముద్రగర్భంలో రసాయనిక ప్రక్రియలకు పెద్దగా అంతరాయం కలిగి ఉండదనీ, జీవకణాలు రూపొందటానికి దోహదపడిన మార్పులు అక్కడ జరిగి ఉంటాయనీ కొందరు పరిశోధకులంటారు. అసలు జీవరాశి ఆవిర్భావం అతి కొద్ది వ్యవధిలో జరగడానికి కారణం కూడా ఇదేనని వారి ఊహ. తోకచుక్కల్లోని పదార్థంలో సగ భాగం గడ్డకట్టిన నీరే. భూమి తొలిదశలో పైనుంచి వచ్చిపడిన వాటిలో పదోవంతు మాత్రమే తోకచుక్కల రూపంలో ఉన్నా వాటివల్ల మన సముద్రాలన్నీ నిండి ఉండేవని వారి అంచనా.

కుజ, గురు గ్రహాల మధ్య కనబడే గ్రహశకలాలు (ఆస్టెరాయిడ్లు) కూడా తక్కువ తినలేదు. 1969లో ఆస్ట్రేలియాలో పడిన ఇటువంటి శిలమీద సేంద్రియ పదార్థాలు కనబడ్డాయి. అందులో గ్రాఫైట్, 74 అమినో ఆసిడ్లూ, 250 రకాల హైడ్రోకార్బన్లూ ఉన్నాయట. అన్నిటికన్నా విశేషమేమంటే డిఎన్ఏ లోని ముఖ్యపదార్థాలైన అడినీన్, గ్వానీన్, సైటోసిన్, థైమీన్, యూరాసిల్‌లు కూడా ఉన్నాయి. అంతరిక్షం నుంచి జీవరాశి దిగుమతి అయిందని వాదించినవారిలో ఫ్రెడ్ హోయిల్ అనే ఖగోళ శాస్త్రవేత్త ఒకడు. వాయుమేఘాల, నక్షత్రాల నుంచి ప్రసరించే కాంతిని స్పెక్ట్రం ద్వారా విశ్లేషించినప్పుడు వాటిలో ఆర్గానిక్ (సేంద్రియ) కణాల ఉనికిని సూచించే కాంతి సరిగ్గా చెప్పాలంటే అది రేడియో తరంగాలుగా ప్రసరిస్తుంది) ఉన్నట్టు తెలిసింది. ఇలాంటి పదార్థాలు అంతరిక్షంలోని వివిధ ప్రాంతాలకు చేరుతూనే ఉన్నప్పటికీ జీవరాశి పెరగడానికి అనువైన పరిస్థితులున్న భూమివంటి గ్రహం మీదనే జీవపరిణామం సాధ్యమౌతుంది. జీవపదార్థాలు 'ఆకాశం నుంచి ఊడిపడ్డవే' అనడానికి బలమైన సాక్ష్యాలు మాత్రం కనబడుతున్నాయి. ◆

## మానవ హక్కుల పరిస్థితి అధ్వాన్నం

భారతదేశంలో మానవహక్కుల పరిస్థితి అధ్వాన్నంగా తయారైందని మానవ హక్కుల సంస్థ ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ ఆరోపించింది. మే 28న విడుదల చేసిన తన నివేదికలో భారతదేశంలో మానవహక్కులు తీవ్ర ఉల్లంఘనకు గురౌతున్నట్లు పేర్కొంది. గత ఏడాది బెంగాల్‌లోని నందిగ్రాంలో హింస చేలరేగిన సమయంలో అక్కడి వామపక్ష ప్రభుత్వం పక్షపాతంగా వ్యవహరించిందని పేర్కొంది. అక్కడ సి.పి.ఎం. మద్దతుదారులు మహిళల పట్ల దారుణంగా వ్యవహరించినట్లు పేర్కొంది. అలాగే జమ్ము కాశ్మీర్‌లోనూ పరిస్థితి అస్తవ్యస్తంగా ఉన్నట్లు ఆ నివేదిక వెల్లడించింది. ఈ రాష్ట్రంలో అనేకమంది ప్రజలు అదృశ్యమౌతున్నట్లు పేర్కొంది. యూరి జిల్లాలో 940 సామూహిక సమాధులను గుర్తించినట్లు తెలిపింది. చత్తిస్‌గడ్‌లోని దంతేవాడ జిల్లాలోనూ మానవహక్కుల ఉల్లంఘన తీవ్ర స్థాయిలో ఉన్నట్లు నివేదిక పేర్కొంది. అనేకమంది ఆదివాసులను తమ నివాస ప్రాంతాలనుంచి సల్వాజుడూం బేస్ క్యాంపులకు బలవంతంగా తరలించినట్లు ఆరోపించింది. భారతదేశంలో అమలుచేస్తున్న మరణశిక్షను రద్దుచేయాలని డిమాండ్ చేసింది.

## కర్ణాటక శాసనసభ ఎన్నికల ఫలితాలు

మూడు విడుతలుగా జరిగిన కర్ణాటక శాసనసభ ఎన్నికల ఫలితాలు మే 25న వెలువడ్డాయి. 224 స్థానాలు ఉన్న కర్ణాటక శాసనసభ ఎన్నికల్లో బి.జె.పి. 110 సీట్లు, కాంగ్రెస్ 80 సీట్లు, జె.డి.ఎస్. 28 సీట్లు, స్వతంత్ర అభ్యర్థులు 6 సీట్లు గెలుచుకున్నారు. గత ఎన్నికలతో పోల్చి చూస్తే బి.జె.పి. తన సీట్ల స్థితిని 79 నుంచి 110కి, కాంగ్రెస్ 65 నుంచి 80 సీట్లకు మెరుగుపర్చుకున్నాయి. జె.డి.ఎస్. బలం 58 నుంచి 28 సీట్లకు పడిపోయింది. దాదాపు అన్ని నియోజకవర్గాలలోను పోటీ చేసిన బి.ఎస్.పి., సమాజవాదీ పార్టీలు ఖాతాలను ప్రారంభించడంలో విఫలమయ్యాయి. కర్ణాటక ప్రజలు ఎవరికీ పూర్తి ఆధిక్యాన్ని ఇవ్వలేదు. బి.జె.పి. తొలిసారిగా దక్షిణ భారతదేశంలో స్వతంత్ర అభ్యర్థుల సహకారంతో అధికారం చేపట్టింది.

## విత్తనాలపై రక్తం మరకలు

జూన్ 10న కర్ణాటకలోని హవేరి పట్టణంలో విత్తనాల కోసం వచ్చిన రైతులపై పోలీసులు కాల్పులు జరిపారు. ఇందులో ఒకరు మరణించగా, పదిహేను మందికి పైగా గాయపడ్డారు. విత్తనాలిస్తారేమోనని మధ్యాహ్నం వరకు ఎదురుచూసిన రైతులు సహనం కోల్పోయి ప్రదర్శన చేపట్టారు. కోపం పట్టలేక నాలుగు ప్రభుత్వ బస్సులను దహనం చేశారు. తదనంతర పరిణామాల్లో ఎటువంటి ముందస్తు హెచ్చరికలు లేకుండా పోలీసులు కాల్పులు జరిపారు. ముఖ్యమంత్రి యద్యూరప్ప ప్రభుత్వం చనిపోయిన రైతులకు, గాయపడినవారికి నష్టపరిహారం ప్రకటించారు. రైతుల ఆందోళన విరమింపజేయడంలో విఫలమైన వ్యవసాయ శాఖ జాయింట్ డైరక్టర్‌ను సస్పెండ్ చేయనున్నట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు.

## ప్రమాద స్థితిలో పత్రికా స్వేచ్ఛ

అహ్మదాబాద్ సిటీ పోలీస్ కమీషన్ ఒ.పి. మాథుర్ మే నెలాఖరులో టైమ్స్ ఆఫ్ ఇండియాలో తనపై వరుసగా ప్రచురితమైన కథనాల ఆధారంగా ఆ పత్రిక అహ్మదాబాద్ ఎడిషన్‌పై, ఎడిటర్ భరత్ దేశాయ్, క్రైం రిపోర్టర్ ప్రశాంత్ దయాళ్‌లపై రాజద్రోహం నేరం కేసు నమోదు చేశారు. 1998 ఎన్‌కౌంటర్‌లో చనిపోయిన మాఫియా డాన్ అబ్దుల్ లతీఫ్ కు ఒ.పి. మాథుర్ ఏజెంట్‌గా వ్యవహరించినట్టు అతని ద్వారా దావుద్ ఇబ్రహీం, ఐ.ఎస్.ఐ.లతో సంబంధాలు కలిగి ఉన్నట్లు ఆ కథనాల్లో రాశారు. లతీఫ్ అనుచరుడు సి.బి.ఐ. ముందు ఇచ్చిన వాంగ్మూలాన్ని తమ కథనాల్లో ఉటంకించారు. పోలీస్ కమిషనర్ గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదించకుండానే కేసు ఫైలు చేశారు. ఈ ఎఫ్.ఐ.ఆర్.లో గుజరాతీ దినపత్రిక ఫోటోగ్రాఫర్ గౌతమ్ మెహతాను టైమ్స్ ఆఫ్ ఇండియా ఫోటోగ్రాఫర్‌గా పేర్కొని ఈ కేసులో ఇరికించారు. ఈ రకమైన పత్రికా స్వేచ్ఛపై దాడిని జూన్ 2న భారత పత్రికా సంపాదకుల సంఘం ఒక ప్రకటనలో తీవ్రంగా ఖండించింది. పత్రిక భావ ప్రకటనా స్వేచ్ఛపై సంఘపరివార్ శక్తుల నాయకత్వం, పాలకపక్షాలు చేస్తున్న దాడిగా సఫ్దర్ హష్మి మెమోరియల్ ట్రస్ట్ ఈ చర్యను తీవ్రంగా ఖండించింది. పత్రికా సంపాదకుడు, విలేకరులపై పెట్టిన తప్పుడు కేసును వెంటనే ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేసింది.

## పెట్టుబడులకు ఎర్రతివాచి

జూన్ 2న ఢిల్లీలో అసోచాం 87వ వార్షిక సమావేశంలో హోంమంత్రి శివరాజ్‌పాటిల్ మాట్లాడుతూ పారిశ్రామికవేత్తలకు కేంద్ర ప్రభుత్వం అన్ని విధాలా అండదండలు అందిస్తుందని హామీ ఇచ్చారు. విదేశీ పెట్టుబడులను ఆకర్షించడానికి మావోయిస్టుల సమస్యే ప్రధాన అడ్డంకిగా ఉందన్నారు. ఈ సమస్యను సమర్థవంతంగా ఎదుర్కోవడానికి ముప్పై ఏడు వేల పారామిలటరీ దళాలు, అధికారులను ఆయా ప్రాంతాల్లో నియమిస్తున్నట్లు తెలిపారు. గతంలో ప్రభుత్వ ఆస్తులపైననే దృష్టిపెట్టిన నక్సల్స్ ఇప్పుడు పరిశ్రమలపైనా దాడులు చేస్తున్నారన్నారు. ఆంధ్రప్రదేశ్, చత్తీస్‌గడ్, ఒరిస్సా, జార్ఖండ్, బీహార్‌లతో పాటు దాదాపు పన్నెండు రాష్ట్రాల్లో మావోయిస్టుల సమస్య ఎక్కువగా ఉందన్నారు.

## గుజ్జర్ల పోరాట ఫలం

షెడ్యూల్డ్ తెగల హోదా కోసం పోరాడుతున్న గుజ్జర్లకు రాజస్థాన్‌లోని బి.జె.పి. ప్రభుత్వం మధ్యేమార్గం కనుగొన్నది. ముఖ్యమంత్రి వసుంధర రాజే గుజ్జర్లను అత్యంత వెనుకబడిన వర్గం (మోస్ట్ బ్యాక్‌వర్డ్ క్లాస్ – ఎం.బి.సి.)గా గుర్తించి ఐదు శాతం రిజర్వేషన్ కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. అదే సమయంలో ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు పద్నాలుగు శాతం కోటాను ఏర్పాటు చేయదలచింది. దాదాపు నెలరోజులుగా జరిగిన ఆందోళనకు రాజస్థాన్ ప్రభుత్వం తెరదించింది. గుజ్జర్ల ఉద్యమ క్రమంలో 43 మంది అసువులు బాసారు.

## దినపత్రికల మార్కెట్‌లో భారత్‌కు రెండో స్థానం

వరల్డ్ అసోసియేషన్ ఆఫ్ న్యూస్ పేపర్ తన పరిశోధనా నివేదికలో భారతదేశం దినపత్రికల మార్కెట్‌లో రెండవ స్థానంలో ఉందని వెల్లడించారు. ప్రతిరోజు 107 మిలియన్ కాపీల అమ్మకాలతో చైనా మొదటి స్థానంలో, 99 మిలియన్ కాపీలతో ఇండియా రెండవ స్థానంలోను, 68 మిలియన్ కాపీలతో జపాన్ మూడవ స్థానంలో, 51 మిలియన్ కాపీల అమ్మకాలతో అమెరికా నాలుగవ స్థానంలో ఉన్నాయి. ప్రపంచంలో అమ్ముడవుతున్న, బహుళ ఆదరణ పొందిన వంద పత్రికలలో 74 పత్రికలు ఆసియాలోనే ప్రచురితమవుతున్నాయి. ◆

## నేపాల్‌లో రాజరికం రద్దు

నేపాల్ ఎన్నికలలో మెజారిటీ సాధించిన మావోయిస్టులు, ఇతర రాజకీయపార్టీలతో కలిసి ప్రభుత్వం ఏర్పరచడం గురించిన చర్చలు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. అయితే, నేపాల్‌లో రాజరికాన్ని రద్దు చేసి, నేపాల్‌ని రిపబ్లిక్‌గా ప్రకటించడం, నేపాల్ రాజు జ్ఞానేంద్ర రాజభవాన్ని ఖాళీ చెయ్యడం, దానిని మ్యూజియంగా ప్రకటించడం జరిగిపోయాయి. నేపాల్ దేశాధ్యక్ష పదవి, ప్రధానమంత్రి పదవి ఎవరికివ్వాలనే దాని మీద మావోయిస్ట్, నేపాల్ కాంగ్రెస్, మార్క్సిస్ట్ - లెనినిస్ట్ పార్టీల మధ్య ఏకాభిప్రాయం ఇంకా కుదరలేదు. ప్రధానమంత్రి పదవికి సంబంధించి నేపాల్ కాంగ్రెస్, మార్క్సిస్ట్-లెనినిస్ట్ పార్టీలు ప్రతిపాదించిన రాజ్యాంగ సవరణలు కూడా మావోయిస్ట్‌లకి నచ్చక పోవడంతో పార్టీల మధ్య భిన్నాభిప్రాయాలు తలెత్తాయి.

## అమెరికా అధ్యక్ష పదవి పోటీలో మొదటి ఆఫ్రికన్ అమెరికన్



డెమోక్రటిక్ పార్టీకి చెందిన హిల్లరీ క్లింటన్, బారక్ ఒబామాల మధ్య అమెరికా అధ్యక్ష పదవి ప్రతిపాదన కోసం కొన్ని నెలల పాటు తీవ్రంగా జరిగిన పోటీ చివరికి ఒబామా గెలుపుతో ముగిసింది. అమెరికా అధ్యక్ష పదవి పోటీకి మొదటి మహిళగా క్లింటన్, మొదటి నల్లజాతీయుడుగా ఒబామా ఒకే పార్టీ నుంచి అభ్యర్థిత్వం కోసం పోటీపడ్డారు. అమెరికా రాజకీయరంగంలో చరిత్ర సృష్టించారు. ఒబామా అభ్యర్థిత్వం ఖరారు అయ్యాక తన పూర్తి మద్దతు ఒబామాకు ఇస్తానని హిలరీ క్లింటన్ ప్రకటించారు. నవంబర్‌లో జరగనున్న అమెరికా అధ్యక్ష పోటీలో డెమోక్రట్ ఒబామా గెలిచినా, రిపబ్లికన్ జాన్ మెకెయిన్ గెలిచినా అమెరికా విదేశాంగ విధానంలో పెద్దగా మార్పులేమీ ఉండబోవని అంచనా. అయితే, అంతర్గత వ్యవహారాల్లో, ఆర్థికరంగ విధానాల్లో కొన్ని తేడాలు ఉండవచ్చు.

## ఆంగ్ సాన్ సూకీ గృహ నిర్బంధం పొడిగింపు

మయన్మార్ ప్రతిపక్ష పార్టీ నేషనల్ లీగ్ ఫర్ డెమోక్రసీ (ఎన్.ఎల్.డి.) నేత ఆంగ్‌సాన్‌సూకీ గృహ నిర్బంధం గడువును సైనిక ప్రభుత్వం మరో ఆరు నెలలు పొడిగించింది. ఆమె 2003 మే నుంచి అంటే ఐదేళ్లుగా గృహ నిర్బంధంలో ఉన్నారు.

## అంతర్జాతీయంగా పెరుగుతున్న ఆహార, పెట్రోల్ ధరలు

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ ఆహార ధరలు మూడేళ్లలో రెండింతలు పెరగడం, ఎరువుల కొరత ఏర్పడడం, ప్రపంచ వ్యాప్తంగా చమురు ధరలు పెరగడంతో తీవ్ర ఆహార కొరత ఏర్పడింది. దీనితో ఈజిప్ట్, హైతీ, కామెరూన్, ఇథియోపియా, మడగాస్కర్, ఫిలిప్పీన్స్, ఇండోనేషియా తదితర దేశాల్లో పెద్ద ఎత్తున అల్లర్లు జరిగాయి. ఈ తీవ్ర ఆహార కొరత గురించి చర్చిందానికి యు.ఎన్. ఆధ్వర్యంలో ప్రపంచ నేతల సమావేశం జరిగింది. ఇందులో బయో-ఫ్యూయల్స్ కోసం ఆహార ధాన్యాలని మళ్లించడం గురించి, ఉత్పత్తులని పెంచడం గురించి చర్చించారు. మూడు బిలియన్ డాలర్లు తక్షణ నివారణ చర్యల కోసం ప్రకటించారు. అయితే, అన్ని విషయాల మీద ఏకీభావం లేనందున మళ్లీ జి-8 దేశాధ్యక్షులు కలిసినప్పుడు చర్చించాలని నిర్ణయించారు. బయో-ఫ్యూయల్స్ గురించిన నిర్ణయాలని అమెరికా వ్యతిరేకించడంతో, వాటి మీద ఏ కచ్చితమైన నిర్ణయం తీసుకోలేదు.

## ఇరాన్ మీద పెరుగుతున్న ఒత్తిడి

ఇరాన్ అణు ఇంధనం కోసం చేస్తున్న ప్రయత్నాలన్నీ అణ్వస్త్రాల కోసమేనని ఇజ్రాయిల్, అమెరికాలు ఎప్పటినుంచో వాదిస్తున్నాయి. ఇరాన్ మీద పెట్టిన ఆంక్షలేవీ పనిచేయడం లేదు కనుక ఇజ్రాయిల్ ఇరాన్ మీద దాడి కూడా చెయ్యగలదని ఇజ్రాయిల్ మంత్రి ఒకరు అన్నారు. దీనికి కొనసాగింపుగా వందకు పైగా ఇజ్రాయిల్ బాంబర్ విమానాలు మిలటరీ విన్యాసాలు చేశాయి. వీటి ద్వారా అవి ఇరాన్ వరకు దాడులు చేయగలవో లేదో ఇజ్రాయిల్ అంచనా వేసుకుంది. అంతర్జాతీయ అణు ఇంధన సంస్థ అధ్యక్షుడు మహమ్మద్ ఎల్-బారాదై ఈ విషయమై స్పందిస్తూ ఇజ్రాయిల్‌ని తప్పుపట్టారు. ఇరాన్ సమస్యని శాంతియుతంగా పరిష్కరించాలే కాని మిలటరీ దాడులతో కాదని అన్నారు. ఇరాన్ మీద దాడి జరిగితే పశ్చిమాసియా అగ్నిగుండంగా మారిపోతుందని, తాను తన పదవిలో కొనసాగనని అన్నారు.

## పాకిస్థాన్‌లో న్యాయవాదుల పోరాటం

పాకిస్థాన్‌లోని న్యాయవాదులు ముషరఫ్ తొలిగించిన న్యాయమూర్తుల కోసం మళ్ళీ పోరాట బాటపట్టారు. పాకిస్తాన్ ఎన్నికలలో గెలిచిన పాకిస్థాన్ పీపుల్స్ పార్టీ (పి.పి.పి.), పి.ఎం.ఎల్.ఎన్. పార్టీతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ఇప్పటికి న్యాయమూర్తులందరిని తిరిగి వాళ్ల స్థానాలలో నియమించాల్సి ఉండగా, అది ఇంకా జరగలేదు. అందుకు ఆగ్రహించిన న్యాయవాదులు వివిధ నగరాల నుంచి ముందుగా ముల్తాన్ నగరం నుంచి లాహోర్ మీదుగా ఇస్లామాబాద్ చేరుకున్నారు. ఈసారి న్యాయవాదులకి నవాజ్ షరీఫ్ (పి.ఎం.ఎల్.ఎన్.) నుంచి మద్దతు లభించింది. ఆఖరి నిమిషంలో పి.పి.పి. ర్యాలీకి అడ్డంకులేమీ లేకుండా చూసింది.

## ఆదివాసులకి కెనడా ప్రభుత్వ క్షమాపణ

ఆస్ట్రేలియా తర్వాత కెనడా ప్రభుత్వం తమ దేశంలోని ఆదివాసులకి క్షమాపణ చెప్పుకుంది. కెనడాలోని ఆదివాసులని, ముఖ్యంగా వారి పిల్లలని క్రూరంగా చూసినందుకు, పిల్లలని తల్లిదండ్రుల నుంచి వేరు చేసి చర్చ్ నడుపుతున్న పాఠశాలల్లో నిర్బంధంగా ఉంచినందుకు భౌతిక, లైంగిక పరమైన హింసకు గురిచేసినందుకు కెనడా ప్రభుత్వం క్షమాపణ కోరింది. ఇప్పటికీ కెనడాలో ఆదివాసుల్లో నిరుద్యోగం, దారిద్ర్యం చాలా ఎక్కువగా ఉన్నాయి. ఈ క్షమాపణని వినడానికి 12 మంది ఆదివాసుల ప్రతినిధులు పార్లమెంట్‌కి వచ్చారు. ◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 మే 2008 నుండి 20 జూన్ 2008 వరకు)**

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** |
| హైదరాబాద్ | – | – | 25 | – | – | – | 15 | 33 | – | – | 54 | 31 | – | – | – | – | – | – |
| రంగారెడ్డి | 6 | – | 27 | – | – | – | 13 | 10 | – | – | 45 | 8 | 7 | – | – | – | 9 | 8 |
| మహబూబ్‌నగర్ | 7 | – | 28 | 6 | – | – | 3 | 8 | – | 2 | 57 | 18 | 10 | – | – | – | – | 2 |
| ఆదిలాబాద్ | – | – | 26 | – | – | – | 4 | 6 | – | 2 | 24 | 35 | 10 | – | – | – | 1 | 21 |
| వరంగల్ | 9 | 2 | 70 | – | – | – | 8 | 5 | 2 | 14 | 39 | 34 | 20 | 2 | – | – | 2 | 30 |
| కరీంనగర్ | 7 | 5 | 90 | – | – | – | 11 | 6 | 1 | 3 | 27 | 52 | 39 | – | – | – | 7 | 35 |
| మెదక్ | 11 | 1 | 6 | – | – | – | – | 5 | 2 | 10 | 32 | – | 4 | – | – | – | – | 6 |
| శ్రీకాకుళం | 1 | – | 9 | – | – | – | 8 | – | – | – | 19 | 15 | 12 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | 7 | – | – | – | – | – | – | – | 24 | 14 | – | – | – | – | 4 | 11 |
| విశాఖపట్నం | – | – | 12 | – | – | – | 3 | 12 | – | 8 | 28 | 3 | 12 | 12 | – | – | 3 | 8 |
| తూర్పు గోదావరి | 1 | – | 32 | – | – | – | 6 | 6 | – | – | 55 | 37 | 11 | – | – | – | 5 | 32 |
| కృష్ణా | 2 | – | 7 | – | – | – | 11 | 1 | – | 2 | 12 | 5 | 2 | – | – | – | – | 2 |
| గుంటూరు | 4 | – | 4 | – | – | – | 11 | 13 | – | 3 | 30 | 18 | 2 | 1 | – | – | – | 4 |
| ప్రకాశం | 1 | – | 18 | – | 1 | – | 6 | 16 | – | 14 | 44 | 8 | 5 | – | – | – | – | 32 |
| చిత్తూరు | 3 | – | 17 | – | – | – | 8 | 11 | – | 11 | 35 | 5 | 8 | – | – | – | – | 6 |
| *ఇతర జిల్లాలు | 4 | – | – | – | – | – | 7 | – | – | – | 2 | 17 | – | – | – | – | – | 34 |
| మొత్తం | **56** | **8** | **378** | **6** | **1** | **–** | **114** | **132** | **5** | **69** | **527** | **300** | **142** | **15** | **–** | **–** | **31** | **231** |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు :

హైదరాబాద్ – డి. విజయభాస్కర్; రంగారెడ్డి – వి. శంకరయ్య; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; ఆదిలాబాద్ – శ్రీమన్నారాయణ మూర్తి; వరంగల్ – కె. శ్యాంరావు; కరీంనగర్ – ఎల్. సంతోష్; మెదక్ – పి. రాజు; శ్రీకాకుళం – జి. సుధీర్; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – రమణ; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; కృష్ణా – బి. రమేష్‌బాబు; గుంటూరు – బి. అంజమ్మ ; ప్రకాశం – ఎన్. రవికుమార్; చిత్తూరు – పలమనేరు బాలాజి; * ఇతర జిల్లాల సమాచారం

## వీక్షణంలో వ్యాపార ప్రకటనల గురించి....

వీక్షణం ప్రతి సంచికలోనూ అచ్చువుతున్న ప్రభుత్వ ప్రకటన గురించి, ఇటీవల అచ్చయిన కొన్ని వ్యాపార ప్రకటనల గురించి కొందరు గౌరవనీయ మిత్రులు తమ అభ్యంతరాలను, సందేహాలను వ్యక్తం చేశారు. అటువంటి అభ్యంతరాలే, సందేహాలే మరికొందరు మిత్రులలో, అభిమానులలో కూడ ఉండవచ్చు.

ఏ పత్రిక అయినా అచ్చువేసే వ్యాపార ప్రకటనలతో ఆ పత్రికకు ఏకీభావం ఉండాలనే నియమమేమీలేదు. ఆ వ్యాపార ప్రకటనలను స్వీకరించడమాలేదా అన్నది పత్రిక ఇష్టాయిష్టాలకు సంబంధించిన అంశం కాదు. పత్రికారంగ ఆర్థిక స్థితికి సంబంధించిన విషయం. ప్రస్తుత పరిస్థితుల్లో కేవలం అమ్మకాల ఆదాయం మీద మాత్రమే ఆధారపడి ఏ పత్రికా నిలదొక్కుకోవడం సాధ్యం కాదు. అమ్మకాల ద్వారా వచ్చే ఆదాయం పత్రిక ఉత్పత్తి వ్యయంలో కొంతభాగాన్ని మాత్రమే పూరించగలుగుతుంది. అందువల్లనే పత్రికారంగం సాధారణంగా వ్యాపార ప్రకటనల ద్వారా ఆ లోటును పూరించుకోవడం మాత్రమే గాక లాభాలు కూడ చేసుకుంటుంది. వీక్షణం వంటి ప్రత్యామ్నాయ పత్రికలకు లాభాల సంగతి అలా ఉంచి, కనీస మనుగడకు అవసరమైన ఆర్థిక వనరులయినా కావాలి. అందుకోసం కొన్ని వ్యాపార ప్రకటనలనయినా అంగీకరించకతప్పదు.

ప్రభుత్వం ఇచ్చే ప్రకటనలన్నిటినీ పెద్ద పత్రికలు, పాలకపార్టీ ఆశ్రిత పత్రికలు, పైరవీకారులు కబ్జా చేస్తున్నారని, ఆ ప్రకటనల విధానంలో పారదర్శకత ఉండాలని, చిన్న పత్రికలకు ప్రాధాన్యత ఉండాలని ఎంతో కాలంగా ఆందోళన జరిగిన ఫలితంగా కొన్ని సంవత్సరాల కింద ప్రభుత్వ ప్రకటనలలో చిన్న పత్రికలకు తప్పనిసరిగా కొంతభాగం కేటాయించాలనే నిబంధనలు అమలులోకి వచ్చాయి. అందువల్ల వీక్షణంకు వస్తున్న ప్రభుత్వ ప్రకటన చిన్న పత్రికల హక్కుగా వస్తున్నదే తప్ప వీక్షణంలో అచ్చయ్యే రచనల మీద ప్రభావం వేయగలిగినది కాదు. నిజానికి ఆ ప్రకటన వల్ల వీక్షణం తన వైఖరిలో ఎప్పుడయినా ఏ మెతకవైఖరినయినా ప్రదర్శించి ఉంటే ఎవరయినా దాన్ని ఎత్తిచూపి సరిదిద్దవచ్చు.

పత్రిక నిర్వహణ కొరకు వ్యాపార ప్రకటనలను స్వీకరించకతప్పని దుస్థితిలో అవి రచనల మీద ప్రభావం వేయకుండా జాగ్రత్త పడడం తప్ప ప్రస్తుతానికి మరేమీ చేయగల అవకాశం లేదు. వ్యాపార ప్రకటనలను ఎంతమాత్రం స్వీకరించబోమని ప్రకటించాలంటే పత్రికకు విస్తారమైన ప్రజాసంఘీభావం ఉండాలి. అది ఆర్థిక స్వావలంబనగా మారగలిగిన స్థితి ఉండాలి. లేకపోతే కొంతకాలం విరాళాలమీదనో, అప్పుల మీదనో నడిపి ఆ తర్వాత పత్రికను ఆపివేయడం మినహా మరోమార్గం లేదు. ఈ అంశాలను పాఠకుల, అభిమానుల దృష్టికి తీసుకురావడం మా బాధ్యతగా భావిస్తున్నాం.

### వీక్షణంలో మీ ప్రకటనలకై చెల్లించాల్సిన రుసుం

| | | |
|---|---|---|
| చివరి కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. 15,000 |
| రెండవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. 10,000 |
| మూడవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. 10,000 |
| లోపల పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో ఫుల్ పేజీ) | : | రు. 7,500 |


**వివరాలకు సంప్రదించవలసిన చిరునామా**

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : reachcdrc@yahoo.com, సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

RNI Regn.No.APTEL/2003/11482 Published 01/07/2008 PRINTED BOOK









# సుసంపన్న రాష్ట్రం వైపు అడుగులేస్తున్నాం..
# పేదల కలలను నిజం చేస్తున్నాం.

- 6.50 కోట్ల మందికి రెండు రూపాయల బియ్యం
- ఒక్కో ప్రాజెక్టు పూర్తి - ఇంతవరకూ 14 లక్షల ఎకరాలకు పైగా సాగునీరు
- రైతులకు రుణాల మాఫీ
- మహిళలకు పావలావడ్డీ క్రింద ఈ ఏడాది రూ.10 వేల కోట్లు
- రైతులకు చేనేత కార్మికులకు పావలావడ్డీ రుణం విస్తరణ
- ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీలకు లక్ష రూపాయల వరకు రుణం మాఫీ
- సంక్షేమ రంగానికి పెద్దపీట - మెస్ ఛార్జీలు 40 శాతం పెంపు
- పేదలకు రాజీవ్ ఆరోగ్యశ్రీ - త్వరలో రాష్ట్రమంతా అమలు
- అర్హులందరికీ ఇళ్లు, పింఛన్లు
- ఉపాధి హామీతో పేదలకు 100 పని దినాలు





జారీచేసినవారు : సమాచార మరియు పౌర సంబంధాలశాఖ

R.O.No.138/Sou/Advt.I/2008-09